



# ప్రతి నీటి బొట్టును వినియోగిద్దాం
# సమృద్ధిగా దిగుబడులు సాధిద్దాం

మైక్రో ఇరిగేషన్ ప్రాజెక్టు
క్రింద రూ. 1120 కోట్లతో
2.5 లక్షల హెక్టార్లలో
డ్రిప్ ఇరిగేషన్ మరియు
ఇతర సేద్యపు సౌకర్యాలు

జారీచేయువారు: సమాచార పౌరసంబంధాల శాఖ

# హాసం

హాస్య-సంగీత పత్రిక

## ఇవీ సంగతులు

58

**Also available on net: www.haasam.com**



ముఖచిత్రం

'మల్లీశ్వరి' చిత్రంలో వెంకటేష్

## హాస్యం













'సెంటర్ స్ప్రెడ్' లో




సినిమా పాటల ప్రత్యేకం

## సంగీతం



పాటల ప్రత్యేకం


71,72, 73, పేజీల్లో







అలనాటి పాటల ఔచిత్యాన్ని అభినివేశంతో అక్షరీకరించడంలో 'రాజా' శైలే వేరన్న మాటని మరోసారి చాటుకున్నారు. వేటూరిపై మీ అక్షరాలు వెలువరించిన 'మాటే పాటై జనం నోట పరిపాటై' అనే ప్రాస 'హాసం'లో ప్రింటై పాఠకుల దరహాసాల మాటై వారితో మమేకమైంది. రాముడు- భీముడు, భట్టివిక్రమార్క వంటి పాత చిత్రాల పాటలు ఏ హెచ్.ఎం.వి. వారి కలెక్షన్‌లో చూడాల్సిన పరిస్థితుల్లో వాటి స్క్రిప్టులతో సహా అందించడం వెనుక మీరు సేకరించి పొదుపు చేసిన అక్షర, దృశ్య సమాచారం ఎంత విలువైనదో మా తరానికి తప్పకుండా అర్థమౌతుంది. అలాగే పి.బి.శ్రీనివాస్, రావికొండలరావు, బాపు-రమణ, సింగీతం, చిత్తరంజన్ వంటి నిష్ణాతులతో తిరిగి కలం పట్టించే సాహసం మీకే సొంతమని చెప్పాలి. హైటెక్ యుగంలో లోప్రొఫైల్‌తో 'రాజా'గా మనగలగటం 'హాసం'కే చెల్లింది.

**- ఎం.ఎస్.ఎస్.ప్రకాష్, ఎడిటర్, ట్రేడ్‌ట్రెండ్స్, వాణిజ్యవారపత్రిక, గుంటూరు**

మీరు బహుమతిగా పంపిన (గజల్ శ్రీనివాస్ ఆడియో సి.డి) అందినది. చాలా ఆనందంతో స్వీకరించాం. 'హాసం' ప్రారంభ సంచిక నుంచి అన్ని సంచికలు సేకరించి ప్రతిరోజూ చదువుతున్నాను. ఇది ఒకరకంగా సినిమా సాహిత్యానికి ఒక 'ENCYLOPEDIA' లాగా ఉపయోగపడుతుంది. ఇతర రాష్ట్రాలలోని సాహితీ మిత్రులు (మరాఠీ సాహితీ మిత్రులకు) మన 'హాసం' చూపించి గర్వంగా ఫీలవుతున్నాం.

**- మామిడి మహేంద్ర, పూణె**

'హాసం' 1-15 ఫిబ్రవరి సంచికలో మృణాళిని గారు రాసిన "జిందాబాద్! జిందాబాద్! ఐ మొహబ్బత్ హై జిందాబాద్" ఎంతో బాగుంది. అయితే ఈ సందర్భంలో ఇంకొక సంగతి చెప్పుకోవాలి. "హిందీ సినీ గీతాలను చూస్తే నయనాల సౌందర్యానికే పెద్దపీట'' అని అభిప్రాయపడ్డారు. కాని ప్రేయసి, ప్రియురాల ముంగురుల ముగ్ధత గురించి, కేశాల అందాలను వర్ణించడంలో, హిందీ సినీ కవులదే పైచేయి. ముంగురులని ప్రస్తావించనిదే సినిమాలో కనీసం ఒక్కపాటైనా ఉండదు. ''జుల్ఫ్'' అనే పదం చాలాసార్లు మనకు వినపడుతూ వుంటుంది. దీని గురించి రచయిత్రి వేరే వ్యాసం మా కోసం రాయగలరని ఆశిస్తున్నాము.

**- కర్రి శేషగిరిరావు, హైద్రాబాద్**

'హాసం' - హాస్య-సంగీత పత్రిక అంటే మాకెంతో ఇష్టం. పత్రిక రాక కోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తుంటాం. మీ పత్రిక వెయ్యి కాలాలబాటు వుండాలని కోరుకుంటున్నాం. ఫిబ్రవరి 1-15 సంచిక మెగాస్టార్ చిరంజీవి అంజి పాటల పుస్తకం ఇచ్చినందుకు చాలా సంతోషం. ఇంతవరకు ఏ పత్రిక రాని వెరైటీగా సంచిక సంచికకు వ్యత్యాసంతో తీర్చిదిద్ది మా పాఠక లోకాన్ని అలరిస్తున్నందుకు చాలా సంతోషం.

**- సపారె ఈరన్న, ఆదోని**

1-15 ఫిబ్రవరి 2004, హాసం సంచికలో అన్ని శీర్షికలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా బ్రహ్మానందం గారి పుట్టినరోజు సందర్భంగా ఆయన నటించిన చిత్రాల వివరాలు నాకెంతగానో నచ్చింది. 'హాసం' పత్రిక ప్రతీ 15 రోజులకు కాకుండా వారపత్రిక అయితే బాగుంటుంది. ఈ కోరిక ఎప్పటికి తీరుతుందో అని ఎదురుచూస్తున్నాను.

**- పడాల రాము, పాతపట్నం, శ్రీకాకుళం జిల్లా.**

'మిస్టర్ పెళ్లాం' వెండితెర నవల ముగింపు కథ చదివాం. ఈ భాగంలోని నవలాకారుడి రచనాశిల్పం నన్నాశ్చర్య చకితుణ్ణి చేసింది. సంభాషణలు పోను మిగతా చోట్ల ఆ ప్రతిభ బాగా ఆవిష్కృతమయింది. ఇంకా కొన్ని హాస్య చిత్రాలు ఈ కలం నుంచి నవలలుగా వస్తే బాగుండునని నాలాంటివాళ్ళు ఆశించడంలో తప్పేముంది? భువనచంద్రగారి 'మా ఆవిడ ఫెమినిన్నట...'', రావికొండలరావుగారి 'హ్యూమరథం' కూడా నన్నెంతో ఆకట్టుకున్నాయి.

**-గాడేపల్లి సీతారామమూర్తి, అద్దంకి**

1-15 ఫిబ్రవరి సంచికలో మీ సంపాదకీయం అక్షరసత్యం. ఇకనైనా తెలుగు కళాభిమానులు తమ నిర్లిప్తతను విడనాడి, మన సంగీత ప్రముఖులకు జాతీయ స్థాయిలో తగు విధమైన గుర్తింపు వచ్చేలా కృషి చేయాల్సిన బాధ్యత ఉంది.

ఇదే సంచికలో ఒక మహానుభావుడు మరొక మహానుభావుడి గురించి వ్రాసిన (ఘంటసాల జ్ఞాపకాలు) చదివి కనులు చెమర్చాయి. వారి వినయం సహృదయత చూసి ఈ తరం వారు నేర్చుకోవలసినది ఎంతైనా ఉంది. ఈ సందర్భంగా 'హాసం' పాఠకులైన సంగీతాభిమానులందరికీ ఒక మనవి చేస్తున్నాను. తెలుగునాట 'లలిత' సంగీతానికి పితామహునిగా భావించవలసిన శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారి వంటి బహుముఖ ప్రతిభాశాలియైన వాగ్గేయకారునికి కనీసం 'పద్మశ్రీ' పురస్కారమైనా రాకపోవడం తెలుగువారంతా సిగ్గుపడవలసిన విషయం. ఇతర భాషలకు సంబంధించి 'రజని' ప్రతిభా విస్తృతిలో శతాంశం కూడా లేనివారు సైతం పద్మభూషణులైనారు. అస్సాంలో భూపేన్‌హజారికా కు భారతరత్న ఇవ్వాలంటూ ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి కేంద్రప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. మరి మనమో!? ఇకనైనా సంగీతాభిమానులంతా స్పందించి, మన రాష్ట్ర సాంస్కృతిక శాఖ డైరక్టర్‌కు, ముఖ్యమంత్రికి తమ తమ పార్లమెంట్ సభ్యులకు ఈ విషయమై వినతి పత్రాలు సమర్పించి ఒత్తిడి తీసుకురావాలని, కనీసం 2005 'పద్మ' పురస్కారాల జాబితాలోనైనా 85 సంవత్సరాల 'రజని' పేరు ఉండేలా ప్రయత్నించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

**-ఎం.వి.ఎస్.ప్రసాద్, ప్రాంతీయ వార్తా విభాగం, ఆకాశవాణి, విజయవాడ**

ఫిబ్రవరి మొదటి పక్షం చేతుల్లో వాలి ఆసాంతమూ చదివించింది. ముఖ చిత్రానికి కత్రినాకైఫ్‌తో "లైఫ్'' వచ్చింది. ఈ ఉత్తరం రాయటానికి కారణం ''వాలంటైన్ డే'' సందర్భంగా మృణాళిని గారు రాసిన వ్యాసం! ఎంత చక్కగా రాసారు ఆవిడ! హృదయాలను మరో లోకాలకు కొనిపోయే ఎన్నో అద్భుత పల్లవులను, చరణాలను గుర్తు చేసారు. ఆవిడకు ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. ఇకపోతే అలనాటి ప్రముఖ గాయని 'సురయ్యా' ఇటీవల యాక్సిడెంట్‌కు గురై మరణించింది. వీలయితే ఆవిడ జీవిత విశేషాలు తెలుపవలసిందిగా కోరుతున్నాను. ఈ సంచికలో నాకు ఎంతో సంతోషాన్ని ఇచ్చింది. ఘంటసాల మరియు నందమూరి గార్ల దస్తూరీలు! పదికాలాల పాటు మా కోసం 'హాసం' వర్ధిల్లాలని కోరుకుంటూ...

**- బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్.**

1 మరియు 16 తారీఖులకై 'హాసం' పాఠకులందరిలాగే నేనూ ఎదురుచూస్తాను. ఐతే ఈసారి మా ఏరియా (బోయినపల్లి)లో 'హాసం' పత్రిక నా చేతికి అందిన దానికంటె ముందు 'హ్యూమర్‌బాక్స్'లో ప్రచురితమైన నా జోక్స్‌కి ప్రకటించిన బహుమతి, ముందుగా అందడం నన్ను విభ్రాంతికి లోను చేసింది. ధన్యవాదములు!

సిని'మా' లోకానికి, సినీ సంగీత లోకానికి సంబంధించి చక్కటి సమాచారాన్ని సేకరిస్తూ, అందిస్తూ, ఎంతో చక్కగా 'హాసం'ని తీర్చిదిద్దుతున్న మీకు 'హాసం' పాఠకుడిగా నా అభినందనలు తెలుపుకుంటున్నాను.

**-జొన్నకూటి మార్టిన్ ఫిన్‌రె, హైదరాబాద్.**

మీరు బహుమతిగా పంపిన సి.డి (ఓరినీ ప్రేమ బంగారంగానూ...) స్వీకరించామని తెలియచేయుటకు సంతోషించుచున్నాము. బహుమతిగా ప్రకటించిన వెంటనే బహుమతి పంపినందుకు మీకు నా ధన్యవాదాలు. మీ పత్రిక ఇంకా ఉన్నత స్థాయికి ఎదగాలని కోరుకుంటూ...

**- ఎం. శ్రీలత, పూణె**

హ్యూమర్‌బాక్స్‌లో నా జోకులు ప్రచురించి అందుకు పారితోషకంగా 'నిజం' ఆడియో సి.డి.ని పంపించినందులకు 'నిజం'గా సంతోషంగా వుంది. 'హా' అంటే హాయిగా..'సం' అంటే సంతోషంగా వుండాలంటే 'హాసం' చదవాలనేది నా అభిప్రాయం. 'హాసం' కుటుంబంలో నేనూ పాలుపంచుకుంటున్నందులకు ఆనందంగా వుంది. సాహిత్యాభిమానుల్నీ, సంగీతాభిమానుల్నీ అలరించే ఏకైక పక్ష పత్రిక 'హాసం' అనటం ఏ మాత్రం అతిశయోక్తి కాదు.

**-భమిడిపాటి వెంకటేశ్వరరావు, హైదరాబాద్**

సంపుటి: 3 సంచిక:10

16-29 ఫిబ్రవరి 2004

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య - సంగీత పత్రిక

58

గుర్తింపు రావాలంటే రెండు మార్గాలున్నాయి. కొత్తగా ఆవిష్కరించడం, లేదా పాతను కొత్తరీతిలో ప్రదర్శించడం. రామాయణం లాటి కావ్యం మళ్లీ సృష్టించలేకపోవచ్చు. కానీ రామాయణగాథను మరింత విశదంగానో, కొత్తవర్ణనలతోనో చెప్పవచ్చు. పాత్రల ఔచిత్యం దెబ్బతినకుండా జాగ్రత్తపడుతూ నాటకీయత కోసం కొన్ని సంఘటనలు చేర్చవచ్చు. సీతారాముల పెళ్లిభోజనాలలో బూరెలు తిన్నారని విశ్వనాథవారన్నా జనం తర్కించలేదు. కానీ రామాయణగాథద్వారా ఆనాటి సామాజిక పరిస్థితులను విశ్లేషించబూనిన రంగనాయకమ్మగారు ఆ క్రమంలో ముఖ్యపాత్రలను అగౌరవ పరచడం విమర్శలకు తావిచ్చింది.

రామాయణాన్ని రావణపరంగా చెప్పినా, సీతపరంగా చెప్పినా, లేదా శబరిని ముఖ్యపాత్రగా చేసుకుని చెప్పినా ప్రధానపాత్రల స్వరూపస్వభావాలను వికృతీకరించనంతవరకు అవి ప్రజల ఆమోదం పొందుతూనే ఉంటాయి. ఎందుకంటే ఆ కావ్యంలోని పాత్రలు, సంఘటనలు ఒక ఉద్దేశ్యంతో రూపొందించబడ్డాయి, ఒక సూత్రంలో బంధించబడ్డాయి. వాటిని సందర్భశుద్ధి లేకుండా విపరీతపరిస్థితుల్లో ఉపయోగిస్తే వెగటు పుట్టక తప్పదు.

నేడు రీమిక్స్ పరిశ్రమలో ఉన్నవారందరూ ఈ విషయం గుర్తెరగాలి. వీరు తమ నూతన భావాలను గేయరూపంగానూ, నృత్యరూపంగానూ ఆవిష్కరించ సమర్థులే కావచ్చు. కానీ పాతపాటలపై గౌరవంతోనో, సుపరిచితమైన పాటలను కొత్తగా అందిస్తే వెంటనే గుర్తింపు లభిస్తుందనో, మార్కెటింగ్ చేయడం సులభమనో , ఏదో ఒక కారణంతో - శ్రవ్యపరంగానో, దృశ్యపరంగానో - రీమిక్స్ తోవ ఎంచుకోవడం జరుగుతోంది.శ్రవ్యపరమైనవాటి గురించి చెప్పుకుంటే - వాయిద్యాలు జోడించడం, బీట్ మార్చడం కూడా ఒక హద్దుకి మించి వెళ్లకూడదు. 'నమో వెంకటేశా ' పాటను రీమిక్స్ చేస్తూ బ్యాంగోలు, ట్యాంగోలు చేరిస్తే దేవుడికి పిజ్జా నైవేద్యం పెట్టినట్లే అనిపిస్తుంది. తిన్నడు పెట్టిన పచ్చిమాంసం తిన్న దేవుడు పిజ్జా తినడా అని తర్కించవచ్చు. కానీ అది హాస్యసన్నివేశానికే పనికివస్తుంది!

దృశ్యపరంగా వచ్చేసరికి మరిన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ఒక సినీగీతాన్ని ఎంచుకున్నప్పుడు ఆ పాట సన్నివేశాన్ని ఎలా సంకల్పించారు, ఎలా చిత్రీకరించారు అన్నవిషయాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. ఆ పాటను ఆ రూపంలో కోట్లాది ప్రేక్షకులు చూసి తమ మనసులలో ముద్రించుకున్నారు అన్న విషయం ఘడియపాటుకూడా విస్మరించరాదు. తమ మనసులో ఎప్పటినుండో ఉన్న ఇమేజికి భిన్నంగా ఈనాడు వేరేదైనా చూపిస్తే వారు జీర్ణం చేసుకోలేరు అని గుర్తుంచుకోవాలి.

భగ్నప్రేమికుడి పాటని కొత్తగా తయారుచేయడమెందుకు, దేవదాసు పేరును సొమ్ము చేసుకుందామనుకుని 'జగమేమాయ'ను ఆధునీకరణ ముసుగులో విచిత్ర వేషధారణతో పదిమంది అమ్మాయిలు అంగవిన్యాసాలు జోడించి చూపించారనుకోండి. ఎంత వెగటుగా ఉంటుంది!? చిన్నప్పటినుండి చీరలో చూసిన మాతృమూర్తి హఠాత్తుగా జీన్స్‌లో కనబడినంత కంగారుగా ఉంటుంది. అలాగే 'కలవరమాయె మదిలో' పాట వినగానే అమాయకుడయిన తోటరాముడు, మనోహరంగా ఉన్న రాకుమారి కళ్లకు కడతారు. ఆ పాట పాడుతూ స్టేజిపై ఎవరైనా గంతులు వేస్తే ఎంత షాకింగ్‌గా ఉంటుంది!?. అంతగా అయితే కొత్తపాటను సృష్టించండి, పాతదానిని తగలేయడమెందుకు? అని అడగబుద్ధవుతుంది.

ఈనాడు స్టేజిషో నిర్వహణ పెద్ద ఎంటర్‌టైన్‌మెంటు బిజినెస్‌గా మారింది. పాతపాటలను, సీనియర్ కళాకారులను వ్యాపారాత్మకంగా ఉపయోగించుకుంటున్నారు. మంచిదే! వాటిని ఈనాటి సేలబుల్ స్టార్లపరంగా ప్రజల కందించబూనుతున్నారు. ఫర్వాలేదు. కానీ ఆ క్రమంలో ఆ యా గీతాల సృష్టికర్తలకు అన్యాయం జరగకూడదు. ప్రజలలో ఇన్నాళ్లుగా పాదుకున్న ఆ సినీగీతకారులు, సంగీతకారులు, చిత్రీకరించిన దర్శకులు, అభిరుచి కనబరచిన నిర్మాతలు, అభినయించిన కళాకారులు, మనసులో పదిలంగా పాదవుకున్న రసజ్ఞులు - వీరందరిపట్లా గల గౌరవాభిమానాలతో 'హాసం' ఈ విజ్ఞప్తి చేస్తున్నది.





ప్రముఖ సినీ గీత రచయిత
**శ్రీ భువనచంద్ర**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**మా ఆవిడ ఇంతే మరి మీ ఆవిడ?-4**

# యథా అత్తా... తథా కోడలు




"డాటరిన్లాలూ డయాబెటిక్కూ ఒకటే" డిక్లేర్ చేసింది మా ఆవిడ.

"శభాష్" మెచ్చుకోలుగా అంది సరస్వతీ అయ్యంగార్.

"మదరిన్లాలూ మలేరియా కూడా ఒకటే" రిటార్టిచ్చింది మా కోడలు.

"హియర్ హియర్" జబ్బలు చరుస్తూ మా కోడలికి సపోర్టిచ్చింది కోకిలా అయ్యంగార్.

"ఆర్డర్...ఆర్డర్..." సుత్తితో టేబుల్ మీద కొడుతూ ఆపటానికి ప్రయత్నించాను.

"సైలెంటుగా ఉండాలి..." మధ్యలో దూరాడు నటరాజన్.

"ఎందుకుండాలీ? ఆవిడ మమ్మల్ని డయాబెటిక్‌తో పోలిస్తే వూరుకోవాలా?" అరిచింది శ్రీమతి నుశీలా నటరాజన్... మొగుడివంక కోపంగా చూస్తూ.

"పెద్దాచిన్నా వుండఖ్ఖర్లేదా? అత్తల్ని మలేరియాతో పోలుస్తారా?" అరవంలో కోడల్ని గదమాయించింది శ్రీమతి అలకా రంగరాజన్.

"ఇంతకీ నన్నీ పంచాయితీ నడపనిస్తారా లేదా?" చికాగ్గా అన్నాను.

"ఓకె ప్రొసీడ్" అంది మా ఆవిడ.

"ఐహావ్ నో అబ్జక్షన్" తల ఎగరేసి అంది మా కోడలు.

పూర్వాపరాలు ఏమిటంటే -

అప్పుడెప్పుడో బెజవాడ వెళ్ళినప్పుడు బుద్ధి గడ్డితిని మా ఆవిడకి 'పెదరాయుడు' సినిమా చూపించా. అప్పటినుంచీ నా తల ప్రాణం తోకకి వస్తోంది. మావాడూ కోడలూ పోట్లాడుకున్నా - వీధిలో ఎవరు ఎవరితో పోట్లాడుకున్నా - ఏ ఇంట్లో పనిమనిషికీ యజమానురాలికీ తగాదా వచ్చినా... మా ఆవిడే పంచాయితీ పెద్ద అయిపోతుంది. 'పెదరాయుడి తండ్రి 'పాపారాయుడి' లాగా భుజంమీద ఓ టవలు వేసుకుని మరీ తీర్పులు చెబుతోంది. (చుట్ట మాత్రం లేదు. అది కూడా వుంటే నేనేనాడో సన్యాసంలో కలిసేవాడిని).

మా ఆవిడ పంచాయితీ ఎంత ఫేమస్ అయిందంటే - మా వలసరవాక్కం వాళ్ళేకాక చుట్టుపక్కలవున్న 'ఆళపాక్కం'నించి 'విరుగంబాకం' నించీ 'మదురవాయిల్' నించీ కూడా జనం వస్తున్నారు. 'సండే' వస్తే నా గుండె 'మండి' పోతోంది. వచ్చిన వాళ్ళకి మంచినీళ్ళు కాఫీ సరఫరానే కాదు... వంటా గింటా కూడా నా నెత్తిన పడ్డై. కుదరదంటే మరో పంచాయితీ. మనకి 'పాట' పవరేగానీ 'మాట' పవర్ లేదుకదా! అందుకే చచ్చినట్లు భరిస్తున్నాను.

ఇహ విషయానికి వస్తే -

"మీరు డాటరిన్లాని డయాబెటిక్‌తో పోల్చడం తప్పుకాదా?" మా ఆవిడ్నడిగా

"నో యువరానర్...!" నేను చెప్పింది ముమ్మాటికీ కరెక్టే! డాటరిన్లా అయినా డయబెటిక్సైనా ఒక్కసారి ఇంట్లోనూ ఒంట్లోనూ ప్రవేశిస్తే చచ్చేదాకా పోవు! చచ్చినట్టు భరించాల్సిందే..!" వివరించింది మా ఆవిడ.

"భేష్ భేష్" అరిచారు అత్తగార్లు.

"మీరేమంటారు డాటరిన్లాగారూ? మలేరియాతో మదరిన్లాని ఎందుకు పోల్చారు?" మా కోడల్నడిగా.

"నేను చెప్పిందీ కరెక్టే యువరానర్...! మలేరియా వస్తే ఎంత నీరసింప చేస్తుందో... ఎంత ఒణికిస్తుందో... మదరిన్లా వచ్చినా అంతే! 'లారియాగో' తగిలిస్తే మలేరియా తగ్గుతుంది. ఏమందేసినా మదరిన్లా పొగరు - సారీ - పవరు తగ్గదుకాక తగ్గదు!" వాదించింది మా కోడలు.

"సూపర్బ్...సూపర్బ్..." చప్పట్లు చరిచారు కోడళ్ళు.

"ఎప్పుడూ నువ్వే పంచాయితీ పెద్దవా? నన్నుకూడా ఓ సారి పెద్దని చేస్తే నీ సొమ్మేం పోయిందీ? ఏమైనాసరే యీ వారం నేనే జడ్జినవుతా" అని అలిగి మరీ పెదరాయుడి సీట్లో కూచోటం నా ప్రారబ్ధం. ఇవ్వాళ 'అత్తాకోడళ్ళ' పంచాయితీ అని ముందుగా తెలిసుంటే ఛస్తే ఒప్పుకుని ఉండేవాణ్ణి కాదు. రోట్లో తలపెట్టాక




చేసేదేవుంది?

"ఓకె ఇంతకీ మీ కోడలు మీద మీరిచ్చే కంప్లయింట్ ఏమిటీ?" అయోమయంగా మా ఆవిడ్నడిగా. (వాళ్ళిద్దరూ చెట్టాపట్టా లేసుకుని మరీ జనాన్ని 'ఆడిపోసుకోవటం' వెయ్యిసార్లు విన్నాను. మా ఆవిడ 'పంది'ని చూపించి 'నంది' అంటే మా కోడలు వెంటనే దానికి పూజ చేసి హరతిచ్చి మరీ వస్తుంది. మరివ్వాళ ఈ గోలేంటి?)

"నా కంప్లయింటు నా కోడలు మీద కాదు యవరానర్... కోడళ్ళమీద! తన పుట్టింటి వాళ్ళే 'గొప్ప'వాళ్ళనుకుంటూ అత్తమావల్ని చులకనగా చూసే దగాకోరు డాటరిన్లాస్ మీద..! మేము కన్న సంతానాన్ని వాళ్ళ 'కొంగు'కి కట్టుకుని తోలుబొమ్మలాటాడే తింగరి కోడళ్ళమీద! - ఇంటిపనీ వంటపనీ అత్తకో అడబడుచుకో వప్పజెప్పేసి మొగుడితో సినిమాలకీ షికార్లకీ తిరిగే బలాదూర్ బహురాణీలమీద...!!!" ఆయాసంతో ఆగింది మా ఆవిడ.

"నా కంప్లైంటూ మా అత్తగారి మీద కాదు యువరానర్ - అత్తా ఒకింటి కోడలే అని మరిచిపోయి కోడళ్ళని కాల్చుకు తినే అత్తలమీద! అధికారం తప్ప అనురాగం ఎరగని అన్‌సివిలైజ్‌డ్ 'సాస్'ల మీద! వాళ్ళ కొడుకుల్ని మేం కొంగుకి కట్టేసుకున్నా జడకి ముడేసుకున్నా అది వాళ్ళ వంశాభివృద్ధికే అని తెలియని డేంజరస్ మదరిన్లాస్ మీద!" తనూ కాస్త ఆయసపడుతూ అంది మా కోడలు.

"ఓకె మీ ఇద్దరి మధ్యా ఏ గొడవా లేకపోయినా యూనివర్సల్‌గా వున్న అత్తా కోడళ్ల సమస్య పంచాయితీకి తెచ్చినందుకు అభినందిస్తున్నా! మీ వాదన ప్రారంభించవచ్చు!" తేలికైన మనసుతో నిట్టూరుస్తూ అన్నా.

"మా ఇద్దరి మధ్యా గొడవల్లేవని నేనన్లేదే?" సీరియస్‌గా అంది మా కోడలు. గొంతులో పచ్చివెలక్కాయ పడటం అంటే ఏమిటో నాకు ప్రాక్టికల్‌గా తెలిసొచ్చింది.

"మరి?" గొంతు సవరించుకుని అన్నా.

"గొడవలు ఉన్నై! అందుకే పంచాయితీ పెట్టాం!" అన్నారిద్దరూ కోరస్‌గా.

"ఏమిటా గొడవలు?"

"నంబర్‌వన్... భార్యా భర్తల మధ్య కొద్దో గొప్పో సీక్రెట్స్ అనేవి ఉండాలా వద్దా?" అడిగింది కోడలు.

"అంటే?" బుర్రగోక్కుంటూ ప్రశ్నించా. (నాకూ మా ఆవిడకీ మధ్య మహావుంటే గిల్లికజ్జా లుంటాయేమో గానీ ఇంతవరకూ సీక్రెట్సు లేవు).

"అంటే... ఎప్పుడైనా నా కష్టం సుఖం మా ఆయనకి చెప్పుకుంటే ఆయన ఓపిగ్గా విని పరిష్కరించాలి. నా మాటల్ని తన గుండెల్లోనే



దాచుకోవాలి. అంతేగానీ - పుసిక్కున వాళ్ళమ్మకి ఫోన్‌చేసి 'అమ్మా... నీ కోడలు ఇలా అందే... అలా అందే' అని చెప్పడం ధర్మమా యువరానర్?" ఉద్రేకంగా అడిగింది మా కోడలు.

"అలా చెప్పటం మీ ఆయన తప్పవుతుంది గానీ నా తప్పెలా అవుతుందీ?" లాపాయింటు లాగింది మా కూచిపూడిది.

"శభాష్" అత్తగార్లందరూ మా ఆవిడ్ని మెచ్చుకోలుగా చూస్తూ అన్నారు.

"ముమ్మాటికీ తప్పే యువరానర్! ప్రతిదీ అమ్మతోటె చెప్పే 'అమ్మకూచి'గా మగాడ్ని తయారు చెయ్యడం తల్లుల తప్పుకాదా?"

తనూ ఓ పాయింటు లాగింది కోడలు.

"గ్రేట్!" సంతోషంగా చప్పట్లు చరిచారు కోడళ్ళు.

"ఓహో...'అమ్మకూచి'గా తయారు చేయడం 'అమ్మ'ల తప్పైతే 'పెళ్ళాల కూచి'గా తయారు చెయ్యడానికి ప్రయత్నించడం పెళ్ళాల తప్పు కాదా? పాతికేళ్ళు పెంచి పెద్దచేసి ప్రయోజకుడ్ని చేసిన కొడుకుని - ఎవర్తో కోన్‌కిస్‌కాది కోడలై వచ్చి నానావగలూ వొలకపోసి కన్నవాళ్ళకి దూరం చెయ్యాలని ప్లాన్లు వెయ్యడం మీ కోడళ్ళ పచ్చి స్వార్థానికి నిదర్శనం కాదా? వాడిలో ఇంకా మంచితనమూ గౌరవమూ వుండబట్టే అన్ని విషయాలూ తల్లికి చెప్పుకుంటాడు. అంత చిన్న విషయాన్ని ఇంత పెద్ద 'ఇష్యూ'గా తయారు చెయ్యడం కోడళ్ళ 'తెంపరితనం కాదా?' ద్విగుణీకృతోత్సాహంతో వాదించింది మా ఆవిడ.

"తెంపరితనం అనే మాటని వేం సహించం! మొదట ఆ పదాన్ని రికార్డ్నించి తొలగించండి యువరానర్! అదీగాక మా అత్త మాటల్నీ ఆజ్ఞల్నీ వాళ్ళాయన - అంటే మా మావగారు తూచా తప్పకుండా పాటించాలి. నా




మాట మాత్రం మా ఆయన వినకూడదు! ఇదెక్కడి న్యాయం? ముందుగా నేను మనవి చేసుకున్నట్లు - అత్తా ఒకింటి కోడలే అని మరిచిపోయి నానా రభసా చెయ్యడం, కోడళ్ళని ఆడిపోసుకోవటం తప్ప అత్తగార్లవల్ల మాకు ఏం సుఖం ఉందీ? వాళ్ళ కూతురూ అల్లుడూ వస్తే మేం చచ్చేట్టు చాకిరీ చెయ్యాలా? ప్రతి పండక్కీ అల్లుడ్నీ కూతుర్నీ ఇంటికి పిలిపించుకోవాలనీ వాళ్ళకి రాజభోగాలు అమర్చాలనీ ఈ 'అత్త'లనబడే 'కత్తు'లు ఆలోచిస్తారు తప్ప - మేమూ ఓ అమ్మా అబ్బకి పుట్టాం... మా వాళ్ళకీ మేమంటే ఆపేక్షలుంటాయని ఎన్నడైనా గ్రహించారా? మన కూతురూ అల్లుడూ ఇంటికొస్తే సంతోషిస్తున్నాంగదా... అట్లాగే కోడల్నీ కొడుకునీ కూడా వాళ్ళ పుట్టింటికి పంపితే వాళ్ళ వాళ్ళూ సంతోషిస్తా'రని ఒక్కసారైనా యీ మదరిన్లాస్ ఆలోచిస్తారా?" ఉపన్యాసం దంచేసింది మా కోడలు.

"you said it" కోడళ్ళంతా ఉత్సాహంతో అరిచారు. నటరాజన్ కోడలు 'ఈల' కూడా వేసిందని నా అనుమానం.

"శభాష్.! గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందన్నట్టు గొప్పగా ఆర్గ్యూ చేశావు. అత్తలు 'కత్తు'లైతే కోడళ్ళు 'కొడవళ్ళు'కాదా? కూతురూ అల్లుడూ ఎప్పుడో ఒకసారి వస్తారు గనుక ఆ నాలుగు రోజులూ వాళ్ళ ముద్దూ ముచ్చటా తీర్చాలని ఏ తల్లి అయినా అనుకుంటుంది. రేపు నువ్వైనా అంతే. అదే తల్లి 'మనసు' అంటే! ఆ మనసుని అర్థం చేసుకోలేక 'అత్తరికా'నికి అంటగొట్టిన నీకూ నీ బ్రెయిన్‌కీ నా జోహార్లు. మీ ఆయన్ని నువు మీ పుట్టింటికి తీసికెళ్తే మీ అమ్మా నాన్నా చూపించేవి ఆదరాభిమానాలా? అదే నేను నా కూతురికీ అల్లుడికీ చూపిస్తే 'రాజభోగాలా?' ఓసినా కోడలు కొరివీ - ఇంత సేపట్నించీ కోడళ్ళని ఎలా చూసుకోవాలో" అని అత్తలకి నీతులు చెబుతున్నావు గానీ, నువ్వూ నీ మొగుడూ నీ పుట్టింటికెళ్ళినప్పుడు మీ ఒదిన చేత ఎందుకు 'సేవలు' చేయించుకున్నావూ? నువ్వు చేస్తే 'చాకిరీ'నా? మీ వదిన చేస్తే బాధ్యతా? మరి అంతటి విశాలహృదయం గలిగిన మీ పుట్టింటి వాళ్ళుకూడా - మీ వాదిన్నీ అన్నయ్యనీ మీ ఒదినా వాళ్ళింటికి ఎందుకు పంపట్లేదూ? వాళ్ళకి బుద్ధిలేకపోతే నీ బుద్ధి ఏమయిందీ? మీ అమ్మానాన్నని ఒప్పించి మీ ఒదిన్ని పుట్టింటికి పంపొచ్చుగా? ఊహు! అలా చెయ్యవు. ఎందుకంటే - అత్తగార్ని 'భూతద్దం'లోంచీ అమ్మని 'కూలింగ్ గ్లాస్' లోంచీ చూడ్డం నీ కలవాటు. నీకే కాదు.. మీ కోడళ్ళ 'జాతికే' అలవాటు. మీ అన్నయ్య మీ వదిన మాట వింటే - 'మా వదిన మహా గడుసుది సరళా... మా అన్నయ్యని వెర్రివెంగళాయిని చేసింది' అని ఎదురింటి దానితో ఆక్షేపిస్తావు. అదే నువ్వు నీ మొగుడ్ని లొంగదీసుకోవటానికి మాత్రం లక్షసార్లు ప్రయత్నిస్తావా? నీకో ధర్మం మీ వదినకో ధర్మమూనా? ఖబడ్దార్... నీ చచ్చు తెలివి తేటలు నా ముందు కాదు!" కోడలికి వార్నింగిచ్చింది మా ఆవిడ.

"హుర్రే...హుర్రే" అత్తలందరూ (కీళ్ళనెప్పుల కమలమ్మ గారితో సహా) లేచి నిలబడి మరీ మా ఆవిడ్ని అభినందించారు.

"కూతుర్నీ అల్లుడ్నీ మర్యాదగా చూడ్డం తప్పని నేనన్లేదు అత్తగారూ,... మాకు తెలీకుండా వాళ్ళకి నగా నట్రా దోచి పెట్టటం మీ తప్పంటున్నా" ఎకసక్కెంగా అంది మా కోడలు.

"ఆ విషయం ఋజువు చెయ్యగలవా?" ఛాలెంజ్ చేసింది మా ఆవిడ.



"మీ అమ్మాయికింకా పెళ్ళికాలేదాయే! మీ విషయంలో నేనెందుకంటానూ? ఫరెగ్జాంపుల్ అలకారంగరాజన్ గార్నే చూడండి...! మొన్న పొంగల్‌కి కొడుకూ కోడలూ రాగానే సుశీలకీ వాళ్ళాయనకీ తెలీకుండా కూతురికి గొలుసూ అల్లుడికి ఉంగరం ఇచ్చారో లేదో అడగండి?" అగ్గిపుల్ల వెలిగించింది మా కోడలు.

"ఏమిటమ్మాయ్ నువ్వనేదీ? నా కూతురికీ అల్లుడికీ దోచిపెట్టానా? బుద్ధి వుండే మాట్లాడుతున్నావా?" కోపంగా అరిచింది అలకారంగరాజన్.

"ఆగాగత్తా! నగలేకాదు..! పదివేల నెట్‌కేష్ కూడా ఇచ్చిన సంగతి నాకు తెలీదనుకున్నావా?" గుట్టు బయటపెట్టింది సుశీల.

"ఓయబ్బో... అక్కడికి నువ్వూ నీ మొగుడే మమ్మల్ని పోషిస్తున్నట్టూ! ఆ డబ్బు మీ మావయ్యగారికొచ్చిన పి.ఎఫ్.లోది." చేతులు తిప్పుకుంటూ ఎద్దేవా చేసింది అలకారంగరాజన్.

"అలాగా? మరి ఇల్లుకొనేటప్పుడు పి.ఎప్పూ, గ్రాట్యుటీ అన్నీ ఖర్చయిపోయినట్లు చెప్పావుగా? రెండోసారి పి.ఎఫ్. ఇచ్చారా?" ఈసడించింది సుశీల.

"ఆర్డర్...ఆర్డర్" నర్ది చెప్పేందుకు ప్రయత్నించా. కానీ నా మాటలు వింటారని నమ్మకం లేదు.

"ఏమిటండీ అలా చూస్తారు? కోడలు అంతలేసి మాటలంటుంటే మందలించక ఊరుకుంటారేం?" ముక్కు చీదింది అలక.

"తప్పమ్మా..! అందరిముందూ అత్తగార్ని అలా అనొచ్చా? మొన్న మీ అన్నయ్య వచ్చినప్పుడు మా వాడి జేబులోంచి ఐదువేలు




తీసి మీ పుట్టింటికి పంపావని అందరిముందూ నేను చెబితే బాగుంటుందా?" కోడలికి నచ్చచెప్ప బోయాడు రంగరాజన్.

"యూ ఆర్ కరెక్ట్ సార్! మా ఆవిడ కూడా తన నగలన్నీ పుట్టింట్లో ఇచ్చి బస్సులో ఎవరో కొట్టేశారని అబద్ధం చెప్పినా నేను ఆవిడ గుట్టు కాపాడానే గానీ మా అమ్మానాన్నలతో చెప్పానా? లేదే..!" అమాయకంగా అన్నాడు వరదరాజన్.

"అంతెందుకూ? ఆ షణ్ముగం గారి కోడలూ అంతే! వాళ్ళమ్మ వస్తే పట్టుచీర - అత్తగారికి నేత చీర... వాళ్ళ నాన్నకేమో పేంటూ షర్టూ - మావగారికి రేషన్‌పంచె..!" తనూ కల్పించుకుంది ఎల్.ఐ.సీ. ఆవిడ.

బస్! అడివంటుకున్నట్టు అంటుకుంది.

ఎవరు ఎవర్ని తిట్టారో ఎవరు ఎవరితో ఛాలెంజ్ చేశారో... ఎవరు ఎవరికి ఏ వార్నింగిచ్చారో తెలియడానికి 'సీన్'లో నేనుంటేగా! మా ఫ్రెండింటికి తాంబరం చెక్కేశా.

రాత్రి పదింటికి కాస్త ధైర్యం తెచ్చుకుని వలసరవాక్కం బస్టాండ్లో దిగంగానే నత్తి నాయిర్ నవ్వుతూ "మన స్ట్రీటు రూపురేఖలే మారిపోయాయి సార్. మీ ఆవిడ గ్రేట్ స్పీచి ఇచ్చినాది...! రియల్లీ గ్రేట్‌సార్!" అంటూ షేక్‌హేండిచ్చాడు. (బస్టాండు ఎదురుగానే నత్తి నాయర్ టీస్టాలు)

ఏమయ్యుంటుందా అని ఇంటికొచ్చి చూద్దునుగదా - మా ఆవిడ సోఫాలో కూచుని విలాసంగా 'హాసం' చదువుతుంటుంటే మా కోడలు నేలమీద సెటిలై అత్తగారి కాలిగోళ్ళకి నెయిల్ పాలిష్ వేస్తోంది.

"ఏం చేశావే?" ఆశ్చర్యంగా అడిగా.

"ఏం చేశానా? సింపుల్. అత్తలకి కోడళ్లూ కోడళ్లకి అత్తలూ రోజూ ఆడిపోసుకోవడం చూసీ చూసీ, వినీవినీ విసుగెత్తే నేనీ 'జర్క్' ఇచ్చానని చెప్పేశా. అంతేగాక అత్తలు ఏ పని చేసినా నాలాగా కోడళ్ని సంప్రదించి చెయ్యాలనీ, కోడళ్లు ఏం చేసినా మన కోడల్లాగా అత్తతో ఆలోచించే చెయ్యాలనీ అలా చేస్తే అపార్థాలూ గొడవలూ రావనీ సోదాహరణంగా వివరించా. దట్సాల్. అంతా క్లియరైపోయింది. అయినా నీ పాటలేవో నువు రాసుకోక 'పంచాయితీ పెద్ద' అవతారం నీకెందుకు. పకోడీలు చేశాగానీ... మింగుదువు గాని రా!" చిద్విలాసంగా నవ్వింది

మా ఆవిడ. ఈ జన్మకి మా ఆవిడ ఇంతే! మరి మీ ఆవిడ?

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

రచన : కీ॥శే॥దేవులపల్లి కృష్ణశాస్త్రి
గానం: డా॥ మంగళంపల్లిబాలమురళీకృష్ణ, శ్రీరంగం గోపాలరత్నం
సంగీతం: పాలగుమ్మి విశ్వనాథం
రాగం: మార్గహిందోళం (కర్ణాటక సంగీతం) 20వ మేళకర్త నటభైరవి రాగ జన్యం
తాళం: రూపకం (కర్ణాటక సం॥) -దాద్రా(హిందుస్తాని సం॥)
ఆరోహణ: సరిగమపదనిస
అవరోహణ: సనిదపమగస

## శివ శివ శివ అనరాదా

ప॥ శివ శివ శివ అనరాదా
శివనామము చేదా
శివపాదము మీద - నీ
శిరసునుంచరాదా
భవసాగర మీద - దు
ర్భర వేదన ఏదా ॥శివ॥

చ॥ కరుణాళుడు కాదా ప్రభు
చరణ ధూళి పడరాదా
హరహరహర అంటే మన
కరవు తీరిపోదా ॥శివ॥

చ॥ కరి పురుగు పాము బోయ
మొరలిడగా వినలేదా
కైలాసం దిగి వచ్చి
కైవల్యం యిడలేదా
మదనాంతకు మీద - నీ
మనసెన్నడు పోదా
మమకారపు తెర స్వామిని
మనసారా కననీదా ॥శివ॥

శాస్త్రీయ సంగీతంలో రాగాలకుండే నియమ నిబంధనలను(అనగా రాగ లక్షణము మొదలైనవి) లలిత సంగీతంలో ఆయా రాగాలను ఉపయోగించేటప్పుడు పాటించ వలసిన ఆవశ్యకత వుండదు. రాగాలు వక్ర సంచారం కలవైనా, లేక వర్జిత స్వరాలు కలవైనా ఆ నియమాలు పాటించనవసరం లేకుండా స్వతంత్ర స్వర సంచారాలతోను, అన్యస్వర ప్రయోగాలతోను కూడా రాగాలను వాడుకునే వెసులుబాటు, స్వేచ్ఛ లలిత సంగీతానికి వున్నవి. ఆ విధంగా రూపొందిన సుమధురమైన బాణీలెన్నో చాలాకాలంగా మనకు స్వరకర్తలు అందిస్తూనే వున్నారు.

"శివ శివ శివ అనరాదా" అనే గీతానికి బాణీ కూర్చడంలో పాలగుమ్మి విశ్వనాథంగారు ఆ వెసులుబాటును, స్వేచ్ఛను వినియోగించుకుని మధురమైన సంగీతాన్ని కూర్చారు. పాటలో చాలా భాగం మార్గహిందోళంలో సాగుతూ పల్లవిలో 'శివ శివ శివ అనరాదా' అనే పంక్తికి 'దనీదమా మమ గమాగసా సా' అని, 2వ చరణంలో "కరి పురుగు పాముబోయ" అనే పంక్తికి "దదదదదా దమ దమ గాగాగ" అని, 'మనసెన్నడు పోదా' అనే పదాలకు "నీనీద దమమ । పదనీ నీ, ।" అని స్వరాలను వాడుకోవడం ద్వారా సారమతి రాగ ఛ్ఛాయ కూడా కనిపించే విధంగా నవ్యతతో కూడుకున్న సంగీతాన్ని రూపొందించారు. 1959లో మహాశివరాత్రి పర్వదిన సందర్భంగా ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో కృష్ణశాస్త్రిగారు రచించిన "శివక్షేత్రయాత్ర" అనే సంగీత నాటిక ప్రసారమయింది. ఆ రోజు ఉదయం 7గం॥ 15ని॥లకు ప్రసారమైన (డైరెక్టు ప్రసారం - అనగా లైవ్ ప్రోగ్రాం) ఆ కార్యక్రమంలో డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, శ్రీరంగం గోపాలరత్నం నటించి పాటలను పాడారు. ఆ నాటకంలోదే "శివశివశివ అనరాదా" అనే గేయం. వారిద్దరూ లైవ్‌గా నాటకంలో పాడిన ఆ పాటను ఆ తరువాత నేను, వక్కలంక సరళ మళ్ళీ పాడగా రికార్డు చేసి తరచుగా ఆకాశవాణిలో ప్రసారం చేస్తూండేవారు.

వివిధ శివక్షేత్రాలను యాత్రికులు దర్శించుకునే సందర్భాలను యితివృత్తంగా తీసుకుని రూపకల్పన చేసి 'శివక్షేత్రయాత్ర' సంగీత నాటికను రచించారు కృష్ణశాస్త్రి గారు. "అల్లదిగో శ్రీశైలం మల్లికార్జునుడు కాపురముండే యిల్లదియేనా శ్రీశైలం", 'కైలాసగిరి నుండి కాశికై - కాశికాపురి నుండి దాసికై - దాసికైయీ దక్షవాటికై దయచేసినావయా హరాహరా హరాహరా" మొదలగు పాటలు చాలా పాప్యులర్

షడ్జము, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధ ధైవతం, కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

ఆవరోహణలో రిషభం లేదు.

నట భైరవి జన్యమైన మార్గహిందోళ రాగంలోని "చలమేలరా సాకేతరామా" అనే త్యాగరాజ కీర్తన చాలా ప్రసిద్ధి పొందినదే. నటభైరవి యొక్క మరొక జన్యరాగమైన సారమతి కూడా మార్గ హిందోళ రాగానికి చాలా దగ్గరగా వుండే రాగమే. సరిగమపదనిస - సనిదపమగస అనే మూర్ఛన (అనగా ఆరోహణ, అవరోహణ) కలది మార్గహిందోళమైతే, అవరోహణలో పంచమం వర్జితమైన మూర్ఛన కలది సారమతి రాగం - (అనగా సరిగమపదనిస - సనిదమగస). "మోక్షముకలదా భువిలో జీవన్ముక్తులు కాని వారలకు" అనే సారమతి రాగంలోని త్యాగరాజ కీర్తన కూడా బాగా ప్రాచుర్యాన్ని పొందినదే. నటభైరవి రాగం వాడుక లలిత సంగీతంలో ఎక్కువగానే కనిపిస్తుంది. ఆ రాగ జన్యాలైన సారమతి, మార్గహిందోళం కూడా లలిత సంగీతానికి అనువైనవే. కాని వాటిని స్వరకర్తలు సాధారణంగా ఉపయోగించరు. 'సింధుభైరవి' అనే చలన చిత్రానికి ప్రముఖ స్వరకర్త ఇళయరాజా సారమతి రాగంలోని మరొక త్యాగరాజు విరచిత "మరి మరి నిన్నే మొరలిడ" కీర్తనను ఏసుదాసు చేత పాడించి, చిత్రంలోని సన్నివేశానికి అనుగుణంగా "పాడలేను పల్లవైనా" అనే లలిత గేయానికి సారమతి రాగంలో చక్కని బాణీని కూర్చి చిత్ర చేత పాడించారు. ఇది ఇళయరాజా చేసిన చక్కని ప్రయోగం.









అయినాయి. 'శివశివఅనరాదా' అనే గేయంలోని 2వ చరణంలోని "కరిపురుగు పాము బోయ మొరలిడగా వినలేదా" అనే పంక్తి విషయంలో ఆ నాటిక ప్రసారమైన చాలాకాలం తరువాత ఒక సంఘటన జరిగింది. ఒక కవి కృష్ణశాస్త్రిగారి యింటికి వచ్చి "ఏమండీ యీ పాటలో మీరు కరి, పురుగు, పాము, బోయ అంటూ చాలా సాధారణమైన పదాలు వాడారు. ఐరావతమని, కీటకమని ఎందుకువాడలేదు. ఆ పదాల వాడుకకు ఏదైనా ప్రత్యేకత వున్నదా" అని అడుగగా కృష్ణశాస్త్రి గారు ఇలా జవాబిచ్చారు.

"జీవుడు నాలుగు విధాలుగా వుంటాడు. మదము, నీచత్వము, కుటిలత్వము, అమాయకత్వము - ఈ నాలుగు విధాలకు ప్రతీకలుగా ఆ మాటలు వాడాను. మదంతో కూడుకున్న ఏనుగును గజము, ఐరావతము అనడంకంటే 'కరి'అని అనడంలో మదం అనేది వ్యక్తమౌతుంది. అలాగే నీచాతినీచమైన దానిని "పురుగు లాంటిది" అని అనడం మనకు సహజమైన అలవాటు కదా. కాబట్టి 'పురుగు' అనేవాడాను. అదేవిధంగా పామువంటి కుటిలుడు, బోయవంటి అమాయకుడు జీవుడు కనుక 'పాము', 'బోయ'అని వాడడంలోనే ఆ గుణాలు వ్యక్తమౌతాయని నా నమ్మకం. ఆ కారణంగానే ఆ పదాలను పాటలో ఉపయోగించాను." అని అన్నారు. గేయాలలో వ్యర్థపదాలు దొర్లకుండా అర్ధవంతంగాను భావ గర్భితంగాను వుండే పదాలను ఎంచుకోవడము, వాటికి తగిన విధంగా ఔచిత్యాన్ని పాటించడంలో తనకు తనే సాటి అని నిరూపించుకున్న ఉన్నతమైన భావకవి కృష్ణశాస్త్రి గారు.

ఫిబ్రవరి 18,2004 మహాశివరాత్రి సందర్భాన్ని, ఈనెల 24వ తేదీన కృష్ణశాస్త్రి వర్ధంతిని పురస్కరించుకుని ఆయన రచించిన ప్రసిద్ధమైన శివస్తుతి గీతాన్ని ఈ సంచికకు ఎంచుకున్నాను. మహాశివుని స్మరించుకోవడంతోపాటుగా కృష్ణశాస్త్రి గారిని గుర్తు చేసుకోవడం కూడా సముచితమని నా భావన.

మార్గ హిందోళం, సారమతి రాగాలలో చిత్రగీతాలు సాధారణంగా వుండవు. కాని సారమతి రాగంలో యీ క్రింది పాట వున్నది.

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| పాడలేను పల్లవైనా | సింధుభైరవి | చిత్ర | ఇళయరాజా |

ఫిబ్రవరి 18 మహాశివరాత్రిని పురస్కరించుకుని....



# శివభక్తిగీతాలు

## శివాష్టకము

ప్రభుం ప్రాణనాథం విభుం విశ్వనాథం
జగన్నాథనాథం సదానందభాజమ్
భవద్భవ్య భూతేశ్వరం భూతనాథం
శివం శంకరం శంభుమీశాన మీడే

గళే రుండమాలం తనౌ సర్పజాలం
మహాకాలకాలం గణేశాదిపాలమ్
జటాజూట గంగోత్తరంగైర్విశిష్యం
శివం శంకరం శంభుమీశాన మీడే

ముదామాకరం మండనం మండయంతం
మహామండలం భస్మభూషాధరం తమ్
అనాదిం హ్యపారం మహామోహమారం
శివం శంకరం శంభుమీశాన మీడే॥

వటాధోనివాసం మహాటాట్టహాసం
మహాపాపనాశం సదా సుప్రకాశమ్
గిరీశమ్ గణేశం సురేశం మహేశం
శివం శంకరం శంభుమీశాన మీడే॥

గిరీంద్రాత్మజాసంగృహీతార్ధదేహం
గిరౌ సంస్థితం సర్వదా పన్నగేహమ్
పరబ్రహ్మ బ్రహ్మాది భిర్వంద్యమానం
శివం శంకరం శంభుమీశాన మీడే॥

కపాలం త్రిశూలం కరాభ్యాసం దధానం
పదామ్భోజ నమ్రాయ కామం దదానమ్
బలీవర్దయానం సురాణాం ప్రధానం
శివం శంకరం శంభుమీశాన మీడే॥

శరచ్చంద్రగాత్రం గణానంద పాత్రం
త్రినేత్రం పవిత్రం ధనేశస్య మిత్రమ్
అపర్ణాకళత్రం సదా సచ్చరిత్రం
శివం శంకరం శంభుమీశాన మీడే॥

హరం సర్పహారం చితాభూవిహారం
భవం వేదసారం సదా నిర్వకారమ్
శ్మశానే వసంతం మనోజం దహంతం
శివం శంకరం శంభుమీశాన మీడే॥

స్వయం యః ప్రభాత నరశ్శూలపాణే
పఠేత్ స్తోత్రరత్నం త్విహ ప్రాప్యరత్నమ్
సుపుత్రం సుధ్యానం సుమిత్రం కళత్రం
విచిత్రైస్సమారాధ్య మోక్షం ప్రయాతి॥

## శ్రీవిశ్వనాథాష్టకము

గంగాతరంగ రమణీయజటాకలాపం
గౌరినిరంతర విభూషితవామభాగమ్
నారాయణప్రియ మనంగమదాపహారం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్.

వాచామగోచర మనేక గుణస్వరూపం
వాగీశవిష్ణుసురసేవిత పాదపీఠమ్
వామేన విగ్రహవరేణ కళత్రవంతమ్
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్

భూతాధిపం భుజగభూషణభూషీ తాంగమ్
వ్యాఘ్రాజినాంబరధరం జటిలం త్రినేత్రమ్
పాశాంకుశాభయవరప్రదశూల పాణిం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్

శీతాంశుశోభితకిరీట విరాజమానం
ఫాలేక్షణానలవిశోషితపంచబాణమ్
నాగాధిపారచితభాసురకర్ణపూరం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్.

పంచాననం దురితమత్తమతంగజానాం
నాగాంతకం దనుజపుంగవపన్నగానామ్
దావానలం మరణశోకజరాటవీనాం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్.

తేజోమయం సగుణనిర్గుణ మద్వితీయం
ఆనందకంద మపిరాజిత మప్రమేయమ్
నాగాత్మకం సకలనిష్కళ మాత్మరూపం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్

ఆశాం విహాయ పరిహృత్య పరస్య నిందాం
ఉపే రతిం చ సునివార్య మనస్సమాధౌ
ఆదాయ హృత్కమలమధ్యగతం ప్రవేశం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్

రాగాదిదోషరహితస్వజనానురాగం
వైరాగ్యశాంతినిలయం గిరిజాసహాయమ్
మాధుర్యధైర్యసుభగం గరళాభిరామం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్

వారాణసీపురపతేః స్తవనం శివస్య
వ్యాసోక్త మష్టక మిదం పఠితా మనుష్యః
విద్యాం శ్రియం విపుల సౌఖ్యమనంతకీర్తం
సంప్రాప్య దేహనిలయే లభతే చ మోక్షమ్.

విశ్వనాథాష్టక మిదం యః పఠేచ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే

## లింగాష్టకము

బ్రహ్మమురారి సురార్చిత లింగం
నిర్మలభాసిత శోభిత లింగమ్
జన్మజదుఃఖ వినాశకలింగం
తత్ప్రణమామి సదాశివలింగమ్

దేవముని ప్రవరార్చిత లింగం
కామదహన కరుణాకర లింగమ్
రావణదర్ప వినాశక లింగం
తత్ప్రణమామి సదాశివలింగమ్

సర్వసుగంధ సులేపిత లింగం
బుద్ధివివర్ధన కారణ లింగమ్
సిద్ధ సురాసుర వందిత లింగమ్
తత్ప్రణమామి సదాశివలింగమ్

కనకమహామణి భూషిత లింగం
ఫణిపతి వేష్టిత శోభితలింగమ్
దక్షసుయజ్ఞ వినాశనలింగమ్
తత్ప్రణమామి సదాశివలింగమ్

కుంకుమ చందన లేపిత లింగం
పంకజహార సుశోభిత లింగమ్
సంచితపాప వినాశన లింగం
తత్ప్రణమామి సదాశివలింగమ్

దేవగణార్చిత సేవిత లింగం
భావైర్భక్తిభి రేవచ లింగమ్
దినకరకోటి ప్రభాకర లింగం
తత్ప్రణమామి సదాశివలింగమ్

అష్టదళోపరివేష్టిత లింగం
సర్వసముద్భవ కారణ లింగమ్
అష్టదరిద్ర వినాశన లింగమ్
తత్ప్రణమామి సదాశివలింగమ్

సురగురుసురవర పూజితలలింగం
సురవనపుష్ప సదార్చితలింగమ్
పరమపదం పరమాత్మకలింగం
తత్ప్రణమామి సదాశివలింగమ్

లింగాష్టక మిదం పుణ్యం యః పఠేచ్ఛివసన్నిధౌ,
శివలోక మావాప్నోతి శివేనసహ మోదతే.

## శివాపరాధక్షమాపణ స్తోత్రమ్

కరచరణకృతం వా కర్మ వాక్కాయజంవా
శ్రవణనయనజం వా మానసం వా పరాధం
విహిత మవిహితం వా సర్వమేతత్ క్షమస్వ
శివశివ కరుణాబ్దే శ్రీ మహాదేవ శంభో
నమస్తే నమస్తే నమస్తే నమః

# దూసుకుపోతున్నది
# 55వ గణతంత్ర భారతావని

నేడు 55వ భారతగణతంత్ర దినోత్సవం. ఈ సందర్భంగా సింహావలోకనం చేసుకుని ఈనాడు మనం చేరిన స్థాయిని సమీక్షించుకోవాలి. వ్యవసాయం, పరిశ్రమలు, సాంఘిక సంక్షేమం, ఆహారభద్రత, బలహీనవర్గాలకు, అణగారిన వర్గాలకు చేయూత విషయంలో ఆదర్శప్రాయమైన చర్యలు అనేకం చేపట్టాం. శాస్త్ర, సాంకేతిక రంగాలలో అవరోధాల నధిగమించి అంబరాలను చుంబించాం, సాగర గర్భాలను మథించాం, ఐటి రంగంలో నవతరంగాలు సృష్టించి విశ్వమంతటికి సాఫ్ట్‌వేర్ పవర్‌హౌస్‌గా ఖ్యాతి పొందాం.

ప్రజలలో నిక్షిప్తమైన శక్తిని వెలికిదీసి, సద్వినియోగం చేసుకోవడం వల్లనే ఇదంతా సాధ్యపడింది. మన ప్రజాస్వామ్యానికే మూలాధారమైన రాజ్యాంగంలోని న్యాయం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే ఆదర్శాలను నెరవేరుస్తూ అట్టడుగు స్థాయినుండీ నిజమైన ప్రాతినిధ్యం వహిస్తున్న భారత ప్రజాస్వామ్యం దినదినం వర్ధిల్లుతోంది.

జనాల ఆనందసందోహాల మధ్య జవానులు కవాతు చేస్తుంటారీనాడు. వివిధ ప్రాంతాల ప్రచారశకటాలు దేశవైవిధ్యాన్ని చాటి చెబుతాయి. ఇవి చూసి మన హృదయాలు గర్వంతో ఉప్పొంగుతాయి. వినాశం తప్పదంటూ సోదె చెప్పినవారి మాటలు తప్పని ఋజువుచేశాం. ప్రజాస్వామ్యం, అభివృద్ధి కలసి మనగలవని చాటిచెప్పాం.

ఈ గణతంత్ర దినోత్సవ శుభసందర్భంగా ప్రశంసాపాత్రులు, మన ప్రజాస్వామ్యాన్ని పరిరక్షిస్తున్నవారు - ప్రజలే!

సమాచార మరియు ప్రసార మంత్రిత్వ శాఖ
భారతప్రభుత్వం



# సరిగపదమని

13

**కూర్పు : టి.నవీన్**



**అడ్డం:-**

1. '.........చీరను కట్టి బొమ్మన బ్లౌజును తొడిగి' ఇది బొంబాయి ప్రియుడి పాట (3)
3. '............. తిక్క రేగిందా ఒళ్ళంతా తిమ్మిరెక్కిందా' ఇదో యమగోల పాట (3)
6. ఎంతవారుగాని వేదాంతులైనగాని ........చూపు సోకగానె తేలిపోదురోయ్ (2)
7. 'తాగితే ........పొగలను తాగనివ్వదు' ప్రేమ మత్తులో పద్దవాని పాట (3)
10. '......... నీవంటి దివ్యస్వరూపంబు ఎందెందు వెదకిన లేదుకదా' రేలంగి అభినయించిన పాట (3)
11. 'సొగసు చూడ..........' 'మిస్టర్‌పెళ్లాం'లోని ఈ పాటేమరోసినిమా టైటిల్‌అయ్యింది (3)
12. 'శుభలేఖ రాసుకున్నా.......లో ఎపుడో' చిరంజీవి అభినయించిన గీతం (2)
13. '........ చూస్తేరాజమండ్రి పైట చూస్తే పాలకొల్లు' నాగార్జున అభియించిన పాట (2)
15. ప్రియ ........ గుండెలోన పొంగుతున్న ఈవేళా' ఇది కూడా నాగర్జున పాటే (3)
17. 'మాఘ ......... ఎప్పుడొస్తుందో మౌన రాగాలెన్నినాళ్ళో' ఎస్.వి.కృష్ణారెడ్డి స్వరపరిచిన పాట (2)
18. '.........మాయ చేశావో గానీ ఓ మనసా చెప్పమ్మా నిజాన్ని' 'ఒక్కడు' కోసం పాడిన పాట (2)
19. '......మ్మ అందాలూ రామయ్య గోత్రాలు' శుభసంకల్పం కోసం కీరవాణి స్వరపరిచిన గీతం (2)
22. 'పెళ్ళెప్పుడవుతుంది .......' వందేమాతరం పాట (2)
23. '............... అందమేదో నిదుర లేచెనెందుకో' (4)

**నిలువు:-**

1. 'ఇది తైలం పట్టి తాళంపట్టి' అనే తలంటు పాట గల చిత్రం (2)
2. 'నారీ నారీ ......... మురారి' అన్నాడు విప్రనారాయణుడు (3)
4. 'రావమ్మా మహా ........ రావమ్మా' సంక్రాంతి పండుగల్లో వినిపించే గీతం(2)
5. పిలువకురా అలుగకురా ..........లో నను ఓ రాజా (4)
8. 'సిరులొలికించె ...... నవ్వులే మణిమాణిక్యాలు' యమలీల చిత్రంలోని పాట (2)
9. '.................కు జేజేలు బంగరు భూమికి జేజేలు' బడిపంతులు చిత్రంలోని పాట (5)
10. 'ఘనా ఘన ........... కరుణారసమందిరా' దేవులపల్లి గీతమిది (3)
14. '........ తెరచినా ..... మూసినా కలలు ఆగవేలా' దేవిశ్రీప్రసాద్ స్వరపరిచిన గీతం (3)
16. '.....వాక పిల్లా మేం గాజులోళ్ళం గదా' నువ్వునేను చిత్రం లోని పాట (2)
19. '.......లు సింగారం మాలచ్చి బంగారం' (2)
20. '......య్యా నల్లని ......య్యా నిన్ను కనలేని కనులుండునా' (2)
21. మళ్ళీ మళ్ళీ ఇది .....రోజు (2)

పంపినవారి పేరు :..........................................................

వయసు :........... వృత్తి :..........................................................

చిరునామా :..........................................................

..........................................................

..........................................................ఫోన్ :..........................................................

**పజిల్, కూపన్ 29-02-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

## నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)



విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



మూడవ బహుమతి (రెండు తప్పులతో)



కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)








జయంత్, డి.సురేష్, కె.రాఘవేంద్రరావు, రమణగోగుల, అశోక్‌కుమార్, ఉమేష్‌గుప్త, కిశోర్‌రాఠి

ప్రేమంటే ఇదేరా చిత్రం ద్వారా సంగీత దర్శకునిగా పరిచయమై బద్రి, యువరాజు, తమ్ముడు, జానీ తదితర చిత్రాలతో ప్రేక్షకులకు చేరువ అయిన రమణగోగుల శ్రీ వేంకటేశ్వర స్వామి పేరిట 'సప్తగిరి' అనే ఏడు పాటలున్న భక్తిగీతాల ఆడియో, వీడియో ఆల్బమ్‌ను రూపొందించారు. వేటూరి సుందరరామమూర్తి స్వరరచనలో వెలువడిన ఈ భక్తిగీతాల క్యాసెట్‌ను ఇటీవల దర్శకుడు రాఘవేంద్రరావు చేతుల మీదగా మార్కెట్‌లోకి విడుదల చేశారు.

డివోషనల్ ఆల్బమ్స్‌లో 'సప్తగిరి' ఓ సంచలనం సృష్టిస్తుందని రమణగోగుల తొలిచిత్ర దర్శకుడు జయంత్.సి.పరాన్జి అంటే, ఈ ఆల్బమ్ రమణ గోగులలోని కొత్త కోణం అని, వీడియో చిత్రీకరణ కూడా చాలా బాగుందని సురేష్ ప్రొడక్షన్స్ అధినేత సురేష్ అన్నారు.

వేంకటేశ్వరుని పేరు పెట్టుకున్న తనకు ఆ స్వామి పేరిట ఏదో ఒకటి చేయాలనే కోరిక చాలా కాలంగా ఉందని, అది నేటికి కుదిరిందని, రెగ్యులర్ భక్తి గీతాలకు భిన్నంగా యువతలో కూడా భక్తి భావనలు పెంపొందించే కాన్సెప్ట్‌తో ఈ ఆల్బమ్ రూపొందించామని, బాలమురళీకృష్ణ, యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, శంకర్ మహదేవన్, మధుఫల కృష్ణ, నందిత తదితరులు గానం చేసిన ఈ పాటలకు వేటూరి ప్రాణం పెట్టి చక్కటి సాహిత్యం అందించారని రమణగోగుల తెలిపారు. ఆదిత్యా మ్యూజిక్ ద్వారా ఈ క్యాసెట్ మార్కెట్ లోకి విడుదలైంది. ●

# కన్నడ ప్రజలను అలరిస్తున్న ఆర్పీ పట్నాయక్ సంగీతం

ప్రముఖ సంగీత దర్శకుడు ఆర్.పి.పట్నాయక్ ఇటీవల 'ఎక్స్‌క్యూజ్‌మి' అనే ఓ కన్నడ చిత్రానికి సంగీత దర్శకత్వం వహించి, అందులో ఓ మూడు పాటలను కూడా పాడారు. ఈ మధ్యనే ఆ చిత్రాన్ని ప్రసాద్ లాబ్స్‌లో ప్రత్యేకంగా వేయించి పాత్రికేయులకు చూపించారు. ఎన్.ఎమ్.సురేష్ నిర్మించిన ఆ చిత్రానికి ప్రేమ్ దర్శకత్వం వహించారు. టీనేజ్ లవ్‌స్టోరీ ప్రధానంగా సాగిన ఈ చిత్రంలో తొమ్మిది పాటలున్నాయి. ఈ పాటలను వి.నాగేంద్రప్రసాద్ రాశారు. 'ఎక్స్‌క్యూజ్‌మి నా ప్రేమి యు లవ్ మి' అనే పాటను ఆర్పీ పట్నాయక్, నందిత; 'బ్రహ్మవిష్ణు శివాయదే హాలు కుడిదరో' అనే పాటను చిత్ర దర్శకుడు ప్రేమ్, 'సారీ సారీ' అనే పాటను టిప్పు, నందిత; 'ప్రీతి ఏకె భూమి నేలిదే' పాటను ఆర్పీ పట్నాయక్, మన తెలుగు గాయని ఉష, 'తొట్టిలు తూగోళిగే చుట్టవా కట్టోదెగే' పాటను చిత్ర దర్శకుడు ప్రేమ్‌తో పాటు ఈ చిత్రంలోని పాటలకు మ్యూజిక్ ఎరేంజర్‌గా వ్యవహరించిన మధుకర్; ఎక్కువ వాద్య ప్రధానంగా సాగుతూ 'ఓ ప్రియతమా' అనే ముకుటం గల స్వర రచనను నందిత; 'ప్రీతిగజన్మ మీడిద బ్రహ్మ' పాటను శంకర మహదేవన్, సినిమాకు కీ పాయింట్ వంటి థీమ్ మ్యూజిక్‌తో మొదలయ్యే 'ప్రీత్సే అంతా ప్రాణా తిణ్ణో ప్రేమి నిన్ను యారో' పాటను బాంబే జయశ్రీ, 'రోడిగిళే రాధికా' అనే టీజింగ్ సాంగ్‌ను ఆర్పీ పట్నాయక్, గురుకిరణ్ పాడగా, 'ప్రీతిగజన్మ మీడిద బ్రహ్మ' పాటను రాజీవ్ బృందం పాడిన వెర్షన్‌తో సహా ఆడియో సీడీలో చేర్చారు. ఈ పాట చిత్రంలో ఉండదు.





ఆర్.పి.పట్నాయక్

మొత్తం పాటలన్నీ మనకు తెలిసిన పట్నాయక్‌ను మరో కోణంలో ఆవిష్కరించేలా వున్నాయి. ముఖ్యంగా యమన్ రాగంలో సాగిన ప్రీతి ఏకె భూమి నేలిదే పాటయితే పదే పదే పాడుకునేటంత హాయిగా వుంది. జయం సినిమాలో పాటలు విని ఎలాగైనా పట్నాయక్ చేతనే తన సినిమాకు మ్యూజిక్ చేయించుకోవాలన్న పట్టుదలతో ఈ ఎక్స్‌క్యూజ్‌మి చిత్రాన్ని తీశానని నిర్మాత ఎన్.ఎం.సురేష్ చెప్పారు. బెంగుళూర్‌లో ఈ చిత్రం అతిపెద్ద థియేటర్ అయిన 'కపాలీ'లో విడుదలయిందని, ఆ థియేటర్‌లో 50 రోజులు ఆడితే బైట థియేటర్లలో 100 రోజులు ఆడినట్టు లెక్కని, ఇప్పటికి 80 రోజులు పైబడుతూ ఉన్నా ఇంకా ఈ చిత్రం హౌస్‌ఫుల్ కలెక్షన్లతో నడుస్తోందని, 100 రోజులు సునాయాసంగా ఆడుతుందని, ఈ చిత్రం విడుదల రోజున పట్నాయక్ పేరిట 'వెల్కమ్ టు కన్నడ ఇండస్ట్రీ' అంటూ బ్యానర్లు కట్టామని, రీరికార్డింగ్ వరంగా కూడా ప్రేక్షకుల మెప్పు పొందిన ఈ చిత్రానికి స్టేట్ వరంగా కొన్ని మ్యూజిక్ అవార్డులను ఆశిస్తున్నామని తెలిపారాయన.



నిర్మాత
ఎన్.ఎం.సురేష్

ఈ 'ఎక్స్‌క్యూజ్‌మి' చిత్రం తెలుగులో రీమేక్‌గా గాని డబ్బింగ్‌గా గాని వచ్చే అవకాశాలున్నాయి. ఏది జరిగినా సరే పట్నాయక్ కన్నడంలో స్వరపరిచిన ఆ పాటలని తెలుగులో వినొచ్చు. ●




# పెళ్ళిపుస్తకం

**దర్శకత్వం : బాపు**

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**1**

**పెళ్ళి!**

తూర్పు పడమరలను ఏకం చేసే రంగుల హరివిల్లు!

సంసారం. ఇల్లు వాకిలి, పిల్లా జెల్లా, సరికొత్త అనుబంధాలు, కష్టాలు, సుఖాలు, ప్రేమానురాగాలు సప్తపదులుగా సాగే అర్ధశతాబ్దపు సుదీర్ఘ యాత్ర!! దురదృష్టవశాత్తూ కొన్ని నావలు తుఫానులో చిక్కుకుని మునిగిపోయినా, ఎక్కువశాతం క్షేమంగా తీరానికి చేరుకోవడం భారతీయ సంప్రదాయ మహాత్మ్యం అంటే ఎవరూ ఖండించరు.

కుబేరులకైనా, కుచేలురకైనా సజావైన సంసారానికి నమ్మకం, పరస్పర గౌరవాలే పునాదులు. ఆ పునాదులు బలంగా ఉంటే పెను భూకంపాలు కూడా ఆ సంసార సౌధాన్ని కూల్చలేవు. విరించి డైరీలో మరో సరికొత్త సంసారాధ్యాయానికి నాంది పలుకబోతున్నదా రోజు.

రామాపురంలో పుట్టినా, ఎక్కడో బొంబాయిలో ఒక బట్టల మిల్లులో ఆర్ట్ డైరెక్టర్‌గా పని చేస్తున్న కె.కె. అనబడే క్రిష్ణమూర్తికి, భీమాపురంలో పుట్టి, పొట్టకూటి కోసం ఎక్కడో కొచ్చిన్లో టైపిస్టుగా పనిచేస్తున్న సత్యభామకు ఆ రోజు పెళ్ళి చూపులు!



పెళ్ళి చూపులకోసం సత్యభామగారింటికొచ్చిన కృష్ణమూర్తి మేడెక్కి - దూరం నుంచి పొంగిపొర్లుతున్న మురికి కాలువను చూసి నయాగరా జలపాతాన్ని చూసినంత పరమానందంగా "చూపులు కలిసిన శుభవేళా... లా... ల...ల..." అని హమ్ చేస్తున్నాడు.

చేత టీ కప్పు పట్టుకొని కాలి అందెలు ఘలఘల సవ్వడులు చేస్తుండగా పద్మాలవంటి నయనాలను వయ్యారంగా తిప్పుతూ, దానిమ్మ గింజలవంటి దంత సౌందర్యాన్ని మిలమిల మెరిపిస్తూ, భువనైక మోహినిలా, అప్సరసాశిరోమణిలా, రంభలా, ఊర్వశిలా, మేనకలా, తిలోత్తమలా, కిన్నెర మూర్తిలా, యక్షిణిలా, అజంతా శిల్పంలా... అలా... ఇలా... అబ్బ... ఇంత పైత్యమెందుకు? ఒక్క మాటలో చెప్పడం చేతగాదా అని విసుక్కునే పాఠకులకు ఒకే మాటలో చెప్పాలంటే బాపూ బొమ్మలా కలహంస నడకతో కె.కె దగ్గర కొచ్చింది సత్యభామ.



చిరునవ్వులు చిందిస్తూ టీ కప్పును కె.కె. ముందుంచింది. టీ సువాసన తగలగానే కె.కె. పరవశంగా ఆఘ్రాణించాడు.

"ఆహా....వారెవా... క్యాబాత్ హై... శభాష్" అన్నాడు.

"అదేంటిసార్... రుచి చూడ కుండానే శభాష్ అనేస్తున్నారు మీ బొంబాయి గారడీభాషా?" అన్నది భామ నవ్వి.

ఇష్టమైన పానీయం, అంతకంటే ఇష్టమైన అతివ స్వహస్తాలతో పట్టుకొస్తే రాయి కూడా వేటూరిలా రాటుదేలిన కవిత్వం చెబుతుంది. ఇక కె.కె. సంగతి చెప్పాలా?



"మీరు టీ పోసి తెచ్చిన కప్పులు చక్కహా. అవి అందించే చేతులు ఇంచక్కహా! నాజూగ్గా ఉన్నాయి. నా కన్ను శభాష్ అంది. కప్పులో యాలకుల సువాసన తగలగానే ముక్కు శభాష్ అంది. ఈ రెండూ ఓకే అయితేనే ఈ కే.కే. చేతులు కప్పునందుకుని నోటి దగ్గరకు తీసుకువెళ్తాయి." అని తానూ కప్పు కొమ్ములో వేలు దూర్చాడు.

ఇద్దరి వేళ్ళూ ఇరుక్కుపోయాయి. ఎవరికి వారే తమ వేళ్ళను బయటకు లాక్కోవాలని ప్రయత్నించడంతో కప్పు ఒలికి సగం టీ కింద పడిపోయింది. భామ కళ్ళెత్తి కృష్ణమూర్తి వంక చూసింది. అతనికి కళ్ళ ముందు మెరుపులు మెరిసినట్టనిపించింది. 'అమ్మో' అన్నాడు చిలిపిగా. మళ్ళీ ఇద్దరూ కప్పు కొమ్ములోంచి వేళ్లు వెనక్కి తీసుకోవాలని ప్రయత్నించారు. అప్పటికే బ్రహ్మముడి బిగుసుకుపోయింది. "అరెరె..టీ ఒలుకుతుంది." అన్నాడు కృష్ణమూర్తి . భామ నిస్సహాయంగా చూసింది.

"ఇట్స్ ఓకె... అయాం కె.కె.... కె.కృష్ణమూర్తి. కానీ బొంబాయిలో

అందరూ నన్ను కె.కె అని పిలుస్తారు" చెప్పాడు.

"అయాం భామ... సత్యభామ". చెప్పింది భామ.

" ఇది ఇలా ఉండగానే నేను కొంచెం టీ లాగించేస్తాను. ఇద్దరికీ సులభంగా ఉంటుంది" అన్నాడు.

"ఇట్స్ ఓకె మిస్టర్ కె.కె" అంగీకరించింది భామ.



'థాంక్యూ మిస్ భామా..' అంటూ సత్యభామ చేతిని అలాగే పట్టుకుని టీ తాగాడు కృష్ణమూర్తి.

"అదండీ నంగతి. వంచదార ఉంది. కానీ తక్కువ. మనకు ఎక్కువ కావాలి అందువల్ల..." అన్నాడు.

"మనుషులు కూడా అంతే. మనం కొత్త వారిని కలిసినపుడు మంచి బట్టలే వేసుకుంటాం." అన్నది భామ.

"రైట్...పౌడరూ,సెంటూ పూసుకుంటాం"

"ఇంగ్లీషులో నవ్వుతాం. హల్లో..హౌడూయుడూ అంటాం. ఆ తరువాత అస్సలు రుచి దగ్గర...."

"అంటే అసలు గుణగణాల దగ్గర, నిజ స్వరూపాల దగ్గర"

"తేడాలొస్తాయి"

"యస్. తేడాలొస్తే పోట్లాడుకోకూడదు. సర్దుకుపోవాలి"

"అదే తక్షణ కర్తవ్యం"

ఆ డైలాగ్ వినగానే కృష్ణమూర్తి మనసు పులకించింది." ఆ డైలాగు మాయా బజార్ సినిమాలోది. ఎన్ని సార్లు చూశారు?" అడిగాడు

"వద్దెనిమిది సార్లు... మీరు?"



"ఇరవై నాలుగు"చెప్పాడు కృష్ణమూర్తి"

"అబ్బ... మీది గొప్ప టేస్టండి."మెచ్చుకుంది సత్యభామ. (మాయాబజార్‌ను ఎక్కువ సార్లు చూడటం గొప్పటేస్టని. చూడకపోతే జన్మ వేస్టనీ ఈ నాటికీ ప్రేక్షకుల అభిప్రాయం. సమయమొచ్చింది కాబట్టి - ఆ సినిమాను ఈ రచయిత నూటేభైసార్లకు పైగా చూశాడని మనవి చేస్తున్నాను)

అప్పటికే సత్యభామ పీకల్దాకా నచ్చేసింది కృష్ణమూర్తికి.

"ఇంకేం చెప్పకండి. మాటలు అనవసరం" అన్నాడు.

"మరి మాటలు వేరుకానీ..."

"మనసులొకటే"

"శభాష్...క్యా బాత్‌హై..." నవ్వుతూ అన్నది సత్యభామ.

ఇంతలోనే చిన్న అపశృతి..!



దూరంగా రోడ్డుమీద మాసిన గెడ్డంతో ఒక వ్యక్తి సైకిల్ మీద ఆగివున్నాడు. హ్యాండిల్ రాడ్‌కు కిరోసిన్ సీసా వేలాడుతున్నది. భావరహిత దృక్కులతో ఉన్నాడు. సిగరెట్ తీసి అగ్గిపుల్ల వెలిగించాడు. అగ్గిపుల్ల వెలుగులో వేలాడుతున్న నిండైన కిరోసిన్ సీసా నిండుగా కనిపించింది.

అతడిని చూసి ఒక్క క్షణం బెదిరి మళ్ళీ తేరుకుంది సత్యభామ.

"బావగారూ...ఇవాళ ఇరవయ్యో తేదీనే కదా అనుకోకుండా వచ్చాను మామూలు ప్రకారం ఫస్ట్‌కు డబ్బుపంపిచ్చేస్తాను" అన్నది సత్యభామ.

అతను సైకిలెక్కి వెళ్ళిపోయాడు. కృష్ణమూర్తికేమీ అర్థం కాలేదు. సత్యభామవైపు చూశాడు. కృష్ణమూర్తి పెళ్ళిచూపులకొచ్చాడనీ, ఇటువంటి వ్యవహారాలు తెలియనివ్వకూడదనీ అనుకోలేదామె. మనసులో ఏదో దాచిపెట్టుకుని నాటకాలాడే తత్వం కలది కాదు. అందువల్ల ఉన్నదున్నట్లు చెప్పేసింది.

"మా అక్క మొగుడు. మా అమ్మ ముప్పయివేల రూపాయల కట్నమిస్తామని చెప్పి పెళ్ళి చేసింది. పదివేలిచ్చింది. ఇరవైకి నోటు రాసింది. ఇవ్వకపోతే కిర్సనాయిల్ పోసి అక్కను కాల్చేస్తాట్ట."

ఆశ్చర్యంగా చూశాడు కృష్ణమూర్తి. కట్నపిశాచి వికృత రూపం ఎలా ఉంటుందో అవగతమైంది.



మిగతా విషయం కూడా చెప్పింది భామ. "సైకిల్ మీద ఆ సీసా చూశారుగా. అగ్గిపుల్ల గీసి బెదిరిస్తున్నాడు. నా జీతంలో సగం వాయిదాలుగా కడుతున్నాను."

నత్యభామ వక్కనే కూర్చున్న కృష్ణమూర్తి. తన విషయం కూడా మననుు విప్పటం మంచిదని తోచింది. కష్టసుఖాలేవో ముందు ముందుగానే మాట్లాడుకుంటే నచ్చితే చేసుకోవచ్చు లేదంటే మానుకోవచ్చు. అంత్య నిష్టూరం కంటే ఆది నిష్టూరం మేలుకదా.

"ఐసీ...నాకూ కమిట్‌మెంట్ ఉందండీ. చెల్లాయి పెళ్ళి... నాన్నగారి అల్లరి ఖర్చులు... మరి నేనెంత కట్నం ఇవ్వాలో? మా చెల్లాయి పెళ్ళి కోసం నా జీతంలో నగం డబ్బులు బ్యాంకులో వేసి దాస్తున్నానండీ. కష్టమ్స్ అండ్ సుఖమ్స్ ద కాంబినేషన్ ఈజ్ లైఫ్" అన్నాడు.



"కొటేషన్ బాగుందండీ" మెచ్చుకుంది సత్యభామ.

వీళ్ళలా పంచుకోబోయే కష్టసుఖాల ముచ్చట్ల చెప్పు కుంటుండగా పురోహితుడు వచ్చాడు.

"అయ్యా కె.కె.జీ గారూ" పిలిచాడు

"కె.కె.జీ ఏంటయ్యా ఎల్‌కేజీ క్యాబేజీల్లాగా. కె.కె.గారు అనండి చాలు" చెప్పాడు కృష్ణమూర్తి.

"అలాగే బాబూ. పెద్దవాళ్ళు ఎదురు చూస్తున్నారు. పెళ్ళి చూపులు కానిచ్చేస్తే నా పనైపోతుంది గదా. రండి." చెప్పి వెళ్ళిపోయాడు పురోహితుడు.



పెళ్ళి చూపులకు అన్ని ఏర్పాట్లు సిద్ధమయ్యాయి. ఐదారు ప్లేట్లలో ఆకులు. వక్కలు, పూలు, పండ్లు ఉన్నాయి. వది మంది అతిథులు కూర్చున్నారు. కె.కె తండ్రి రామారావు ఒక కుర్చీలో కూర్చోగా పక్కనే మరో కుర్చీలో కృష్ణమూర్తి కూర్చున్నాడు. కింద చాపలమీద సత్యభామ, ఆమె తల్లి, మరి కొంతమందీ కూర్చున్నారు.

కాబోయే భార్యను నవ్వుతూ చూస్తున్నాడు కృష్ణమూర్తి. పెళ్ళికూతురు పూర్తిగా నచ్చిందని వెలుగుతున్న అతని ముఖమే చెబుతున్నది. సత్యభామ కూడా వంచుకున్న తలను నిమిషానికోమారు పైకెత్తి చూస్తూ చిరునవ్వులు కురిపిస్తున్నది. వీళ్ళ వాలకాన్ని గమనించి ఒకళ్ళ కొకరు పూర్తిగా నచ్చారని గ్రహించిన పురోహితుడు నేరుగా పాయింట్లోకి వచ్చేశాడు.

"అయ్యా..పిల్ల, పిల్లాడు ఒకళ్ళ కొకళ్ళు నచ్చిపోయారు. కావున..." చెబుతున్నాడు.

"పోవడం ఏమిటయ్యా పాడు కూత శుభ్రంగా మాట్లాడలేవూ?" మందలింపుగా అన్నాడు రామారావు.

పురోహితుడు ఆ చమత్కారానికి నవ్వి "సరెలెండి. ఇక కట్న కానుకల విషయానికి కొద్దాం. పిల్లను చూశారుగా. నిలువెత్తు బంగారం." అందరూ సహజంగా అనేమాట అన్నాడు.



ఆ వంకపెట్టి కట్నం ఎగ్గొడదామనో, లేక తగ్గించాలని చూస్తున్నారనో అనుమానించాడు రామారావు.

"పిల్లాడు నిలువున్నెత్తు బంగారం. ఆ లెక్కలు చెప్పొద్దు. పాయింటుకు రా" అన్నాడు.

ఈ కట్న కానుకల వ్యవహారం మొదటికి మోసం తెస్తుందేమోనని భయం కలిగింది కృష్ణమూర్తికి. సత్యభామమీదున్న బాధ్యత, బరువులు అప్పుడే తెలుసుకుని ఉన్నాడాయె. తండ్రి వంక కొంచెం గుర్రుగా చూసి "అంటే కట్నమేగా? అమ్మో జైల్లో పెడతారు నాన్నా." అన్నాడు.

"ఏడ్చారు. ఫిర్యాదు చేసే మొనగాడెవడని?" అన్నాడు రామారావు.

"ఎంతో చెప్పమనమ్మా కట్నం" మెల్లగా తల్లితో అన్నది సత్యభామ.

"చెప్పేందుకేముంది? పిల్లే బంగారమంటున్నారు గనుక మంజూరి ఒక లక్ష." నిర్మొహమాటంగా చెప్పాడు రామారావు.



ఆయనకు ఒక కూతురు కూడా ఉంది. ఈ కట్నం డబ్బులతో ఆ పిల్లకు పెళ్ళి చెయ్యాలని ఆయన ఆశ.

"అమ్మో ...లక్షే...!? రూపాయలే!!"అంటూ నోరు తెరిచింది సత్యభామ తల్లి.

"డాలర్లిస్తే మరీ మంచిది అత్తయ్యగారూ. మరి మీరు లక్ష కుమ్మరిస్తున్నారు మరి మీ పిల్లకు మేం పెట్టాల్సిన బంగారమెంతో అది కూడా చెప్పండి. అసలే పిల్ల బంగారపు బొమ్మ అంటున్నారు" కాబోయే అత్తగారికో పాయింటు అందించాడు కృష్ణమూర్తి.

ఆవులిస్తే పేగులు లెక్కబెట్టే రకం ఆ సత్యభామ తల్లి.

"ఉన్నమాటేగదా. బంగారు బొమ్మకు సత్తు నగలు పెట్టలేం కదా. ఒక ముప్పై కాసులు పెట్టండి. నిలువెత్తు నగలు చేయిస్తాం" అన్నది.



"ఓ.కె...ఓ.కె... ముప్పై కాసులేకదా... ఇవాళంటే మీ అమ్మాయి కానీ రేపట్నుంచి మా నాన్నగారి కోడలేకదా. ఓకె." అనేశాడు కృష్ణమూర్తి.



రామారావు కంగారు పడిపోయాడు. కొడుకు నోరు జారాడని....

"ఒరేయ్..ఒరేయ్... ముప్పై కాసులంటే ఎంతో తెలుసా?" అడిగాడు.

"ముప్పైమూళ్ళు తొంభై. దాదాపు లక్షేకదండీ" చెప్పాడు పురోహితుడు. ఏదోవిధంగా ముడివేసి తన పబ్బం గడుపుకోవాలని అతని తాపత్రయం. తప్పేముంది?

"అవును... లక్షేగదా" అన్నాడు కృష్ణమూర్తి.

"అదిగాదురా అంత డబ్బు ఎక్కడినుంచి తెస్తాం?" అన్నాడు రామారావు.



సత్యభామ ఓరకంట చూడసాగింది. ఆ చూపులో దివ్యమైన అయిడియా వచ్చింది కృష్ణమూర్తికి.

"వారేవా...క్యాబాత్‌హై.గొప్ప అయిడియా" అన్నాడు చిటికేసి.

"ఏంటిరా అది? నాతో చెప్పు మెల్లిగా.." చెవి ఆనించాడు రామారావు.

"సింపుల్ నాన్నా... భయమెందుకు? వాళ్ళు మనకు లక్ష రూపాయల క్యాష్ కట్నంగా ఇవ్వాలి. మనం వాళ్ళకు లక్షరూపాయల బంగారం కొని ఇవ్వాలి. మన దగ్గర డబ్బులేదు. వాళ్ళిచ్చిన లక్షతోనే కొనివ్వాలి. అనగా వాళ్ళు కుడి చేత్తో మనకిచ్చే లక్షని మనం ఎడమ చేత్తో బంగారంలా ఫిరాయించి వాళ్ళకిచ్చేస్తాం. అంచేత... దానికీ దానికీ చెల్లు" ఐడియా మెల్లగా చెప్పినా అందరికీ వినిపించింది.



ఎదురుగా కూర్చున్న ఆడపెళ్లివారి ముఖాలు మెరిశాయి.

"అంచేత ఎవరూ ఎవరికీ ఏమీ ఇవ్వఖ్ఖర్లేదు. శుభస్య శీఘ్రం" అనేశాడు పురోహితుడు.

రామారావు షాక్ తిన్నాడు ఆ మంత్రాంగానికి. ఇటువంటి వ్యవహారాల్లో ఎవరి లెక్కలు వారి కుంటాయి. వచ్చే కట్నంతో అమ్మాయి పెళ్ళి చెయ్యవచ్చన్న ఆశ రామారావుది. ఆ విధంగా కొంత బరువు తగ్గుతుందన్న ఆశ అడియాసవడంతో ఆయన బాధపడటం సహజం.



పెద్ద కూతురుకు కట్నం ఇవ్వలేక కూతురు నిత్యనరకం అనుభవిస్తుంటే - ఆ బాకీయే తీర్చలేక అవస్థపడుతున్న సత్యభామ తల్లికి ఇదో పెద్ద ఊరట. మళ్ళీ అప్పుల పాలయ్యే దుర్దశ తప్పినందుకు ఆమెకు సహజంగానే సంతోషాన్నిస్తుంది.

కోరినటైపు పెళ్ళాం దొరుకుతుందన్న సంతోషంతో తండ్రి మనసు గ్రహించలేక పోయాడు కృష్ణమూర్తి. పెళ్ళీడొచ్చిన చెల్లెలు ఉన్నదన్న

విషయం ఆ క్షణంలో జ్ఞప్తికి రాలేదతనికి.

చిల్లిగవ్వ కట్నంగా లేకుండా భర్త దొరికినందుకు సత్యభామ సంతోషానికి హద్దులు లేవు.

కొడుకు మాటకు ఎదురాడలేక మనసులోనే కుమిలిపోతూ తల ఊపాడు రామారావు.



ఇక ఆలస్యమేముంది?

మంగళ వాయిద్యాలు మోగాయి. గుమ్మాలకు తోరణాలు వెలిశాయి. పెళ్ళి పందిరి తయారైంది. మధు వర్కాలతో వధూవరులు పెళ్ళిపుస్తకానికి నాంది పలికారు.



శ్రీరస్తు - శుభమస్తు
శ్రీకారం చుట్టుకుంది పెళ్ళి పుస్తకం
ఇక ఆకారం దాల్చుతుంది కొత్తజీవితం
శ్రీరస్తూ శుభమస్తు
తలమీద చెయ్యి వేసి ఒట్టు పెట్టినా
తాళి బొట్టు మెడను కట్టి బొట్టు పెట్టినా
సన్నికల్లు తొక్కినా సప్తపదులు మెట్టినా
మనసుమనసు కలపడమే
మంత్రం పరమార్థం.
శ్రీరస్తూ - శుభమస్తు
శ్రీరస్తు - శుభమస్తు



మంగళ సూత్ర ధారణ అయిపోయింది. ఆహూతలందరూ అక్షింతలు చల్లారు. వధూ వరులిద్దరూ తలంబ్రాల యుద్ధం చేసుకున్నారు. అగ్నిహోత్రం చుట్టు ప్రదక్షిణలు చేశారు.



అడుగడుగున తొలిపలుకులు గుర్తు చేసుకో
తడబడితే పొరబడితే తప్పుదిద్దుకో
ఒకరి నొకరు తెలుసుకుని
ఒడిదుడుకులు తట్టుకుని
మసకేయని పున్నమిలా
మనికి నింపుకో
శ్రీరస్తూ - శుభమస్తు



అందరూ దీవనెలు అందించారు. రెండు జీవితాలు ఒక్కటయ్యాయి. రెండు మనసులు ఒక్కటయ్యాయి.

* * *

శోభనం గదిలో పట్టెమంచం మీద విలాసంగా పడుకుని ఊహాలోకంలో విహరిస్తున్నాడు కృష్ణమూర్తి. సవ్వడిలేకుండా తలుపులు తెరుచుకుని వచ్చింది సత్యభామ. అతగాడు గమనించనట్టు కాలుమీద కాలేసుకుని చిద్విలాసంగా పడుకోవడంతో వడివడిగా నడిచి అతని కాలుని చేతితో కొట్టిలాగేసింది. పొజిషన్ బాలన్స్ తప్పి దిగ్గునలేచి కూచున్నాడు కృష్ణమూర్తి.



తలుపు ధనధన కొట్టారెవరో. మూడ్ పాడైపోయి "ఎవరు?" అరిచాడు.

తలుపు ఓరగా తెరిచాడు. ఎదురుగా పళ్ళికిలిస్తూ పోస్టమాన్! "సార్... టెలిగ్రాంసార్ కంగారు పడకండి... గ్రీటింగ్సే" అన్నాడు.

కృష్ణమూర్తికి మండింది. "మరైతే తలుపు కొట్టిచ్చేంత అర్జెంటేమిటనీ?" అరిచాడు.

"సార్...నిజంగా పెళ్ళికి దీవింపులు తెచ్చేది, దీవించేది మేమే. సాయంత్రం నుంచి పాతికపైగా గ్రీటింగ్స్ తెచ్చాను. ఒక థాంక్యూ అయినా తగల్లేదు" చేతులతో సైగచేస్తూ చెప్పాడు పోస్టమ్యాన్.

పాపం! పోస్టమ్యాన్ చెప్పే 'థాంక్యూ'అసలర్థం అస్సలుఅర్థం కాలేదు కృష్ణమూర్తికి. అయినా సరే 'థాంక్యూ' అన్నాడు ముక్తసరిగా.

"సార్... సార్... సార్.. ఒక్క థాంక్యూ అయినా తగల్లేదు సార్... అందుకని తెగించి తమదగ్గరి కొచ్చాను" అన్నాడు.



అప్పుడు ట్యూబ్‌లైట్ వెలిగింది కృష్ణమూర్తికి.

"పొద్దున్నే కనిపించు బాబూ. ఒకటి కాదు. వంద థాంక్యూలిస్తా". చెప్పాడు తలుపేసుకుంటూ.

"సార్..సార్... థ్యాంక్యూ సార్... గుడ్‌నైట్ సార్... హ్యాపీనైట్ సార్..." వెళ్ళిపోయాడు పోస్టమ్యాన్.

పీడా వదిలిందనుకుని భామ దరికి చేరబోతుండగా కరెంటు పోయింది. అంతా కటిక చీకటి.

కొవ్వొత్తి వెలిగించాడు కృష్ణమూర్తి. "లైట్ ఆర్పేసి రండి" అన్నది భామ మత్తుగా.

"వన్ మినిట్...దీపం ఉండగానే టెలిగ్రాంలు చదువుకోమన్నారు. ఎలా ఉంది కొటేషన్?" అని టెలిగ్రాంలు చదవసాగాడు.

"విష్‌యూ హేపీ మ్యారీడ్ లైఫ్... ఇది కూడా అదే..." అంటూ నాలుగైదు చదివి ఐదోది చూడగానే 'ఓ మైగాడ్' అని తల పట్టుకున్నాడు కృష్ణమూర్తి.

"ఏమిటండీ... ఏమైందండీ?" కంగారుగా అడిగింది భామ.

భామకు టెలిగ్రాం అందించాడు కృష్ణమూర్తి నీరసంగా.



"స్టార్ట్ ఇమ్మీడియట్లీ. అర్జంట్ మీటింగ్ మండే...- ఊర్మిళ. ఈ ఉర్మిళా శూర్పణఖ ఎవత్తండీ?" అడిగింది భామ.

"మా మేనేజింగ్ డైరెక్టర్.." ఏడుపుముఖంతో చెప్పాడు కృష్ణమూర్తి.

"వాట్ ఇఫ్! రావడానికి వీల్లేదని మీరొక టెలిగ్రాం కొట్టండి" సలహా ఇచ్చింది భామ.

"లాభం లేదు. ఈ మీటింగ్ ఉండచ్చని వార్నింగిచ్చే పంపించింది" పెళ్లాం ఒడిలో పడుకుని ఏడుస్తూ అన్నాడు కృష్ణమూర్తి.

"ఇప్పుడెలా?"

"సోమవారం పొద్దున్నే బొంబాయిలో ఉండాలంటే తెల్లవారు జామున ఆరింటి బండికి వెళ్ళిపోవాలి"

"అయితే తెల్లారి రైలుకు నేను కొచ్చిన్ వెళ్ళిపోతా."

"ఎందుకొచ్చిన కొచ్చిన్ కానీ, ఈ సెలవులు హాయిగా ఇక్కడే ఎంజాయ్ చెయ్యరాదూ?"

"మీకులేని హాయి నాకెందుకండీ. నేనూ వెళ్ళిపోతా." అంది భామ సహధర్మచారిణి కదా....

అలా మొదటిరాత్రి నీరసంగా ముగిసింది.

**-(ఇంకావుంది)**

"నేను చదువులో ఏ మాత్రం వెనుక పడినా మా మాష్టారు ఊరుకోరు తెలుసా....?"
"నీమీద అంత ప్రత్యేకమైన అభిమానమా?"
"అదేం గాదు".
"మరి..."
"పరీక్షల్లో మా మాష్టారు గారి అబ్బాయి కూర్చునేది నా వెనకాలే...."



"నువు నమ్ము నమ్మకపో.... నేను చెబుతున్నది నిజం. నువ్వు రాసిన కథలో ఒక్క కథ కూడా ఏ పత్రికలోనూ పడదుగాక పడదు".
"ఆ సంగతి నాకూ తెలుసు. అందుకనే కథలు మానేసి నవలలు రాసుకుంటున్నాను."



"నువు ప్రేమించిన వ్యక్తి ఎవరినైనా సరే ఎదిరించే దమ్మున్న మగాడని చెప్పావుగా మరి పెళ్లి చేసుకోలేదేం."
"అఖరుకు నన్ను కూడా ఎదిరిస్తాడనుకోలేదు"



"నేను ఇప్పటివరకు రాసిన నవలలన్నీ ఒక ఎత్తు.... ఇపుడు రాసిన ఈ ఒక్క నవలా ఒక ఎత్తు........"
"అంత బాగా రాసావా....?"
"అవును. నా పాత నవలలన్నీ కలిపితే వంద కేజీలైతే...... ఈ నవల ఒక్కటీ వంద కేజీలు ఉంది".



ఓ కొడుకు తన తండ్రితో అన్నాడు
"డాడీ ! ఒక వ్యక్తి ఒక పని విషయంలో ఎంత కష్టపడినా... ఆ పని పూర్తి కాలేదనుకోండి. అప్పుడు మనం ఏం చెయ్యాలి"
"ఆ వ్యక్తిని మనం ఏమీ అనకుండా ఆ పని పూర్తయ్యేంత వరకు తగిన ప్రోత్సాహాన్ని కలిగించాలి"
"కరెక్టుగా చెప్పారు డాడీ. మా రిజల్ట్స్ వచ్చాయి. నా నెంబరు లేదు" అన్నాడా పుత్రరత్నం.



అవి పెళ్లి చూపులు. అబ్బాయి అమ్మాయిని అడిగాడు.
"చూడండి! మీరు ఏమీ అనుకోకపోతే ఇంతకు ముందు మీరు ఎవరినైనా ప్రేమించారా....?"
"ఊహు!"
"పోనీ.....మిమ్మల్ని ఎవరైనా.....?"
"ఊహు....ఊహు....."
"అలా అయితే మీరు నాకు నచ్చలేదు"
"అదేం?".
"అంటే మీకెవరు నచ్చరనీ, మీరు ఎవరికీ నచ్చలేదని తెలిపోయిందిగా. అందుకే నాకు నచ్చలేదు".



"మీ కథలంటే నేను పడి ఛస్తానంటే నమ్మండి"
"నేను రాసిన వంద కథలూ చదివారా?"
"ఒక్కటి కూడా వదలకుండా చదివా"
"మైగాడ్. మీరు అలా అంటుంటే నాకు మతి పోతోంది"
"ఎందుకు?"
"ఎందుకంటారేంటి వందసార్లు చచ్చిన వాళ్ళు ఎదురైతే మతిపోదూ?"



ఈ జోకులను పంపిన వారు
బి.వి.ఎస్.బాబు,
గాంధీనగర్,
తెనాలి.




"నీ స్నేహితుడి పెళ్ళికి వెళతానని చెప్పావ్. వెళ్ళలేదేం?"
"లక్షా తొంభై కారణాలుంటాయ్. అవన్నీ నీకు చెప్పాలా?"
"అన్నీ అఖ్ఖర్లేదు. ఒకటో రెండో చెబితే చాలు"
"!......?......!......?......!"



"కొత్తగా ఫోను పెట్టించుకున్న ఓ ఆసామి పట్టణంలోని తన స్నేహితుడుకి ఫోన్ చేసి "హాలో..... సుబ్బారావు ఉన్నాడా?" అని అడిగాడు
"పిలుస్తాను. లైన్ లో ఉండండి" అంది అవతలినుండి ఓ ఆడగొంతు.
"ఇక్కడ పదిమందేమీ లేరమ్మా-లైన్‌లో ఉండడానికి మాట్లాడేది నేనొక్కడినే" అన్నాడా ఆసామి ఆశ్చర్యపోతూ.



ఈ జోకులను పంపిన వారు : రెడ్డి ఎమ్మె., ఒంగోలు



"పోస్టు డబ్బాలో ఉత్తరం వేస్తుంటే వేలి ఉంగరం పడి పోయిందన్నావ్. ఎలా తీసావ్" అడిగాడు మిత్రుడ్ని, మూర్తి.
"చాలా సేపు ప్రయత్నించాను. దొరకలేదు చేతికి" చెప్పాడు మిత్రుడు.
"మరేం చేసావ్ చివరికి?"
"ఓ కాగితం మీద నా ఇంటి అడ్రసు రాసి, ఉంగరం ఆ అడ్రసుకి అందచేయమని రాసి డబ్బాలో పడేసి వచ్చేసాను."



"ఏంటి వదినా ఈ రోజు చాలా హ్యాపీగా కనిపిస్తున్నావ్"
అని అడిగింది పక్కింటావిడ
"క్యాంప్‌కెళ్లిన మావారు వచ్చేశారు అందుకని..." చెప్పింది ఇంటావిడ.
"మీవారంటే నీకెంతో ప్రేమలా ఉందే...!?"
"ప్రేమా, పాడా.... వారం రోజుల నుంచి ఇంటి పనులన్నీ ఎక్కడివక్కడే ఆగిపోయాయి. ఇంక ఈయన వచ్చేశారుగా నేను హ్యాపీగా సీరియల్స్ చూసుకోవచ్చనీ..."



ఒక డాక్టర్ పేషెంట్‌తో "నీకొచ్చిన రోగం ఏమిటో అంతుబట్టడం లేదోయ్. దీనికి కారణం బహుశా మత్తు పదార్థాలు సేవించడం అనుకుంటా" అని అన్నాడు.
దానికా పేషంట్ "సర్లేండి డాక్టరుగారు మీరు మామూలు స్థితిలో ఉన్నప్పుడే వచ్చి చూపించుకుంటా'' అని వెళ్ళిపోయాడు.

ఈ జోకులను పంపిన వారు : జి.శశిధర్,నెల్లూరు.

"లలితా.... ఏదైనా చల్లని మాట చెప్పు. వినాలని ఉంది" ప్రక్కనే కూర్చుంటూ అడిగాడు భర్త.
"మన ఇల్లంతా ఏ.సి. చేయించుకుందామండీ!" ఠక్కున చెప్పింది భార్య లలిత.



"అంత దుర్మార్గుడైన భర్తకి విడాకులు ఇవ్వాల్సిందే!" ముక్త కంఠంతో తీర్మానించారు మహిళా మండలి సభ్యులంతా, తమతోటి సభ్యురాలి కుటుంబ విషయంలో.
అ సభ్యురాలి గురించి పూర్తిగా తెల్సిన అధ్యక్షురాలు మాత్రం," నువ్వు విడాకులివ్వకు. నీతో కాపురం చేయడమే అతనికి మనం వేస్తున్న శిక్ష" సలహా ఇచ్చింది.



ఈ జోకులను పంపిన వారు : రమణశాస్త్రి, సంగారెడ్డి

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన బి.వి.యస్.బాబు (తెనాలి), రెడ్డి ఎమ్మె(ఒంగోలు), జి.శశిధర్(నెల్లూరు), రమణశాస్త్రి(సంగారెడ్డి) గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'సంబరం' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.








# ఒక్కే ఒక్క పాటతో 'కమాల్' కియా!



బహుశా తల్లిదండ్రులకు పెద్దయ్యాక తమ పిల్లవాడు ఏదో ఒక వండర్ చేస్తాడని తెలుసో ఏమో పుట్టగానే 'కమాల్' అనే పేరు పెట్టారు. బహుశా తనమీద తల్లిదండ్రులు ఏదో మంచి ఆశ పెట్టుకున్నారని ఆ కుర్రాడు భావించాడో ఏమో ఆపేరుకు తగ్గట్టుగానే ఒకే ఒక్కపాటతోనే వండర్ చేశాడు. ఆ కుర్రాడి పేరు కమాల్‌ఖాన్. పుట్టింది, పెరిగింది లండన్‌లోనే అయినా అతని కుటుంబ మూలలు మాత్రం లక్నోలోనే ఉన్నాయి. సంగీతంతో అతని కుటుంబానికి ఏరకమైన అనుబంధం లేదు, మరి అతనికి ఎలా ఆ సంగీతాభిరుచి అబ్బిందో తెలియదు కాని, చిన్నతనం నుండి సంగీతం అంటే - ముఖ్యంగా భారతీయ సంగీతం, బాలీవుడ్ పాటలంటే - అతనికి ఎంతో ఇష్టం.

లండన్‌లో దొరికే హిందీ సినిమా ఆడియోలను వింటూ బాల్యం గడిపేశాడు. ఆ రోజుల్ని తలుచుకుంటూ, "నేను పుట్టింది లండన్‌లో అయినా మా అమ్మా నాన్న తమ స్వదేశీ సంస్కృతి సంప్రదాయాలను అనుసరిస్తానే వున్నారు. వాళ్ళ పునాదుల్ని మరిచిపోలేదు. మా ఇంట్లో ఉర్దూ,హిందీ మాట్లేడేవాళ్ళం. చదవడం రాకపోయినా ఆ పాటలనే పాడుతుండేవాడిని. అందువల్ల నా ఆలోచనలన్నీ హిందీలో సాగేవి, వాటిని నాకు తోచిన విధంగా ఆంగ్లంలో రాసుకుని పాడేవాడిని. హిందీ పాటలంటే ఉండే ఇష్టమే నాకీ భాషను దగ్గర చేసిందని చెప్పాలి" అంటున్నాడు. గాయకుడిగా మారిన వైనాన్ని చెబుతూ, "అలా పాడుతూ ఉండటంతో గాయకుడిగా నాకు తెలియకుండానే మారిపోయాను. నాతోటి వారంతా తమ పాకెట్ మనీని బొమ్మలు కొనుక్కోవడానికి ఉపయోగిస్తుంటే నేను మాత్రం హిందీ ఆడియోలు కొనేవాడిని" అని చెప్పాడు. తమ కొడుకు అందరిలా కేవలం 'స్నానాలగది పాటగాడు'(బాత్రూమ్ భాగవతార్) కాదని తల్లి దండ్రులు కమాల్‌ఖాన్‌ను ప్రోత్సహించడం ప్రారంభించారు. గాత్రమనేది దేవుడిచ్చేవరం. దానిని సరిగా ఉపయోగించుకోలేకపోతే , ఆ భగవంతుడిని కించపరిచినట్టే అని అతని తల్లిదండ్రులు కమాల్‌తో అన్నారు. వారి ఆదరణ, ప్రోత్సాహం కమాల్‌లో కొత్త ఉత్సాహాన్ని నింపాయి. గాయకుడిగా స్థిరపడటం కోసం కృషిచేయడం ప్రారంభించాడు. స్థానికంగా చిన్న చిన్న ప్రదర్శనలు కొన్ని ఇచ్చిన తర్వాతే తానే రాసుకొని, స్వరపరుచుకున్న 'ఓహ్ ఓ జానే జనా....' పాటను సింగిల్ సాంగ్ ఆల్బమ్‌గా లండన్‌లో 1997లోవిడుదల చేశాడు. అదక్కడ పెద్ద సెక్సెస్‌ను సాధించింది."నేను గాత్రానికి సంబంధించి ఎవరి దగ్గరా శిక్షణ తీసుకోలేదు. అయితే పియానో ప్లే చేయడం మాత్రం నేర్చుకున్నాను. ఓ సారి నా చేతికి సక్సెస్ చిక్కాక, నా మీద నాకు నమ్మకం పెరిగింది. నాలో టాలెంట్ లేకపోలేదు అనిపించింది. దాంతో మరిన్ని అవకాశాలను చేజిక్కించుకునే ప్రయత్నం చేశాను" అని అంటున్నాడు కమాల్.

భారత్ కు రావడం గురించి చెబుతూ,"బాలీవుడ్ స్టార్‌హీరో సల్మాన్‌ఖాన్ నాకు బంధువు. ఆయనోసారి షూటింగ్ నిమిత్తం లండన్ వచ్చినపుడు నా 'ఓ జానే జానా...' పాటను వినడం తటస్థించింది. పాట చాలా బాగుందని, సినిమాలో ఉపయోగించుకుంటానని చెప్పారు. అన్నమాటను నిలబెట్టుకుంటూ తన 'ప్యార్ కియాతో డర్నా క్యా' చిత్రంలో పెట్టుకున్నారు. ఆ పాట రికార్డింగ్ కోసం నన్ను భారత్‌కు పిలిపించారు. అయితే సినిమాటిక్‌గా జతిన్ లలిత్ దానిని కాస్త మార్చారు. ప్రధానమైన బాణీ నాదే. అయితే నేను మనసులో ఉన్న ఓ ప్రియురాలిని ఓ యువకుడు తలుచుకుంటూ పాడే పాటగా రాసుకున్నాను. కానీ సినిమాలో సిట్యుయేషన్ కాస్త మారింది. ఇంకా ఎదురు కాని ప్రియురాలి గురించే హీరోపాట పాడతాడు.

## కమాల్‌ఖాన్ మాటల్లో కొన్ని...

- నేను పుట్టింది మార్చి 12న, మా అన్నయ్య పేరు జమాల్. అందువల్లే మా అమ్మానాన్న నాకు రిథమిక్‌గా ఉంటుందని కమాల్ అని పెట్టారని నాకనిపిస్తుంది.
- నాకు స్ఫూర్తి ఎవరు అని ప్రశ్నిస్తే ...'దేవుడే'నని చెబుతాను. అలానే నాకు వేసవి కాలమంటే ఎంతో ఇష్టం.
- సూర్యుడిని నేనెంతో లైక్ చేస్తాను.
- నాగొంతు సల్మాన్‌ఖాన్‌కు, హృతిక్ రోషన్‌కు సరిగ్గా సూట్ అవుతుందని నా నమ్మకం. మిగిలిన వాళ్ళకు కాదనికాదు!
- ఇంగ్లీష్ బాండ్‌లో ప్రస్తుతం 'బ్లూ' బాండ్ నాకిష్టమైంది. బ్రాయన్ ఆడమ్స్‌నూ ఇష్టపడతాను.
- నటీనటుల విషయానికి వస్తే బ్రూస్ విల్లిస్, మాధురీదీక్షిత్ అంటే ఇష్టం. కలిసి నటించాల్సి వస్తే జూలియా రాబర్ట్స్ , ప్రీతిజింతాలను కోరుకుంటాను.
- బ్లూ నాకిష్టమైన రంగు.
- లండన్ అంటే నాకెంతో ఇష్టం. మా అమ్మానాన్న అక్కడే ఉంటారు కాబట్టి, ఇక ముంబై అంటే నాకెంతో ప్రేమ ఇది నాకు కొత్త ఇల్లులాంటిది కాబట్టి.
- ఆపన్నుల కోసం ఏదైనా చేయాలన్నది జీవితంలో నాకున్న పెద్దకోరిక.



సల్మాన్‌పై ఈ పాటను చిత్రీకరించారు. సినిమాతో పాటుగా పాట కూడా బ్రహ్మాండమైన ఆదరణ పొందింది. రాత్రికి రాత్రి నేను సింగర్‌గా గుర్తింపు పొందేశాను" అని చెప్పాడు కమాల్‌ఖాన్.

పాప్ సింగర్‌గా మారడానికి కారణం చెబుతూ, "లండన్‌లో సాంగ్‌తో ఆల్బమ్‌ను విడుదలచేయడమనే సంప్రదాయం వుంది. కానీ భారత్‌లో ఆడియో అంటే కనీసం ఐదారు పాటలు ఉండాలి. సల్మాన్‌ఖాన్ నుండి పిలుపు వస్తుందని ఎదురు చూస్తున్న సమయంలోనే ఓ ప్రయివేట్ ఆల్బమ్ రూపొందించాలనే ఆలోచనతో మరి కొన్ని ట్యూన్స్‌ను సిద్ధం చేసుకున్నాను. అవి తుదిమెరుగులు దిద్దుకోక ముందే నాకు ఇక్కడ నుండి పిలుపు వచ్చింది. ఒకసారి సినిమా పాట ద్వారా గుర్తింపును తెచ్చుకున్న తర్వాత ఆల్బమ్‌ను విడుదల చేస్తే బాగుంటుందని ఆ ప్రయత్నాన్ని వాయిదా వేసుకున్నాను. ఎప్పుడయితే 'ఓహ్ ఓజానే జానా' సక్సెస్ అయ్యిందో అదే పేరుతో హెచ్.ఎం.వి. సంస్థ ద్వారా 1998 మార్చిలో తొలి పాప్ ఆల్బమ్‌ను విడుదల చేశాను. ఇందులోని రెండు పాటలను సోహెల్‌ఖాన్ దర్శకత్వంలో వీడియోగా చిత్రీకరించాం. ఒకపాటను గోవాలోనూ, మరోపాటను లండన్ లోనూ తీశాం" అనిచెప్పారు.

యు.కె.లో పుట్టి పెరిగి, హిందీ సినిమాలో పాటపాడిన తొలి గాయకుడు కమాల్‌ఖాన్ కావడం మరోవిశేషం. అదే యేడాది ముంబై లో ఫిల్మ్‌ఫేర్ అవార్డ్స్ ఫంక్షన్ కోసం ఇచ్చిన లైవ్ పెర్ఫార్మెన్స్ కూడా కమాల్‌ఖాన్‌కు చక్కటి గుర్తింపును ఇచ్చింది. ఈ సక్సెస్‌తో నేపథ్య గాయకుడిగా కొనసాగటంతో పాటుగా, పాప్ సింగర్‌గానూ మంచి పేరు తెచ్చుకోవాలని కమాల్ భావించారు. అంతేకాదు కేవలం గాయకుడిగా రికార్డింగ్ స్టూడియోలకే పరిమితం కాకుండా స్టేజ్ పెర్ఫార్మెన్స్ కూడా ఇవ్వాలనుకున్నాడు. అందుకనే ఆ తర్వాత రెండు మూడేళ్ళు విస్తారంగా దేశ, విదేశాలలో కమాల్ అనేక ప్రదర్శనలిచ్చారు. దాంతో 'ఓహ్ ఓ జానే జానా' యువతకో జాతీయగీతంలా మారిపోయింది. ఆ తర్వాత కమాల్‌ఖాన్ 'హలో బ్రదర్', జానమ్ సముఝాకరో', తుమ్‌కో నాభూల్ పాయేంగె', 'నా తుమ్ జానో నా హమ్', 'మోక్ష' తదితర చిత్రాలకు పాటలు పాడాడు. ఈ మధ్యలో 1999 లో ఫిల్మ్‌ఫేర్ నుండి మోస్ట్ ప్రామెసింగ్ న్యూ టాలెంట్ కేటగిరిలో ఆర్.డి.బర్మన్ అవార్డునూ అందుకున్నాడు. అదే యేడాది సెప్టెంబర్‌లో కమాల్‌ఖాన్ 'సునో తో దివానా దిల్ అనే రెండో పాప్ ఆల్బమ్‌ను విడుదల చేశాడు. ఇందులో ఉన్న ఎనిమిది పాటల్లో నాలుగు పాటలను కమాల్ సొంతంగా స్వరపరుచుకోగా, మిగిలిన పాటల్ని ఆనంద్‌రాజ్ స్వరపరిచారు. ఇది కూడా మంచి గుర్తింపునే తెచ్చిపెట్టింది. అక్కడ నుండి మరిన్ని లైవ్ పెర్ఫార్మెన్స్ ఇచ్చాడు. కాన్సర్ పేషెంట్ల కోసం చెన్నైలో ఓ ప్రదర్శనలోనూ, కార్గిల్‌వార్‌లో అసువులు బాసిన సైనికుల కుటుంబాలకు సాయం చేసేందుకు ఏర్పాటు చేసిన ఫుట్‌బాల్ మ్యాచ్‌లోనూ పాల్గొన్నాడు. గత యేడాది కమాల్‌ఖాన్ 'కల్ రాత్' పేరుతో మూడో పాప్ ఆల్బమ్ విడుదల చేశాడు. ఏ రకమైన ఆర్భాటం లేకుండా విడుదలైన ఈ ఆల్బమ్‌ను కూడా మంచి స్పందన పొందింది. దీనిని గురించి చెబుతూ, "అనవసరమైన హంగామా కారణంగా అసలు క్వాలిటీ మరుగున పడిపోతుంది. ఆడంబరాలనేవి కొత్తవాళ్ళకు తప్పవు. కానీ ఈ స్థితిలో నేను నాటాలెంట్‌ను శ్రోతలు గుర్తించాలనే కోరుకుంటున్నాను" అని అంటున్నాడు కమాల్‌ఖాన్.



### నటన వైపు దృష్టి...

గాయకులు నటులుగా మారిన వైనాలు బాలీవుడ్‌లోఎన్నో ఉన్నాయి. తొలి ఆల్బమ్ విడుదలైనప్పుడే నటించమంటూ పలు ఆఫర్స్ వచ్చినా, సున్నితంగా తిరస్కరించిన కమాల్‌ఖాన్ ఇప్పుడు మేకప్ వేసుకుని సినిమాలు చేయడానికి ఆసక్తి చూపుతున్నాడు. కారణం చెబుతూ, "నా వీడియో ఆల్బమ్స్‌లో నేను కనిపిస్తున్నాను. దాంతో కొంత పాపులారిటీ వచ్చింది. అంచేత చాలామంది దర్శక నిర్మాతలు నాకు తగ్గ పాత్రలు ఇస్తామని ముందుకు వస్తున్నారు. వచ్చిన అవకాశాలను వినియోగించుకోవడంలో తప్పు లేదనిపించింది. అందుకే చేస్తున్నాను" అని చెప్పారు. రాహుల్ రావెల్ 'జో బోలే సోనిహాల్' లో హీరో సన్నీ డియోల్‌కు సరిసమానమైన పాత్రను కమాల్ చేస్తున్నాడు. అలానే 'ఏక్ పల్ కేలియా' సినిమాకు తొలిసారిగా సంగీతాన్ని కమాల్ సమకూర్చుతున్నాడు. సంజయ్ సూరి, శిల్పాశెట్టి నటిస్తున్న ఈ సినిమాలోనూ కమాల్ ఓ పాత్ర పోషిస్తున్నట్టు తెలుస్తుంది.

ఇప్పుడు మంచినటుడిగా, గాయకుడిగా, సంగీత దర్శకుడిగా పాపులారిటీ పొందడమే తన లక్ష్యం అని కమాల్ అంటున్నాడు.

**- వి. అరుణ సత్యవతి**

# మా ఆవిడకి పతి దొరికాడు

- పొత్తూరి విజయలక్ష్మి



పొద్దున పది గంటలు అయింది. ఆనందరావు నెత్తిన చేతులు పెట్టుకుని కూర్చున్నాడు. ఇంట్లో వాతావరణం అంతా అస్తవ్యస్తంగా వుంది. అవతల ఆఫీసు టైమయిపోతోంది. ఇంకా టిఫిన్ రెడీ కాలేదు. పిల్లల స్కూలు బస్ మిస్ అయింది.

టిఫినుదేముంది? బయట ఎక్కడైనా తినొచ్చు. కానీ అలా వెళ్ళిపోతే రమకి కోపం వస్తుంది. అసలే అగ్గిబుగ్గి అయిపోతోంది. ఇంకా రెచ్చగొడితే ఏదైనా అఘాయిత్యం చేస్తుందేమోనని భయం. ఎంతసేపు కూర్చున్నా వంటింట్లోంచి వూడిపడదు.

కాసేపు నీళ్ళు నమిలి మెల్లిగా వంటింటివైపు వెళ్ళాడు. పొయ్యిమీద వుంచిన పదార్థం మాడిపోతున్నా పట్టించుకోకుండా దిగులుగా నిలబడి వుంది రమ.

స్టౌ ఆపేసి భార్య భుజం మీద చెయ్యి వేశాడు. "పతీ" అంటూ భోరున ఏడిచింది రమ.

"ఏడవకు ఏడవకు... ప్రయత్నం చేస్తున్నాను కదా!" ఓదార్చాలని విఫల ప్రయత్నం చేశాడు ఆనందరావు.

"చేసేదంతా చేసి ఇపుడు ఏం ప్రయత్నం చేస్తే ఏం లాభం" వుక్రోషంగా సమాధానం చెప్పి మళ్ళీ 'పతీ' అంటూ ఏడుపు ప్రారంభించింది రమ.

మరోసారి తలబాదుకుని బయటికి వచ్చాడు ఆనందరావ్.

అపుడే మేడ దిగి వచ్చాడు బాబాయ్.

"ఒరే ఆనందా! ఇంకా టిఫెను రెడీ కాలేదూ..!?" అన్నాడు.

పళ్ళు కొరుక్కున్నాడు ఆనందరావు.

ఇంతలో వాకిట్లోంచి వచ్చింది రాజ్యం అత్తయ్య. ఆవిడ చేతిలో నవనవలాడుతున్న సొరకాయ.

"ఒరే ఆనందా! ఇవాళెందుకో మీ మావయ్య తెగ గుర్తొస్తున్నార్రా... ఆయనకి సొరకాయ ఆవబెట్టిన కూరంటే చచ్చేంత ఇష్టం. పతిగాడెక్కడున్నాడో కాస్త తొందరగా చూడ్రా... వాడయితే బాగా చేస్తాడా కూర" అంది ఆదరంగా.

కడుపులోంచి దుఃఖం తన్నుకొచ్చింది ఆనందరావుకి.

చేతుల్లో మొహం దాచుకుని కుళ్ళికుళ్ళి ఏడవసాగాడు. వంటింట్లోంచి వచ్చిన రమ భర్త పక్కనే కూర్చుని 'పతీ' అంటూ ఏడవసాగింది.

* * *

రమాపతికి ఇరవై ఏళ్ళుంటాయి. మెరిక లాంటి వాడు. నమ్మకస్తుడు.

రమ ఫ్రెండ్ ఇంట్లో రెండేళ్ళుగా పని చేస్తున్నాడు. ఆవిడ అమెరికా వెళ్ళిపోతూ రమ దగ్గరకు పంపించింది. అతని గురించి ఫోన్‌లో గొప్పగా చెప్తుంటే "ఎందుకు లేవే!" అంది రమ నిరాసక్తిగా.

"అలాకాదు. నలుగురు వచ్చిపోయే యింట్లో ఎంత కష్టంగా ఉంటుందో నాకు తెలీదా... పైగా నీకేం తక్కువ...!? బోలెడంత

ఆస్తి... హాయిగా కాలు మీద కాలేసుకుని ఎన్‌జాయ్ చెయ్యక ఎందుకొచ్చిన హైరానా నీకు...!?" అంది . "సరే రానీ చూద్దాం!" అంది రమ.

మరి కాసేపటికే వచ్చాడు రమాపతి.

రమ అతడిని చూడగానే "పని వచ్చా? నమ్మకంగా చేస్తావా!?" అని అడగలేదు...

"హీరోలా వున్నావ్.. నీకెందుకీ పనులు సినిమాల్లోకో, కనీసం టి.వి.ల్లోకో వెళ్ళక పోయావా" అంది.

సిగ్గుగా నవ్వేశాడు రమాపతి. "పొండి అమ్మగారూ!" అంటూ.

ఇంటి పరిస్థితులన్నీ వివరించి చెప్పింది రమ.

అన్నింటికీ తలాడించాడు రమాపతి. అన్నీ విని కైకేయిలా తను కూడా మూడు వరాలు అడిగాడు.

మొదటిది జీతం మరో రెండొందలు ఎక్కువ ఇవ్వాలి. రెండవది ఇంట్లో పాచిపనికి తన మేనత్తని పెట్టాలి. మూడవది నెలకి రెండు రోజులు శెలవు కావాలి.

అన్నింటికీ సరే అంది రమ. సోమవారం నుండి పనికి వస్తానని చెప్పి వెళ్ళాడు. సోమవారం తెల్లారేసరికల్లా మేనత్తని వెంటబెట్టుకు వచ్చాడు.

ఇద్దరూ కలిసి ఇంటిని హేండోవరు చేసుకున్నారు. పొద్దున్న పదిగంటలు అయ్యేసరికి ఇంటి స్వరూపం మారిపోయింది. అద్దంలావున్న ఇంటిని చూసి రమ భర్త ఆనందరావు మురిసిపోయాడు.

ఇంటి పనులు,బజారు పనులు సమస్తం చెయ్యడమే కాకుండా బాబాయ్‌నీ, అత్తయ్యనీ కూడా చాలా చక్కగా హేండిల్ చేస్తాడు. (ఈ బాబాయ్ గురించి, అత్తయ్య గురించి 'హాసం'1-15 జనవరి, 2004 సంచికలో రాయడం జరిగింది. సరదాగా మరోసారి చదవండి.)

"పెద్దయ్యగారూ! మధ్యాహ్నం మాయాబజార్ చూసేటప్పుడు నన్నూ పిలవండేం" అని ఆయనని సంతోష పెడతాడు.

"పెద్దమ్మగారూ! లేత చింతకాయలు తెచ్చాను, మీ వారికిష్టంట కదా... పచ్చడి చేస్తా, తినండి. ఆయనకి అర్ధభాగం తృప్తిగా ఉంటుంది." అంటాడు రాజ్యం అత్తయ్యతో.

వారం రోజులు తిరిగేసరికి రమాపతి లేకుండా అసలు ఇన్నాళ్ళూ ఎలా ఉన్నాం అనుకున్నారు రమా, అనందరావు. అయితే అతని పేరుతోనే కాస్త చిక్కు వచ్చింది.

పన్లో చేరిన కొత్తలో 'రమాపతీ... రమాపతీ...' అని పిలవడం మొదలు పెట్టింది రమ. కానీ అప్పటిదాకా కూనిరాగాలు తీస్తూ పనిచేస్తున్న వాడు సీరియస్ కావడంతో తెల్లబోయింది.

విషయమేమిటని అతని మేనత్తని అడిగారు




రమ, ఆనందరావు.

"అమ్మగారూ! మీకోమాట చెప్పాలి- మావాడికి తనపేరంటే చాలా చిరాకు. వాళ్ళమ్మకి ఆడపిల్లలంటే ముద్దు. అందరూ కొడుకులే. వీడే కడసారివాడు. అందుకే ఆరేళ్ళొచ్చేదాకా జుట్టు పెంచి- జడవేసి, పరికిణీలు కట్టి ఆడపిల్లలా పెంచింది. ఆ వేషం చూసి, ఆడపిల్లలందరూ ఏడిపించేవారు. కాస్త పెద్దవగానే క్రాపు చేయించేసుకున్నాడు. అయినా తన పేరులో ఆడతనం మిగిలిపోయిందని బాధ. పూర్తిపేరు పెట్టి పిలిస్తే వాడికి చిర్రెత్తుకొస్తుంది."

"మరైతే... 'రమా!' అని పిలవ మంటావా?" అన్నాడు ఆనందరావు చికాగ్గా.

"రామ...రామ..! అలా రమా అని పిలిస్తే పనొదిలి పోతాడు" అంది మేనత్త. ఆ దంపతుల గుండె ఠామంది.

"మరైతే ఏం చెయ్యమంటావు?" అన్నారు ముక్తకంఠంతో.

"పతీ... అని పిలవండి" అంది.

నెల్రోజులు గడిశాయి. పిల్లలూ, పెద్దలూ అందరూ రమాపతి పనిపట్ల ముగ్ధులై పోయారు. అన్ని పనులూ అతనికి అప్పచెప్పి నిశ్చింతగా వుండడం మొదలుపెట్టారు.

ఓరోజు ఆనందరావు బంధువులు భోజనానికి వచ్చారు.

"అంతా బాగానేవుంది బావగారూ! అ పనివాడిని మా అక్క పతీ...పతీ అని పిలవడం, మీరేమో మా రమాపతి అని మురిపి పోవడం నాకు నచ్చలేదు సుమండీ. మా అక్క రమ! వాడు రమాపతి! మరి మీరెవరు!" అన్నాడు ఆ గుంపులోని బావమరిది వరసైన ఓ ప్రబుద్ధుడు.

ఆనందరావు మనసు చివుక్కుమంది. పైకి నవ్వేసి వూరుకున్నాడు.

మరి కొద్దిరోజులకే ఎవరో ఫ్రెండ్స్ వస్తే వాకిట్లో వరండాలో కూర్చుని మాట్లాడుతున్నాడు ఆనందరావు.

లోపల్నించి "పతీ...పతీ" అని అరిచింది రమ.

"మీ మిసెస్ పిలుస్తున్నారు" అన్నారు వాళ్ళు.

"అబ్బే నన్నుకాదండీ మా పనివాడిని" అన్నాడు ఆనందరావు.

"ఏమిటీ మీ ఆవిడ పనివాడిని పతీ అంటుందా...!? మరి మిమ్మల్నేమంటుంది?" అంటూ భళ్ళున నవ్వేశారు.

ఈ సారి కాస్త సీరియస్‌గానే రియాక్ట్ అయ్యాడు ఆనందరావు. ఆ రాత్రి రమతో చర్చించాడు.






"చాల్లేండి మీదంతా విచిత్రం - వాగేవాళ్ళు ఏదో వాగుతూనే వుంటారు" అనేసింది రమ.

"అలా కాదు రమా! వాళ్ళన్నదాంట్లో పాయింటు లేకపోలేదు'' అన్నాడు ఆనందరావు.

"మరైతే పర్యవసానం ఆలోచించండి." అనేసి పడుకుని నిద్రపోయింది రమ.

ఆనందరావుకి మాత్రం నిద్ర పట్టలేదు.

రమాపతిని ఎలా పిలవాలి - రమా అంటే వాడిక్కోపం, పతీ అంటే బాగోలేదు. మరెలా??.

మర, రప, మాప, పర, మతి అనుకుంటూ ఎన్నో కాంబినేషన్లు ప్రయత్నించి చూశాడు. ఏదీ కుదర్లేదు.

తెల్లారాక రమాపతిని పిల్చి "పతీ నిన్ను ముద్దుగా 'చిన్నా' అని పిలమంటావా?

"ఎద్దులా వున్నాను, నేను చిన్నాని ఏమిటండీ" అన్నాడు పతి.

"పోనీ 'అబ్బాయ్' అనమంటావా?"

''అబ్బాయిని కాక అమ్మాయినా? అయ్యగారూ నన్నేమైనా అనండి, నా పేరు నడ్డం పెట్టుకుని ఏడిపిస్తే నేనూరుకోను, అంతగా మీ కిష్టం లేకపోతే చెప్పండి నేను పనొదిలేసి పోతాను'' అన్నాడతను సీరియస్‌గా.

"అమ్మమ్మ వద్దులే..." అన్నాడు ఆనందరావు.

ఏదైనా ఇబ్బంది అనిపించనేకూడదు. ఒకసారి అలా అనిపించడం మొదలుపెడితే అతి చిన్న సమస్య కూడా భూతంలా కనిపిస్తుంది. ఆనందరావు పనీ అలాగేవుంది.

ఎవరి ఎదటైనా అతన్ని రమ ''పతీ'' అన్నప్పుడల్లా ఇతని మనసు కలుక్కుమంటూనే వుండేది.

ఒకసారి ఆనందరావు ఆఫీసువాళ్ళందరూ పిక్నిక్ ప్రోగ్రాం వేశారు. కార్తీకమాసం కూడా కలిసొచ్చింది.

"పిల్లలని చూసుకుంటాడు, వాళ్లు నా మాట వినరు, నేను పెడితే తినరు" అంటూ రమాపతిని కూడా ప్రయాణం చేయించింది రమ.

వాడు వెంటరావడం ఇష్టంలేక పోయినా రమ వినదు కాబట్టి ఊరుకున్నాడు ఆనందరావు.

అందరూ వచ్చారు. వన భోజనాల ఏర్పాట్లు కూడా బ్రహ్మాండంగావున్నాయి. పెద్దవాళ్ళూ పిల్లలైపోయారు. ఆనందరావు పేకాడుతున్నాడు. మరోవైపు గేమ్స్ జరుగుతున్నాయి. మ్యూజికల్ ఛైర్స్ వగైరాలు అయ్యాయి. మరో గేమ్ ప్రారంభం అయింది. వచ్చినవాళ్ళందరి పేర్లూ ఓ డబ్బాలో వేసి ఒక్కోటీ తీసి వారిని పిల్చి ఆటలు ఆడిస్తున్నారు. ముచ్చటగా మూడో పేరు రమ చీటీ వచ్చింది.

"మీరు మీ శ్రీవారితో కలిసి మాంచి రొమాంటిక్ డ్యూయెట్‌కి డ్యాన్సు చేయాలి" అని వుంది. అంతా గొల్లున నవ్వేశారు. 'నేన్రాను...నేన్రాను...' అని మొహమాట పడుతున్న రమని ముందుకి నెడుతున్నారు ఫ్రెండ్స్.

ప్రోగ్రాం కండక్ట్ చేస్తున్నాయన

"లాభంలేదు... రమగారూ... రావాలి, రమాపతిగారు కూడా ఎక్కడున్నా స్టేజీమీదకు రావాలి" - అన్నాడు మైకులో...

సిగ్గుపడుతూ వెళ్ళింది రమ.

ఆనందరావు పక్కవాళ్ళకి తన ముక్కలు అప్పచెప్పి వెళ్ళబోయేలోగానే ''రమగారు వచ్చేశారు, ఇక రమాపతిగారు రావాలి" అనే ఎనౌన్స్‌మెంట్ వినిపించడం, వెంటనే ఆదరాబాదరాగా పిల్లలకి అన్నం తినిపిస్తున్న రమాపతి స్టేజి మీదకి వెళ్ళడం క్షణంలోనే

జరిగిపోయాయి.

ఒక్క క్షణం అందరూ తెల్లబోయారు. మరుక్షణం అంతా ఘొల్లున నవ్వేశారు. గోలగోల చేశారు.

రమ గతుక్కుమని వెంటనే సర్దుకుంది. "పతీ... పిల్చింది నిన్నుకాదు అయ్యగారిని" అంది నవ్వేస్తూ.

ఆనందరావు మాత్రం అంత తేలిగ్గా తీసుకోలేదు. సాయంత్రందాకా ఫ్రెండ్స్ ఏడిపిస్తూ వుంటే లోలోపలే ఉడికిపోయాడు.

ఇంటికి రాగానే రమాపతి మీద ఒంటికాలిమీద లేచాడు. రమాపతి ఏదో చెప్పబోతుంటే కొట్టినంత పని చేశాడు.

రమ అడ్డుపడి ఆపింది. "మీరు ఆవేశంలో వున్నారు. వెళ్ళి పడుకోండి, రేపు తెల్లారాక మాట్లాడుకుందాం" అంది.

తెల్లవారేసరికి రమాపతీలేడు, వాడి మేనత్తాలేదు. రమ గుండె ఠారుమంది.

"పోతేపోయాడు పీడా వదిలింది. వీడి తాతలాంటివాడిని మరొకడిని తెస్తాను" అంటూ బీరాలు పోయాడు ఆనందరావు.

తాత లాంటి వాడు కాదుకదా... మనవడి లాంటి వాడు కూడా దొరకలేదు. ఫలితం ఆ ఇల్లు మళ్ళీ ఒక సర్కస్ డేరాలా తయారయింది.

పనివాడు వుండనీ, లేకపోనీ బాబాయ్ గారికీ, అత్తయ్య గారికీ వేళకి అన్నీ అమర్చాలి.

ఇవి కాక భర్తపనీ, పిల్లలపనీ... రమ హూనం హూనం అయిపోసాగింది, భార్య అవస్థ చూడలేక ఏమీ చేయలేక అవస్థపడిపోతున్నాడు ఆనందరావు. నాలుగు రోజులు హోటల్ నుంచి తెప్పించాడు. పిల్లలు సర్దుకుపోయినా బాబాయ్, అత్తయ్యా మాత్రం గొడవ చేసేశారు.

సమస్య తీవ్రతరం అయింది. రమ శారీరకంగా కన్నా మానసికంగా కృంగిపోయింది.

"అమ్మా... అమ్మా... అంటూ కడుపున పుట్టిన బిడ్డలా వుండేవాడు. అలాంటి వాడిని అన్యాయంగా వెళ్ళగొట్టారు" అంటూ గుర్తు చేసుకుని ఏడుస్తుంటే, పశ్చాత్తాపంతో బాధపడ్డాడు ఆనందరావు.

రమాపతి కోసం వెతికించడం మొదలు పెట్టాడు. ఈ ఊళ్ళో ఎవరికైనా పనిచేశాడేమో వాకబు చేస్తే లేదని తెలిసింది. వాళ్ళ ఊరికి మనిషిని పంపించాడు. ఇష్టదైవాలకి దణ్ణాలు పెట్టాడు.

పిల్లలు బెంగపెట్టుకుని 'నాన్నా పతి ఎప్పుడొస్తాడు' అని అడుగుతున్నారు. అన్నమానం "పతీ" అంటూ తల్చుకుని తల్చుకుని ఏడుస్తోంది రమ. అతి కష్టంమీద వారం రోజులు గడిచాయి. ఊరికి వెళ్ళిన పెద్దమనిషి కూడా రిక్తహస్తాలతో తిరిగి వచ్చేశాడు.

నిలువునా నీరయిపోయాడు ఆనందరావు.

ఓ నాడు...

రాత్రి పది గంటలయింది. ఫోన్ మోగింది. తీసి 'హలో' అన్న ఆనందరావు ఆనందంతో ఎగిరి గంతేశాడు.

"పతీ నువ్వా!" అన్నాడు.

"అయ్యగారూ! బుద్ధి గడ్డితిని మీకు చెప్పకుండా వచ్చేశాను. మిమ్మల్నందర్నీ వదిలి ఉండలేకపోతున్నాను. మీ ఇష్టం వచ్చిన పేరుతో పిలవండి. మీరేం పిలిచినా పలుకుతాను. మళ్ళీ పన్లోకి రావొచ్చా?" దీనంగా అడిగాడు.

"మేమూ నిన్ను వదిలి వుండలేక పోతున్నాం. నీ ఇష్టం వచ్చిన పేరుతోనే పిలుస్తాం... వచ్చెయ్. ఇన్నాళ్లా రాకపోతే వేరే చోట పనికి కుదిరావనుకున్నా" అన్నాడు ఆనందరావు.

"ఒకచోట పని కుదిరిందండి. కానీ పతీ అని పిలవాలనగానే ఆ ఇంటాయన తాడియెత్తున లేచాడండి. ఆయన భార్య పేరు 'సతి'ట!"

ఫక్కున నవ్వాడు ఆనందరావు.

ఈ సంభాషణ వింటున్న రమ ఒక్క గెంతుతో ఫోన్ దగ్గరికి వచ్చేసింది

"ఎవరూ...? పతే...!?" అంది సంభ్రమాశ్చర్యాలతో

"అవును పతే! ఇదుగో మాట్లాడు" అంటూ ఫోన్ అందించాడు.

"పతీ! ఎలా వున్నావు? ఎక్కడున్నావు? త్వరగా వచ్చెయ్" అని రమ అంటూవుంటే బాధ అనిపించలేదు సరికదా - "అమ్మయ్య నా భార్య ఇకనైనా ఆనందంగా వుంటుంది, పతి దొరికాడుగా" అనుకున్నాడు ఆనందరావు తృప్తిగా.

ఫిబ్రవరి 20 సంగీతదర్శకుడు టీవి రాజుగారి వర్ధంతి సందర్భంగా ...

# 'కృష్ణా, ముకుందా మురారి....' పాట కన్నా గొప్ప ప్రయోగం ఉంటుందనుకోను

**- నాటి టి.వి.రాజు గురించి నేటి రాజ్**


సంగీత దర్శకుడు కీ.శే. టి.వి.రాజు

జయకృష్ణముకుందా మురారి, వెన్నెల చిన్నెల నెరా, ఢాంగురే బంగారురాజా, మత్తు వదలరా నిద్దురమత్తు వదలరా, నేడే ఈనాడే కరుణించె నన్ను చెలి తానే, తెలుగుజాతి మనది నిండుగ తెలుగుజాతి మనది వంటిపాటలు గుర్తున్న వాళ్ళకి టి.వి.రాజు అంటే ఎవరో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

రాజ్ - కోటి ద్వయంలోని రాజే - 'సిసింద్రీ'లో 'చిన్నితంద్రీ నిన్ను చూడగా వేయికళ్ళయిన సరిపోవురా' పాటను స్వరపరిచారని తెలిసిన వాళ్ళకి ఈ రాజు ఆ టి.వి.రాజు గారాబ్బాయేనని వేరేగా చెప్పక్కర్లేదు.

నటనలోను, స్వరరచనలోను తండ్రి వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న శ్రీ రాజ్‌తో 'హాసం' తరపున ప్రముఖ పాత్రికేయుడు, వర్ధమాన గీత రచయిత శ్రీ ఆర్.డి.యస్. ప్రకాష్ ముచ్చటించి - కీ.శే. టివీ రాజుగారి గురించి అందించిన వివరాలివి.

✦ **మీ నాన్న గారికి బాగా ఇష్టమైన రాగం ఏమిటి?**

❄ మోహన, భీంప్లాస్, మాల్‌కోస్‌లో రాగాలు ఆయనకు బాగా ఇష్టం. ట్యూన్‌లు ఇచ్చి పాటలు రాయించడం అన్నది అప్పుడే ప్రారంభమైంది. దర్శకులు ఏదైనా సన్నివేశం చెప్పి పాట ట్యూన్ వినిపించమన్నపుడు ఆయన మోహన, భీంప్లాస్, మాల్‌కోస్ రాగాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవారు.

✦ **ఆయనకు బాగా ఇష్టమైన వాద్యం ఏది?**

❄ ఆయనకు మోడ్రన్ ఇన్‌స్ట్రుమెంట్స్ బాగా ఇష్టం. గిటార్‌ని బాగా వాయించేవారు. ఎలక్ట్రిక్ గిటార్ వచ్చిన తొలిదశలో దానిని బాగా ఉపయోగించిందీ, పాపులర్ చేసింది నాన్నగారే. ఆ సీజన్‌లో ఆయన మోడ్రన్ అడ్వాన్స్‌డ్ ఇన్‌స్ట్రుమెంట్స్ వాడే మోడ్రన్ మ్యూజిక్ డైరెక్టర్.

✦ **సంగీతంలో ఆయన చేసిన ప్రయోగాల గురించి చెప్పండి?**

❄ ఆయన గ్రాండ్‌గా ఫుల్ ఆర్కెస్ట్రాతో వర్క్ చేసేవారు. అతి తక్కువ ఆర్కెస్ట్రాతో కూడా వర్క్ చేసేవారు. పౌరాణిక చిత్రాలలో వీణ, సితార్ లాంటి సంప్రదాయ వాద్యాలే కాక మోడ్రన్ వాద్యాలైన ట్రంపెట్స్ లాంటివి కూడా ఎంతవరకు వాడాలో అంతవరకు వాడి మెప్పించారు. 'శ్రీకృష్ణపాండవీయం' చిత్రంలో దుర్యోధనుడి పాత్ర ప్రవేశం సందర్భంలో ఫాన్‌ఫెయిర్ లాగా మోడ్రన్ వాద్యాలు కూడా ఉపయోగించి నేపథ్యసంగీతం చేశారు.

✦ **దర్శక నిర్మాతలతో ఆయన వ్యవహారశైలి ఎలా ఉండేది?**

❄ చాలా బావుండేది. నాన్నగారు చాలా ప్లెజంట్ పర్సన్. అందరితో బాగా ఫ్రెండ్లీగా ఉండేవారు. ఎప్పుడు సరదాగా నవ్వుతూ మాట్లాడేవారు. ఆయనతో పనిచేసిన చాలామంది దర్శక నిర్మాతలు మళ్ళీ మళ్ళీ ఆయనతో పని చేయడానికి ఆసక్తి చూపించేవారు. నాన్నగారు బిగినింగ్ స్టేజ్‌లో యోగానంద్ గారితో చాలా పిక్చర్స్‌కి పనిచేశారు. చాలా గ్యాప్ తర్వాత యోగానంద్‌గారు డైరెక్ట్ చేస్తున్నప్పుడు నాన్నగారే చేయాలని (1969-70లలో అనుకుంటా) ఓ తమిళ పిక్చర్ కూడా చేయించారు. 'త్యాగరాయభాగవతార్' అని ఆరోజుల్లో తమిళలో పాపులర్ హీరో. ఆయన నటించిన 'శ్యామల' చిత్రంతో మా ఫాదర్ కెరీర్ ప్రారంభమైనది.

✦ **ఆయన ట్యూన్ ఇచ్చిపాట రాయించేవారా? పాటకి ట్యూన్ కట్టడానికి ఆసక్తికనబరిచేవారా?**

❄ రెండూ చేసేవారండి. ట్యూన్‌ఇవ్వడం అనేది ఆయన టైమ్‌లోనే ప్రారంభమైనది. అయితే రామారావుగారి ఎన్.ఏ.టి. సంస్థలో పాటకి ట్యూన్ కట్టడం ఉండేది. నేను ఎన్.ఏ.టి. సంస్థలో పాటల స్క్రిప్టులకు నాన్నగారు ట్యూన్ కట్టడం చూశాను. కొందరు సిట్యుయేషన్ చెప్పి దానికి తగ్గ ట్యూన్ కావాలనేవారు. ఎవరికి ఎలాకావాలో అలా చేసిచ్చేవారు.

✦ **ఆయన వర్క్‌స్టయిల్ ఎలా ఉండేది. కంపోజింగ్ టైమ్‌లో సహచరులతో ఆయన ప్రవర్తన గురించి...?**

❄ నాన్నగారు టైమ్ బాగా మెయిన్‌టైన్ చేసేవారు. ఒక్కసారి కంపోజింగ్‌లో కూర్చుంటే సాయంత్రం వరకూ అందులోనే మునిగిపోయి ఉండేవారు. ఒక్కోసారి సరదాగా, జోక్‌లు వేస్తూ రిలాక్స్‌గా చేసేవారు. ఆయా సందర్భాలని బట్టి ఆయన కంపోజింగ్ స్టయిల్ ఉండేది. 'కథానాయకుడు' పిక్చర్ కంపోజింగ్‌కి నేను వెళుతుండేవాడిని. నిర్మాత గోపాలకృష్ణ గారు , నేటి ఏ.ఏ. ఆర్ట్స్ నిర్మాత మహేంద్రగారు, డైరెక్టర్ హేమాంబరధరరావుగారు, కొసరాజుగారూ, మాఫాదర్ అసిస్టెంట్ కమల్‌దాస్‌గారు, శ్రీరాములుగారు, విజయకృష్ణమూర్తి,(తర్వాత బి. విఠలాచార్యగారి చిత్రాలకు మ్యూజిక్ డైరెక్టర్‌గా పనిచేశారు.) నాన్నగారు ఇలా టీమ్ అంతా ఉండేవారు. అక్కడంతా సరదాగా జరిగిపోతుండేది. మాట్లాడుకుంటూ ఉండగా సడన్‌గా ఏదో థాట్ వస్తే వెంటనే ట్యూన్ కంపోజ్ చేసేవారు నాన్నగారు.

మేంకూడా అంతే. ఒక్కొక్కరితో చేసేటప్పుడు చాలా ఈజీగా ఉంటుంది. అంటే కంఫర్ట్‌బుల్‌గా ఉంటుంది. అప్పట్లో మేం చేసిన 'చిక్‌బమ్ చికబమ్' ఆడియోలో చేసిన పాటలన్నీ ఒక్కరోజులోనే కంపోజ్ చేశాం. ఆడియోపెద్దహిట్ అయింది.

✦ **సమకాలిక సంగీత దర్శకులతో ఆయన రిలేషన్స్ ఎలా ఉండేవి?**

❄ ముందే చెప్పినట్టు ఆయన మంచి స్నేహశీలి. అందరితో కలివిడిగా

ఉండేవారు. అప్పట్లో మ్యూజిక్ డైరెక్టర్స్ మధ్య వృత్తిపరమైన కాంపిటీటివ్ యాటిట్యూడ్ ఉండేది కాదు. ఎవరి బేనర్స్‌లోవారు వర్క్ చేసుకుంటూ చాలా హెల్దీ ఎట్మాస్ఫియర్ మెయిన్‌టైన్ చేశారు. ఎవరికివారు జస్టిస్‌పై చేయగలం అనుకున్న పిక్చర్స్‌నే చేసేవారు. ఒకసారి రాజేశ్వరరావు మాస్టర్‌గారు తన దగ్గరికి ఒక జానపద చిత్రనిర్మాత వస్తే -ఇది రాజుగారి అయితే బాగా చేస్తారు. రాజుగారితో చేయించండి-అని చెప్పి వారిని నాన్నగారి దగ్గరకు పంపించారు. ఒకసారి నాన్నగారికి ఒక పిక్చర్ వస్తే- ఇది మాస్టర్ వేణుగారయితే బాగావుంటుంది ఆయనతో చేయించండి- అనిచెప్పడం నాకు గుర్తుంది. అలాంటి ఫ్రెండ్లీ వాతావరణం అప్పట్లో వుండేది. అందరూ ఒకే కుటుంబంలా ఉండేవారు. అందుకే ఘంటసాలగారి అబ్బాయిలు విజయకుమార్, రత్నకుమార్, వేణుగారి భాను(చందర్) గానీ. మూర్తిగానీ, కోదండపాణిగారి ఈశ్వర్ గానీ మేమంతా ఫ్రెండ్లీగా ఉండేవాళ్ళం. ఇప్పటికి ఫ్రెండ్స్‌గా ఉన్నాం.

నాన్నగారు చేసిన గొప్పప్రయోగం 'పాండురంగమహత్యం'లో 'కృష్ణా, ముకుందా మురారి....' పాట. అంతకన్నా ప్రయోగం ఉంటుందనుకోను. 12 నిముషాలపాట..... అంతగొప్పగా కంపోజ్ చెయ్యడం దుస్సాధ్యం. రంజింపచేయడం ఇంకా దుస్సాధ్యం. సినిమా మొత్తం పూర్తయ్యాక చివరలో వచ్చేసాంగ్ అది. భక్తిలో ఎన్ని రకాలు ఉన్నాయో అన్నిటినీ సృశించే పాట అది. అలాగే రీ-రికార్డింగ్స్‌లో కూడా ఆయన ఎన్నో ప్రయోగాలు చేశారు. పౌరాణిక చిత్రాలలో మోడ్రన్ వాద్యాలు ఎక్కువగా ఉపయోగించేవారు.




అలాగే కొత్త సింగర్స్‌ని కూడా బాగా ఎంకరేజ్ చేశారు. జేసుదాసు గారిని, ఎల్.ఆర్.ఈశ్వరి గారిని, ఎ.ఎల్ రాఘవన్ అని తమిళ సింగర్‌నీ బాగా ఎంకరేజ్ చేశారు. వీళ్ళేకాదు టాలెంట్ ఉంది అనుకున్నవాళ్ళకి రెండు మూడు సాంగ్స్ ఇచ్చి ఎంకరేజ్ చేసేవారు.

✦ **మీలో ఉన్న మ్యూజిక్ టాలెంట్‌ని ఆయన ఎప్పుడు గుర్తించారు?**

❊ నేను మెదటినుండి ఆయనతోనే ఉన్నాను. ఫలానా టైమ్‌లో గుర్తించారు అని చెప్పలేను కాని, రికార్డింగ్స్, రీరికార్డింగ్స్‌లో 15-16సం॥వయస్సులోనే నేను పర్కషన్స్, రిథమ్స్ వాయించేవాణ్ణి. ట్యూన్స్ కంపోజ్ చేయమని చాలాసార్లు ఎంకరేజ్ చేశారు. నేను ఒక సాంగ్ కంపోజ్ చేశాను. 'వెరీగుడ్' అని అభినందించారు.

✦ **ఆయనలో మీరు గుర్తించిన ప్లస్ పాయింట్స్ - మైనస్ పాయింట్స్ ఏమిటి?**

❊ మంచి టేస్ట్ ఉండేది. ఆయనవి అన్ని మోడ్రన్ థాట్స్. ఎప్పుడూ అడ్వాన్స్‌డ్‌గా ఉండేవారు. ఆయన సక్సెస్‌కి అదే కారణం. ఎగ్జిక్యూషన్‌లో మాత్రం ఆయన చాలాపూర్. కొన్ని పనులు ఆర్గనైజ్ చేయడానికి ఇతరుల మీద ఆధారపడేవారు. అది కొన్నిచోట్ల మిస్‌యూజ్ అయ్యేది.

✦ **ఆయన ఆర్టిస్ట్‌గా కూడా చేశారు. ఇప్పుడు మీరు కూడా కొన్ని చిత్రాల్లో నటిస్తున్నారు. ఈ వారసత్వ సామ్యం ఎలా కుదిరింది?**

❊ ఆయన చాలా పిక్చర్స్‌లో చేశారు. బాంగారుపాప, పల్లెటూరిపిల్ల.... ఇలా చాలా చిత్రాలున్నాయి. 'పాండురంగమహత్యం'లో 'కృష్ణాముకుందామురారి....' పాటలో భక్తుడుగా కనిపిస్తారు. ఇకనేను నటించడం గురించి చెప్పాలంటే - ఎవరైనా వచ్చి అడిగితే చేస్తున్నాను తప్ప.... నేను ఎవరిని అవకాశం ఇవ్వండి అని అడిగి చేయడం లేదు.

రెండింటిలో మ్యూజిక్కే నా మెయిన్ ప్రొఫెషన్.

✦ **ఈయన ఆదినారాయణరావుగారి శిష్యుడు- సత్యంగారు ఆయన శిష్యుడు- వీరిద్దరితో రాజుగారి అనుబంధం ఎలా ఉండేది?**

❊ ఆదినారాయణరావుగారు అంటే చాలా ఇష్టం గౌరవం. చివరివరకూ నాన్నగారు ఆదినారాయణరావుగారిని కాంటాక్ట్‌లో ఉంటూ ఎప్పుడూ కలుస్తూ ఉండేవారు. అలాగే సత్యంగారితో కూడా ఎంతో ఫ్రెండ్లీగా ఉండేవారు.

✦ **నాన్నగారి గురించి మీరు ప్రత్యేకంగా చెప్పాలనుకుంటున్నది ఏమైనా ఉందా?**

❊ మెయిన్ థింగ్- ఐ మిస్ హిమ్...

✦ **మీ నాన్నగారితో మీ అనుబంధం ఎలా ఉండేది?**

❊ చాలా చాలా బాగుండేది. I Spent happy times with him స్కూల్లో కన్నా రికార్డింగ్ థియేటర్‌లోనే ఎక్కువ టైం స్పెండ్ చేశాం. రికార్డింగ్‌లకి, సినిమాలకీ ఆయనే తీసుకువెళ్ళేవారు. ఆయనతో గడిపిన ప్రతిక్షణం నాకెంతో విలువైనది. మధురమైనది. నా 18ఏళ్ళ వయస్సులోనే ఆయన పోయారు. స్కూల్లో ఆటల్లో ఫ్రెండ్స్‌తో తిరగడాలు తెలియదునాకు. ఎప్పుడూ నాన్నగారితోనే ఉండేవాడిని. ఆయన అందరితో ఫ్రెండ్లీ రిలేషన్ మెయిన్‌టైన్ చేసేవారు. రామారావు గారింటికి, అట్లూరి పుండరీకాక్షయ్య గారింటికి , యోగానంద్ గారింటికి ఆయనతోనే వెళ్ళాను.

✦ **అప్పట్లో ఏడాదికి నాన్నగారు ఎన్ని సినిమాలు చేసేవారు?**

❊ 1967లో అనుకుంటా. నాన్నగారు ఎనిమిది పిక్చర్స్‌కి పనిచేస్తే.. 'అబ్బో-రాజుగారు ఎనిమిది పిక్చర్స్ చేశారు' అనుకున్నారంతా. ఏడాది మొత్తంలో రిలీజయ్యే చిత్రాలే పాతిక కంటే ఎక్కువ ఉండేవి కాదుమరి. ఆ రోజుల్లో నాన్నగారు మొత్తం దాదాపు వంద చిత్రాలకు మ్యూజిక్ చేశారు. ఆ రోజులకి అదే రికార్డ్ అని చెప్పాలి.

✦ **ఆయనకి రావాల్సిన స్థాయీ, గుర్తింపు వచ్చిందని భావిస్తున్నారా?**

❊ పరిశ్రమ పరంగా, ప్రేక్షకుల పరంగా ఆయనకు చాలామంచి గుర్తింపు వచ్చిందనే భావిస్తున్నాను. ఒక్క ఎన్.టి.రామారావుగారితోనే 20 పిక్చర్స్ పైగా వర్క్‌చేశారు. ఎన్.ఏ.టి. సంస్థలోనే దాదాపు 10 పిక్చర్స్ చేశారు. డి.వి.ఎస్. రాజుగారి బేనర్‌లో అట్లూరి పుండరికాక్షయ్య గారి బేనర్‌లో, అప్పట్లో దాదాపు పిక్చర్స్ నాన్నగారు చేశారు. కృష్ణ, శోభన్‌బాబు గార్లతో కూడా చాలా పిక్చర్స్ చేశారు.

✦ **నాన్నగారితో మీకు మరపురాని అనుభూతిగా మిగిలిపోయిన సంఘటన...?**

❊ ప్రతిదీ మరువురాని అనుభూతే. మ్యూజిక్ డైరెక్టర్ సి.రామచంద్రగారంటే నాకు విపరీతమైన అభిమానం. ఒకసారి నాపుట్టినరోజు నాడు నాకోసం రామచంద్రగారిని తీసుకొచ్చారు. అది మరిచిపోలేని మధురానుభూతి.

**- ఆర్.డి.యస్. ప్రకాష్**



# టి.వి.రాజు హిట్స్

## చిత్రం: శ్రీకృష్ణపాండవీయం

రచన: కొసరాజు　　గానం: ఘంటసాల

వ: అపాయమ్ము దాటడానికి కుపాయమ్ము కావాలి
అంధకారమలమినపుడు వెలుతురుకై వెతకాలి
ముందుచూపు లేనివాడు ఎందులకు కొరగాడు
సోమరియై తిరుగువాడు సూక్ష్మమ్ము గ్రహింపలేడు.
ప: మత్తు వదలరా నిద్దుర మత్తు వదలరా
ఆ మత్తులోన పడితే గమ్మత్తుగా చిత్తవుదువురా ॥మత్తు॥
చ: జీవితమున సగభాగం నిద్దురకే సరిపోవు
మిగిలిన ఆ సగభాగం చిత్తశుద్ధి లేకపోవు
అతినిద్రాలోలుడు తెలివిలేని మూర్ఖుడు ॥2॥
పరమార్థం గాన లేక వ్యర్థంగా చెడతాడు ॥మత్తు॥
వ: సాగినంతకాలము నా అంతవాడు లేడందురు
సాగకపోతే ఊరక చతికిలపడి పోదురు
కండబలము తోటే ఘనకార్యం సాధించలేరు.
బుద్ధిబలం తోడైతే విజయమ్ము వరింపగలదు
చ: చుట్టుముట్టు ఆపదలను మట్టుబెట్ట బూనుమురా
పిరికితనము కట్టిబెట్టి ధైర్యము చేబట్టుము రా
కర్తవ్యం నీ వంతు కాపాడుట నా వంతు ॥2॥
చెప్పడమే నా ధర్మం వినకపోతే నీ ఖర్మం ॥మత్తు॥

## చిత్రం: భలే తమ్ముడు

రచన: సి. నారాయణ రెడ్డి　　గానం: మహమ్మద్ రఫీ, పి. సుశీల

ఆ: నేడే ఈనాడే కరుణించె నన్ను చెలికాడే
ఆ: కనులముందున్న రతనాలమూర్తిని
విలువలెరుగక విసిరితిని
కనులు తెరిచీ విలువ తెలిసి
కనులు తెరిచీ విలువ తెలిసీ
మనసే గుడిగా మలచితినీ
మనసే గుడిగా మలచితినీ ॥నేడే॥
ఆ: మదిలో విరిసే మమతల మాలలు
చెలిమికి కానుక చేసెదను
ఆరని వలపుల హారతి వెలుగుల
ఆరని వలపుల హారతి వెలుగుల
కలకాలం నిను కొలిచెదను
కలకాలం నిను కొలిచెదను ॥నేడే॥
అ: చిలిపిగ కసిరే...
చిలిపిగ కసిరే చెలియ విసురులో
అలకలు గని నవ్వుకున్నాను
చేతులు సాచి చెంతకు చేరిన
చేతులు సాచి చెంతకు చేరిన
ఆ చెలినే అందుకున్నాను
ఆ చెలినే అందుకున్నాను
నేడే ఈనాడే మురిపించె నన్ను చెలి తానే

## చిత్రం: విచిత్ర కుటుంబం

రచన: సి. నారాయణ రెడ్డి　　గానం: ఘంటసాల, సుశీల

ప: ఆడవే! ఆడవే!
ఆడవే! జలకమ్ములాడవే!
కలహంసలాగ - జలకన్యలాగ ఆడవే! ఆడవే!
చ: ఆదికవి నన్నయ్య అవతరించిన నేల
తెలుగు భారతి అందియలు పల్కె ఈ నేల
ఆంధ్ర సంస్కృతికి తీయని క్షీరధారలై
జీవకళలొల్కు గోదావరి తరంగాల ॥ఆడవే॥
చ: నాగార్జునుని బోధనలు ఫలించిన చోట
బౌద్ధమత వృక్షమ్ము పల్లవించిన చోట
కృష్ణవేణీ తరంగిణి జాలిగుండెయే
సాగరమ్మై రూపు సవరించుకొను నీట ॥ఆడవే॥
చ: కత్తులును గంటములు కదను త్రొక్కినవిచట
అంగళ్ళ రతనాలు అమ్మినారట యిచట
నాటి రాయల పేరు నేటికిని తలపోయు
తుంగభద్రానదీ తోయమాలికలందు ॥ఆడవే॥

## చిత్రం: తల్లా - పెళ్లామా

రచన: సి.నారాయణ రెడ్డి　　గానం: ఘంటసాల, ఎన్.టి.ఆర్. బృందం

ప: తెలుగుజాతి మనది - నిండుగ వెలుగుజాతి మనది
తెలంగాణా నాది - రాయలసీమ నాది
సర్కారు నాది - నెల్లూరునాది
అన్నీ కలసిన తెలుగునాడు -
మనదే - మనదే - మనదేరా ॥ తెలుగు॥
చ: ప్రాంతాలు వేరైనా - మన అంతరంగ మొకటేనన్నా
యాసలు వేరుగ వున్నా - మన బాస తెలుగుబాసన్నా
వచ్చిండన్నా వచ్చాడన్నా
వచ్చిండన్నా వచ్చాడన్నా వరాల తెలుగు వొకటేనన్నా ॥తెలుగు॥
చ: మహాభారతం పుట్టింది రాజ్మహేంద్రవరంలో
భాగవతం వెలసింది ఏకశిలానగరంలో
ఈరెంటిలోన ఏదికాదన్నా ఇన్నాళ్ల సంస్కృతి నిండుసున్న ॥తెలుగు॥
చ: పోచంపాడు ఎవరిది? నాగార్జునసాగరమెవరిది?
మూడు కొండ్రలూ కలిసి దున్నిన
ముక్కారు పంటలు బండ్లకెత్తిన
అన్నపూర్ణమ్మ కన్నబిడ్డలౌ అయిదుకోట్ల తెలుగువారిది ॥ తెలుగు॥
చ: సిపాయి కలహం విజృంభించ నరసింహాలై గర్జించాము
గాంధి నెహ్రూల పిలుపు అందుకొని సత్యా గ్రహాలు చేశాము
స్వరాజ్యసిద్ధి జరిగిన పిమ్మట స్వరాష్ట్రమును సాధించాము
దేశభక్తిలో తెలుగువారికి దీటే లేదనిపించాము ॥ తెలుగు॥
చ: ఇంటిలో అరమరికలు ఉంటే ఇల్లెక్కి చాటాలా!
కంటిలో నలక తీయాలంటే కనుగ్రుడ్డు పెరికివేయాలా!
పాలుపొంగు మన తెలుగుగడ్డను పగలగొట్టవద్దు!
నలుగురిలో మనజాతి పేరును నవ్వులపాలు చెయ్యొద్దు ॥ తెలుగు॥

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



24

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి ఆండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక ఒప్పుకున్న వెంకట్రావు దంపతులచేత తూతూ మంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడిన వెంకట్రావుకు తెల్లవారుజాము మూడున్నరకు ఆయనను కలిసే అవకాశం దొరుకుతుంది. తన సమస్యను వాస్తుభూషణరావుకు విన్నవిస్తాడు వెంకట్రావు. (ఇక చదవండి)

"తేలేదు స్వామీ. మర్చిపోయొచ్చాను.
"అదీ వాస్తులోపమే. నీ ఇల్లు ఏ ముఖం?"
"తూర్పు ముఖం స్వామీ"
"దిక్కులు, విదిక్కులు ఏంటీ?"
"దిక్కులు నాలుగని తెలుసు కానీ విదిక్కులు ఏమిటో తెలియవు స్వామీ."
"వాస్తులోపం ఉంటే ఇంటి యజమానికి ఇలాంటివి తెలియవు. ఆయం ఏంటి?"
"ఈ ఆయాలు గాయలు నాకు తెలియవు స్వామీ."
నిట్టూర్చాడు వాస్తు భూషణం. కళ్ళు మూసుకుని తలపైకెత్తి చేతి వేళ్ళతో ఏవో లెక్కలు వేస్తూ దీర్ఘంగా ఆలోచించాడు. రెండు నిముషాల తరువాత తల దించాడు.
"ఆ... నీ ఇల్లు చూశాను నాయనా" అన్నాడు.
"ఎప్పుడు స్వామీ" అన్నాడు వెంకట్రావు ఆశ్చర్యంగా.
"ఇప్పుడే మనో నేత్రంతో చూశాను. నీ ఇంటికి ముందు వైపు ఎక్కువ వెనుక వైపు తక్కువ ఖాళీ స్థలం ఉంది."
"అవును స్వామీ, అవును. ఎలా తెలుసుకున్నారు?"
"పిచ్చివాడా.. ఇల్లు చూశానని చెబుతుంటే ఎలా తెలుసుకున్నారని అడుగుతావేం? వాస్తు లోపం ఉంటే యజమానికి కాన్సన్‌ట్రేషన్ ఉండదు నాయనా.. నీ ఇల్లు అనేక వాస్తు లోపాలతో నిండి ఉంది. ప్రత్యక్షంగా చూసి మాత్రమే తగిన సలహా ఇవ్వగలను."
"తప్పకుండా స్వామీ రేపు రాగలరా?"
"హి.. హి.. పిచ్చివాడా.. డైరీ చూసి చెబుతాను." డైరీ తీశాడు వాస్తు భూషణం.
పేజీలు తిరగేశాడు.
"నాయనా.... మరో ఎనిమిది నెలల దాకా నాడైరీలో ఒక్కలైను కూడా ఖాళీ లేదు. వచ్చే సంవత్సరం జనవరి ఒకటో తారీఖున బుక్ చేసుకో. రిసెప్షన్లో పదివేలు కట్టి నీ చిరునామా వ్రాసి బుకింగ్ నెంబర్ తీసుకో.




"మై గాడ్.. మీరు అంత బిజీయా.... సరే స్వామీ... వస్తాను." నీరసంగా లేచాడు వెంకట్రావు.
అంత వరకూ కుదరదు, రేపే రావాలని అడగకుండా వెళ్ళొస్తానని చెప్పడంతో ఖంగు తిన్నాడు వాస్తుభూషణం.
"అగాగు..." వెళ్ళబోతున్న వెంకట్రావుతో అన్నాడు.
"ఏమిటి స్వామీ" అన్నాడు వెంకట్రావు.
"నీది మరీ అర్జెంటు కేసా"
"అవును స్వామీ... ఎమర్జెంటు."
"అలాగా పాపం! ఎంతో దూరం నుంచి ఎంతో నమ్మకంతో నాదగ్గరకు వచ్చిన ఎమర్జెంటు కేసులను కొంచెం సింపథటిగ్గా కన్సిడర్ చేస్తాను. మీది ఏగ్రామం?"
"గ్రామం కాదండీ. ఈ భాగ్య నగరమే."
"మంచిది. మీ ఇల్లెక్కడ?"
"ముర్కీపురం"
"ఇల్లు ఎంత పెట్టి కొన్నావు?"
"పది లక్షలు పోశాను స్వామీ."
"అయితే జస్ట్ ఇరవై వేలు కన్సల్టేషన్ ఫీజు కట్టి రశీదు తీసుకొండి రేపే వచ్చి చూస్తాను."
"ఇరవై వేలా?" నోరు తెరిచాడు వెంకట్రావు.
"అది చాలా తక్కువ మొత్తం నాయనా. ఇంటికైన ఖర్చులో రెండు శాతం మాత్రమే. వాస్తుకు ఆ మాత్రం ఎవరైనా పుచ్చుకుంటారు."
అనవసరంగా గొప్పలకు పోయి ఆరు లక్షల దానికి పదిలక్షలు చెప్పినందుకు తనను తానే నిందించుకున్నాడు వెంకట్రావు. ఇపుడు మాట మారిస్తే ఛండాలంగా ఉంటుంది.
"కానీ అంత ఛార్జీ అంటే...." నసిగాడు.
"చూడు నాయనా. మనం తిరుపతి వెళ్తాం ధర్మదర్శనం క్యూ నాలుగు కిలో మీటర్ల పొడవుంటుంది. అపుడేం చేస్తాం? నలభై రూపాయల క్యూకు వెళ్తాం. అక్కడ మూడు కిలో మీటర్ల క్యూ ఉంటుంది. మనకవతల ట్రయిన్ టైం అవుతుంటుంది. అపుడేం చేస్తాం? వందరూపాయల క్యూకు వెళ్తాం. అక్కడ రెండు కిలో మీటర్ల పొడవు క్యూ ఉంటుంది. మనకవతల ట్రెయిన్ టైమై పోతూ ఉన్నది. టెన్షన్ పెరుగుతుంది. అపుడేం చేస్తాం? రెండు వేల అయిదు వందలు పెట్టి కళ్యాణం టిక్కెట్టు కొని గంటలో బయట పడతాం. అంతే కదా! ఇక్కడాఅంతే! ఎనిమిది తొమ్మిది నెలలు ఆగి లక్షల్లో నష్టపోయే కంటే ఇరవై వేలు అవతల పారేసి లాభ పడటం మంచిది కదా!" అన్నాడు వాస్తు భూషణం.
"అలాగే నండి రేపుదయం రండి." లేచాడు వెంకట్రావు.
"వాస్తు ఫల ప్రాప్తిరస్తు" దీవించాడు వాస్తుభూషణం.

* * *

"మనింట్లో కచ్చితంగా ఏదోక వాస్తులోపం ఉండి తీరుతుంది. లేకపోతే ఈ విధంగా డబ్బు వదలడం జరగదు. శతక కారుడేమన్నాడు?
సిరి దావచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలము భంగిన్
సిరిదా పోయిన పోవును
కరి మింగిన వెలగ పండు కరిణిని సుమతీ!
అంటే లక్ష్మి అనేది........."
"అబ్బ అవండి ఆవేధవగోల! అర్థమైందిలెండి." వెంకట్రావు సన్యాసాన్ని మధ్యలోనే ఖండిస్తూ అన్నది సుందరి విసుగ్గా.
"అదేంటోయ్ అంత కోపం? శతకంలో చెప్పింది మనకెలా నరిపోతున్నాదో చెబుతుంటే..." నవ్వుతూ అన్నాడు వెంకట్రావు.
"మేమూ చదివేం ఆ శతకాలు చిన్నప్పుడు. ఇదేమైనా కవి సమ్మేళనమా... కవిత్వం చదివి అర్థాలు తాత్పర్యాలు చెప్పడానికి? నాకూ




అవినీతి నిరోధక శాఖ, హైదరాబాద్ వారు ఇటీవల నిర్వహించిన కార్టూన్‌ల పోటీలో ద్వితీయ బహుమతిని పొందిన కార్టూన్ యిది.

తెలుసు" కోపంగా అన్నది సుందరి.

"వెధవ డబ్బు పోతే పోయింది గానీ కోపంలో నీ అందం ద్విగుళం బహుళం అవుతుందోయ్."

"సంతోషించాం గానీ ఈ భోషాణం ఇంకా రాలేదేంటి?"

"భోషాణమా?"

"ఈ పాటికీ రావాలే...."

ఇంతలో కాలింగ్ బెల్ మోగింది. వెంకట్రావు తలుపు తీశాడు.

ఎదురుగా వాస్తు భూషణం!

"ఓ.. వచ్చారు... వచ్చారు... రండి.. రండి... నమస్కారం. దయచెయ్యండి." ముఖాన నవ్వు పులుముకుని స్వాగతం చెప్పాడు వెంకట్రావు.

"వాస్తు ఫలప్రాప్తిరస్తు" లోపలకొచ్చాడు వాస్తు భూషణం. "ఈవిడ నా భార్య సుందరి," పరిచయం చేశాడు వెంకట్రావు.

"వాస్తు లాభమస్తు... అమ్మాయి ముఖంలో దివ్య తేజస్సు ఉట్టి పడుతున్నది. దివ్యమైన జాతకమే కారణం." అన్నాడు వాస్తు భూషణం.

సుందరి ముఖం లక్ష వాల్టుల బల్బులా వెలిగింది.

"నమస్కారం స్వామీ.. రండి..రండి... మీపేరు ఇంతకు ముందు చాలా సార్లు విన్నాను. దయ చేయండి" ఆహ్వానించింది సుందరి.

"వాకిట్లో అడుగు పెట్టగానే వాస్తులోపాలు స్పష్టంగా అర్థమయ్యాయి. మీ ఆర్థిక నష్టాలకు కారణాలు అవగతమయ్యాయి. ఎలుక రూపంలో వాస్తు పెద్దమ్మ మీ ఇంట్లో అడుగు పెట్టింది. అమ్మా... కాసిని మంచి తీర్థం పట్రా తల్లీ.." అన్నాడు వాస్తుభూషణం.

"అలాగే కాఫీ కూడా తెస్తాను స్వామీ.."

"కాఫీ అలవాటు లేదమ్మా.... హార్లిక్సు పట్టుకురా."

"అలాగే స్వామీ."

లోపలి కెళ్ళి ఒక ట్రేలో మంచి నీళ్ళు గ్లాసుతో వచ్చింది సుందరి.

"తీసుకోండి స్వామీ."

పక్కనే పిడుగు పడ్డట్లు ఉలిక్కి పడ్డాడు వాస్తుభూషణం.

"ఏమైంది స్వామీ... ఇవి మంచినీళ్ళే." చెప్పింది సుందరి.




"అన్నన్నన్న... ఎంత పొరపాటు పని తల్లీ...! గ్లాసును ట్రేకి ఈశాన్యం మూల ఉంచావే! ఈశాన్యం బరువెక్కువై నైరుతి తేలికై పోలేదా! ఈజిప్టులో నేనేమన్నాను?"

"తమరు ఈజిప్టు వెళ్ళారా? తెలియదు స్వామీ."

"హయ్యో..

**ట్రేలో ఈశాన్యముంచిన గ్లాసు**
**కొంపలు ముంచును బాసూ**

అన్నాను. అలా పెట్టకూడదమ్మా చ్చొ చ్చో.. చ్చొ.. చ్చొ.." పెదవుల మీద చూపుడు వేలుంచి శబ్దం చేస్తూ అన్నాడు వాస్తుభూషణం.

"ఏమిటి స్వామీ విడ్డూరం! ట్రేలో పెట్టే గ్లాసుకు కూడా వాస్తుంటుందా!" ఆశ్చర్యంగా అన్నాడు వెంకట్రావు.

నవ్వాడు వాస్తుభూషణం.

"వాస్తుకు ట్రే అని, ప్లేట్ అని తేడా లేదండీ, వాస్తు వాస్తే. భోజనం చేసేటపుడైనా సరే అన్నాన్ని నైరుతి మూల, భగభగ మండే పచ్చళ్ళను ఆగ్నేయ మూల, కాస్త కారంగా, కాస్త చప్పగా ఉండే కూరలను వాయువ్య మూల, అభికరించే పులుసు, పాయసం, నెయ్యి ఈశాన్యం మూల వడ్డించాలి. పప్పును దక్షిణం వైపు, పులిహోరను పడమర వైపు, ఉప్పును ఉత్తరం వైపు, అప్పడాలను తూర్పు వైపు వడ్డించాలి. మంచి నీళ్ళ చెంబును దక్షిణం వైపు వడ్డించాలి. చెంబు పొరపాటున దొర్లితే తూర్పు నుంచి నీరు ఉత్తరం పారాలి.

**ఖాళీగా ఉన్న కంచం**
**త్వరిత జీర్ణానికి ఇచ్చే లంచం**
**నైరుతి ఖాళీగా ఉన్న కంచం**
**రోగాలకు వేసే పట్టెమంచం**

అని వినలేదా?"

క్షమించండి ఈ కవితను మేమెన్నడూ వినలేదు." అన్నారు దంపతులిద్దరూ కోరస్‌గా.

"హయ్యో.. ఇది కవిత కాదమ్మా... ఉగాండాలో నా ఉవాచ ఇది. నా అనుభవంతో ఇలాంటివి ఇరవై వేల సూక్తులను తయారు చేశాను. పదండి ఇల్లు చూద్దాం." లేచాడు వాస్తుభూషణం.

ముఖం గంభీరంగా పెట్టి తలను పైకి, కిందికి దించుతూ మూలలకు తిప్పుతూ పెదవులు విరుస్తూ, ప్చ్.. ప్చ్.. సొండ్లు చేస్తూ చేతులు వెనక్కు కట్టుకుని కళ్ళు విశాలం చేస్తూ, గట్టిగా మూస్తూ వివిధ భంగిమలు ప్రదర్శిస్తూ తిరుగుతున్నాడు.

దంపతులిద్దరూ ఎంతో టెన్షన్‌తో అతని అడుగులో అడుగు వేస్తూ ఆగితే ఆగుతూ, వాస్తుభూషణం ఎటువైపు చూస్తే అటువైపు చూస్తూ నడవసాగారు.

వంటింట్లోకి నడిచాడు వాస్తుభూషణం.

"అయ్యయ్యో... ఇదేమిటి ఈప్లాట్ ఫామ్ ఇంతెత్తును కట్టారు? శాస్త్ర ప్రకారం ప్లాట్ ఫామ్ ఎత్తు రెండడుగుల నాలుగంగుళాలకు మించరాదు. కానీ ఇది రెండడుగుల నాలుగున్న రంగుళాలుంది.

**ఎత్తైన వంటగట్టు**
**పాకములను చెడగొట్టు**

అని పాకిస్తాన్‌లో నొక్కి చెప్పాను" అన్నాడు.

"ఓహో... అందుకే కాబోలు ఈమధ్య నువ్వు ఏం వండినా కుదరడం లేదు సుందూ.." అన్నాడు వెంకట్రావు.

సుందరి గుర్రుగా చూసింది.

-(ఇంకావుంది)

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తెలుగు | తమిళం |
|---|---|---|
| రచన | : ఆరుద్ర | కణ్ణదాసన్ |
| సంగీతం | : మాస్టర్ వేణు | విశ్వనాథన్ -రామమూర్తి |
| గానం | : ఎల్.ఆర్.ఈశ్వరి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| నటన | : చలం,గిరిజ | నాగేష్, సచ్చు |

'కాదలిక్క నేరమిల్లై' (ప్రేమించడానికి తీరికలేదు) తమిళ చిత్రం గురించి, ఆ చిత్రం ఆధారంగా తెలుగులో నిర్మించిన 'ప్రేమించిచూడు' చిత్రం కోసం ముళ్ళపూడి వెంకటరమణ రాసిన 'మేడమీద మేడకట్టి' పాట గురించి ఇదివరలో ప్రస్తావించుకున్నాము.

'కాదలిక్క నేరమిల్లై' చిత్రం హాస్యప్రధానమైనదే అయినా - అందులో కథానాయికల అన్నయ్య వేషం వేసిన నాగేష్‌కు సంబంధించి విడిగా కొన్ని సన్నివేశాలున్నాయి. సినిమాలు నిర్మించాలనే పిచ్చి ఉన్న ఆ పాత్రనూ తను నిర్మించనున్న చిత్రం గురించి తండ్రికి వివరించే దృశ్యాన్నీ నేటికీ చాలామంది గుర్తు చేసుకుంటూ ఉంటారు. ఈ సినిమాల పిచ్చి ఉన్న ఆ అన్నయ్య తమ దగ్గర పనిచేస్తున్న పెద్ద మనిషి కూతురితో ప్రేమలో పడతాడు.

తమిళ చిత్రంలో నాగేష్‌కు జంటగా నటించినవారు 'సచ్చు' (సరస్వతి). ఆమె 'మాయాబజార్' చిత్రంలో చిన్నారి శశిరేఖ వేషం వేశారు.

సచ్చు పాత్ర కోసం కణ్ణదాసన్ రాసిన తమాషా పాటను ఇక్కడ పరిశీలిద్దాం. విశ్వనాథన్ - రామమూర్తి సంగీతం సమకూర్చిన ఈ పాటను ఎల్.ఆర్.ఈశ్వరి పాడారు. ('యోడలింగ్' అనే మాట 'జోడెల్' అనే మాటనుంచి పుట్టింది. స్విట్జర్‌లాండ్, ఆస్ట్రియా ప్రాంతాల వారు ఈ రకం సంగీతంలో నిష్ణాతులు). మన గాయకులలో కిషోర్‌కుమార్, పి.బి.శ్రీనివాస్, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం 'యోడలింగ్' పాడడంలో ప్రత్యేకత సాధించినవారు. 'కాదలిక్క నేరమిల్లై'లోని 'మలరెన్‌ఱ ముగమిన్‌ఱు' పాటలోనూ 'ప్రేమించిచూడు'లోని 'తళతళలాడే కన్నులు' పాటలోనూ 'యోడలింగ్' వినిపించినవారు ఎం.ఎస్.రాజు. (ఎం.సుబ్రహ్మణ్యరాజు).

అప్పట్లో ఆయన విశ్వనాథన్ - రామమూర్తి వాద్య బృందంలో ఉండేవారు. ఆయన 'దొంగల్లోదొర', 'సిపాయికూతురు' వంటి చిత్రాలకు సంగీత దర్శకత్వమూ వహించారు.

'కాదలిక్క నేరమిల్లై' చిత్రం కోసం కణ్ణదాసన్ రాసిన పాట ఇది:

మలరెన్‌ఱ ముగమిన్‌ఱు శిరిక్కట్టుమ్
మనమెన్ణ కరువణ్డు పఱక్కట్టుమ్
ఉఱవుక్కుమ్ నిలవుక్కుమ్ తుదిక్కట్టుమ్
ఉలగత్తై ఒరుముత్తై మఱక్కట్టుమ్ ॥మలర్॥

ఆడిడుమ్ చిన్న ఉడల్
పాడిడుమ్ వణ్ణ ఇదళ్
అన్జిడుమ్ వన్జి ఇదై
కెన్జిడుమ్ పిన్జనదై

అల్లిత్తణ్డు వెళ్ళిత్తణ్డై
ముత్తుచ్ చెణ్డుక్ కన్నంగళ్
మిన్నల్ ఎన్ఱు మిన్నక్కణ్డు
తుళ్ళిచ్ చెల్లుమ్ ఎణ్ణంగళ్ ॥మలర్॥

పొన్మగళ్ కాదల్ అన్నమ్
పూమగళ్ కణ్గళ్ మిన్నుమ్
నెన్జమే తుళ్లుమ్ వణ్ణమ్
కొన్జువాళ్ తుంగక్ కిణ్ణమ్

ఎళ్ళుప్ పూవుమ్ ముళ్లైప్ పూవుమ్
శేర్న్దు వన్ద కన్నిప్పూ
కొళ్ళై కొళ్ళ ఇంగు వన్దాళ్
కోలమ్ కొళ్ళుమ్ తాళమ్ పూ ॥మలర్॥



తమిళగీతంలో హాస్యనాయిక ఏమంటున్నది?

పువ్వు అనే ముఖం ఈ రోజు నవ్వనీ
మనసనే తుమ్మెద ఎగరనీ
చెలిమి కోసమూ జాబిలి కోసమూ తహతహలాడనీ
ప్రపంచాన్ని ఒకసారి మరచిపోనీ ॥పువ్వు॥
కదలాడే చిన్నిమేను
పాడే రంగుల పెదవులు
బెదిరే మగువ నడుము
బతిమాలే చిట్టి అడుగులు
తామరతూడుల (వంటి కాలి) వెండి గొలుసులు
ముత్యాల చెండు వంటి చెంపలు
మెరపు అనేలా మెరుస్తూ ఉంటే
ఎగసిపోయే ఆలోచనలు ॥పువ్వు॥
బంగారు (వంటి) చిన్నది ప్రేమహంస
పూబాల కనులు మెరిసేను
మనసే తుళ్లిపడేలా
మురిపించే బంగరు పళ్లెం
నువ్వు పువ్వూ జాజిపువ్వూ
కలగలసి వచ్చిన కన్నెపువ్వు
కొల్లగొట్టడానికి ఇక్కడికి వచ్చింది
మెరవనున్న మొగలిపువ్వు ॥పువ్వు॥

'ప్రేమించి చూడు' చిత్రంలో ఇదే సన్నివేశం కోసం రూపొందించిన పాటనూ ఎల్.ఆర్.ఈశ్వరి పాడారు. తమిళ చిత్రంలోని బాణీనే తెలుగు పాటకూ వాడుకొన్నారు. తెలుగు చిత్రానికి సంగీత దర్శకులు మాస్టర్ వేణు. తమిళంలో నాగేష్ ధరించిన పాత్రను తెలుగులో చలం ధరించారు. హాస్య నాయిక పాత్రను గిరిజ ధరించారు. తెలుగు పాట రాసిన వారు ఆరుద్ర.

'ప్రేమించిచూడు' తెలుగు చిత్రంలోని ఆ పాట:

కళకళలాడే కన్నులు - తహతహలాడే వూహలు
ఘుమ ఘుమలాడే గుండెలు - కులుకుచు వేసెను చిందులు ॥కళ॥
యాడిలీ.... యాడిలీ
పెదవులే దొండ పండట
హృదయమే పూల చెండట
పలుకులే పనస తొనలట -
తలపులే వలపుగనులట
మేను నీకై పూలతోటై
మినిటు యుగమై వేచెను
కనులు వేయి ఎదురుచూసి
కాయకాచి పండెను ॥కళ॥
యాడిలీ... యాడిలీ
దొంగవై దారి కాయకోయ్
దురుసుగా కళ్లు మూయకోయ్
చిలిపిగా చిటికె వేయకోయ్
చెక్కిలి నొక్కి చిదమకోయ్
కొంటెపనులు చేయకుంటే -
కొసరి నిన్నే చేరెనా
జంటకోరి వెంటనుంటే
కంటిపాపై నవ్వెనా ॥కళ॥



మూల తమిళగీతం స్వర విన్యాసాన్ని అనుసరించిన 'ప్రేమించిచూడు'లోని 'కళకళలాడే కన్నులు' పాట మూల గీతంలో లేని సొగసులతో కళకళలాడుతూ వినిపిస్తుంది.

తమిళగీతంలోని నాయికలాగా తెలుగు పాటలోని నాయిక కూడా తన కళల గురించే వివరిస్తున్నది. తమిళ నాయిక తన ముఖం పువ్వు వంటిదని మొదలు పెట్టి తాను నవ్వు పువ్వూ జాజిపువ్వూ కలగలిసిన కన్నెపువ్వనీ తాను మెరవబోయే మొగలిపువ్వనీ అంటే తెలుగు నాయిక తాను 'పూలతోట' అంటుంది.

తమిళ గీతానికీ తెలుగు గీతానికీ కూడా అంత్యప్రాసలు అలంకారాలు. అంత్యప్రాసలలో తమదైన ముద్రవేసిన ఆరుద్ర రాయడం వల్ల తెలుగు పాటలోని అంత్యప్రాసలు అధిక చక్కగా ఉన్నాయి.

మాటలను ముందు వెనకలు చేసి చమత్కారాలు పండించడంలో ఆరుద్రది ప్రత్యేకమైన పద్ధతి. 'వేయి కళ్లతో ఎదురుచూడడం' అనే అభిప్రాయాన్ని 'కనులు వేయి ఎదురుచూచి' అని రాసి అలా ఎదురుచూడగా కాయకాచిన కనులు పండాయనడం ఆరుద్ర ప్రత్యేకత. 'మినిటు యుగమై వేచేను' అనే మణప్రవాళ పద్ధతి కూడా ఆరుద్ర ముద్రే. తమిళ నాయికలో కన్నా తెలుగు నాయికలో గడుసుతనం పాలెక్కువే అనిపించడానికి జంటకోరి వెంటనుండమనడం వంటి అభిప్రాయాలు కారణాలు. హాస్యగీతం కనుక - తమిళంలో నువ్వు పువ్వునూ మొగలిపువ్వునూ స్మరించారు. తెలుగులో 'ఘుమఘుమలాడే గుండెలు' అనే పంక్తి కూడా హాస్యం కోసం రాసిందే అనుకోవాలి.

కణ్ణదాసన్ పాటతో పోలిస్తే ఆరుద్ర పాటలో నిండుతనమూ కొంటెతనమూ మెండుగా కనిపిస్తున్నాయి. కనుకనే ఆరుద్ర రాసిన హాస్యగీతాలలో ఈ పాట స్థానమూ ప్రత్యేకమైంది!

- పి.ఎస్.గోపాలకృష్ణ



# కాన్సెప్ట్ స్కూల్ తోనే కాలానుగుణమైన విద్య

కాలప్రభంజనాన్ని ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొని, సమాజంలో తమకంటూ ఒక సమున్నత స్థానాన్ని సముపార్జించుకునేందుకు అవసరమైన దృఢసంకల్పం, దీక్ష, దక్షతలను విద్యార్థులు పెంపొందించుకునేందుకు ఆవిర్భవించింది... **వికాస్ ది కాన్సెప్ట్ స్కూల్**

ప్రముఖ విద్యావేత్త, గుంటూరు వికాస్ విద్యాసంస్థల డైరెక్టర్ **శ్రీ ఎస్. కోటేశ్వరరావు** గారి సుదీర్ఘ అనుభవం, సమయోచిత దృక్పథం నుండి ఆవిష్కృతమైన ఈ సృజనాత్మక విద్యాసరళి, విద్యాబోధనలో ఒక సంచలనాత్మక ఒరవడిని సృష్టించింది. విద్యకు మించి మీ చిన్నారులకు మీరిచ్చే అమూల్య సంపద మరొకటిలేదు. ఆ సంపదను సమకూర్చేందుకు సరైన సాధనం - **వికాస్ ది కాన్సెప్ట్ స్కూల్**

**అడ్మిషన్ టెస్ట్ :** ప్రతి ఆదివారం స్కూలు ఆవరణలో ఉదయం 9 గం॥నుండి 12 గం॥ వరకు, సాయంత్రం 2 గం॥నుండి 5 గం॥ వరకు జరుగును

- ఎల్.కె.జి. నుండి 10 వ తరగతి వరకు
- కో-ఎడ్యుకేషన్ డే కమ్-రెసిడెన్షియల్
- డేస్కాలర్లకు బస్ సౌకర్యం
- స్టేట్ మరియు సిబిఎస్ఇ సిలబస్‌లు
- ఇంగ్లీషు మీడియం
- క్లాసురూమ్‌లో సరైన నిష్పత్తి 1:15. (ఒక క్లాస్‌కు 30 మంది విద్యార్థులు)
- చదువులో వెనుకబడిన వారికి ప్రత్యేక తరగతులు, తల్లిదండ్రులతో సంప్రదింపులు
- క్లాసురూమ్స్‌లో ఇంటర్నెట్ సౌకర్యం
- ఫిజికల్ సైన్సెస్‌కు, లైఫ్ సైన్సెస్‌కు వేర్వేరు లాబ్స్
- టెక్నాలజీ, ఇన్ఫోటెక్, ఆడియో విజువల్, వొకేషనల్ కోర్సుల లాబ్స్
- సమగ్రమైన గ్రంథాలయం, స్పోకెన్ ఇంగ్లీషుకై లాంగ్వేజ్ లాబ్
- 7,10 తరగతుల వారికి అదనపు క్లాసులు
- మ్యూజిక్, డాన్సు, ఏరోబిక్స్, యోగా, జిమ్నాస్టిక్స్‌కై ఆడిటోరియం, యాక్టివిటీస్‌కై క్లబ్స్
- సృజనాత్మకత పెంచే ఆర్ట్స్, క్రాఫ్ట్స్ రూమ్స్
- ఫుట్‌బాల్, క్రికెట్, వాలీబాల్, కరాటే ఇతర ఆటలకై ఆటస్థలం. చిన్న పిల్లలకు ప్రత్యేకమైన ఆటస్థలం





**S. Koteswara Rao,** M.Sc.,
Director, Guntur Vikas Educational Institutions
Chairman, VIKAS-the Concept School

# VIKAS
The Concept School

Bachupally, Off Miyapur, Kukatpally, Hyderabad 500072. Ph : 23046464, 23042966, 37886788, 37188966
Website : www.vikasconcept.com e-mail : info@vikasconcept.com

**రచన: భువనచంద్ర (1) గానం : ఎస్.పి.బాలు,శ్రేయా ఘోషల్**

అ: జన్మ జన్మల వరమీ కలయిక
పైట కొంగుని వదలను నేనిక
పాలబుగ్గల అల్లరి పిల్లతో
శోభనం... భలే వేడుక...
ఆ: ముందరున్నది ముద్దుల పండగ
తరుముతున్నది కమ్మని కోరిక
కోరుకున్నది ఇస్తా రా ఇక...
నాయకా...ఒడే వేదిక...
అ: ఓ మై డార్లింగ్ మొనాలిసా
ఎక్కిందె ఏదో నిషా...
ఆ: మెచ్చేసానోయ్ మనోహరా...
నచ్చింది నీ తొందర... ॥జన్మజన్మల॥
ఆ: మొదటి చూపుతో మురిపించి
మెల్ల మెల్లగా తెర దించి...
మాయమవ్వకే నను కవ్వించీ...
ఆ: మెత్త మెత్తగా.... ముద్దిచ్చి
మత్తు మత్తుగా నను గిచ్చి
మంట రేపకోయ్ మైమరపించీ
ఆ: హఠాత్తుగా వరాలవాన
వర్షించెనా ఎడారిలోన
శృతించనా సుఖాల వీణా... ఓ ప్రియతమా...
ఆ: నన్నడగాలా నరోత్తమా...
నా సొగసు నీదే సుమా... ॥ముందరున్నదీ॥
ఆ: ఎంత వింతదీ గిలిగింత
అణువు అణువునా పులకింత
తనివి తీర్చవా ఎంతో కొంత
అ: తేనె పెదవిలో తొణికింత
తీగ నడుములో ఒణికింత
తడిమి చూడనా నీ తనువంతా...
ఆ: అదేకదా వివాహ బంధం
అనుక్షణం అదో సుగంధం
అందించనా ప్రియా యుగాంతం ప్రేమామృతం...
అ: ఓ మై డార్లింగ్ మొనాలిసా
అయ్యానే నీ బానిస...స...స...స... ॥జన్మజన్మల॥

**రచన: సిరివెన్నెల (2) గానం : కుమార్‌సాను ,సునీత**

నీ నవ్వులే వెన్నెలని, మల్లెలని, హరివిల్లులనీ...
ఎవరేవేవో అంటే అననీ ఏం చెప్పను ఏవీ చాలవని..॥నీ నవ్వులే॥
చ॥ బంగారం వెలిసిపోదా నీ సొగసుని చూసి
మందారం మురిసిపోదా నీ సిగలో పూసి
వేవేల పువ్వులను పోగేసి,
నిలువెత్తు పాలబొమ్మని చేసి
అణువణువు వెండి వెన్నెల పూసి,
విరితేనెతోనే ప్రాణంపోసి...
ఆ బ్రహ్మ నిన్ను మళ్ళీ మళ్ళీ చూసి
తన్ను తానే మెచ్చుకోడా ముచ్చటేసి
..........................................
(ఇక్కడ నీ నవ్వులే వెన్నెలని, మల్లెలని, హరివిల్లులనీ
అనే వాక్యాల ట్యూన్ వాద్య సంగీతంగా వస్తుంది)
ఎవరేవేవో అంటే అననీ
ఏం చెప్పను ఏవీ చాలవని
చ॥ పగలంతా వెంటపడినా చూడవు నావైపు
రాత్రంతా కొంటె కలవై వదలవు కాస్సేపు
ప్రతిచోట నువ్వె ఎదురొస్తావు...
ఎటు వెళ్ళలేని వల వేస్తావు
చిరునవ్వుతోనె ఉరివేస్తావు...
నన్నెందుకింత ఊరిస్తావు
ఒప్పుకోవేం నువ్వు చేసిందంతా చేసి
తప్పు నాదంటావా నానానిందలేసి... ॥నీ నవ్వులే॥



**రచన: సిరివెన్నెల (3) గానం : కార్తిక్, కోరస్**

నువ్వెంత అందగత్తెవైనగాని అంత బిరుసా..
తెగ వెంటబడుతున్ననంటె నీకు ఇంత అలుసా
నేనంత కానివాణ్ణి కాదుగద కన్నెవయసా...
నీ కంటికి నేనొక చిన్న నలుసా
నిన్నే...నిన్నే... నేను కోరుకున్నది నిన్నే...
నన్నే...నన్నే... ఒప్పుకోక తప్పదింక నన్నే... ॥నువ్వెంత॥
చ : ఔను అంటె నిను చూసుకోనా మహరాణి తీరుగా
కాదు అంటె వదిలేసి పోను అది అంత తేలికా
లేనిపోని నఖరాలు చేస్తే మరియాద కాదుగా
ఇంతమంచి అవకాశమేది ప్రతిసారి రాదుగా
తగని వాడినా చెలీ తగువు దేనికే మరీ
మనకు ఎందుకే ఇలా... అల్లరీ.. ॥నువ్వెంత॥
చ : కన్నెగానె ఉంటావా చెప్పు ఏ చెంత చేరక...
నన్ను మించి ఘనుడైనవాణ్ణి చూపించలేవుగా
మీసమున్న మగవాణ్ణి గనక అడిగాను సూటిగా
సిగ్గు అడ్డు పడుతుంటె చిన్న సైగైన చాలుగా
మనకి రాసి ఉన్నది... తెలుసుకోవె అన్నది
బదులు కోరుతున్నది... నామది... ॥నువ్వెంత॥

రచన: సిరివెన్నెల (4) గానం : శంకర్ మహదేవన్, చిత్ర

అ: చెలి సోకు లేత చిగురాకు,
పలుకేమో కాస్త కరుకు
ఆ: కవి కాళిదాసుననుకోకు
వలవేసి వెంటపడకు
అ: ఎన్నాళ్లె నీకూ నాకూ తగువులు
ఆ: నీ వల్లే కాదా నాకీ చిక్కులు
అ: కోపంలో కూడా ఎంత నాజూకు... ఆ: ॥కవి॥
అ: అన్నానంటే అన్నానంటావ్...
అంతేగాని ఆలోచించవ్
నేనేకాదా నీకుండే దిక్కు..!
ఆ: నా కోసం నువు పుట్టానంటావ్...
నేనంటే పడి ఛస్తానంటావ్..
నీకెంతంట నాపై హక్కు
అ: ఇమ్మంటే ప్రాణం ఇస్తా నమ్మవెందుకు...?
పొమ్మంటూ దూరం చేస్తావెందుకూ...?
ఆ: చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెప్పకు...
నన్నిట్లా నానాహింస పెట్టి చంపకు... అ: ॥చెలి॥
అ: దగ్గరకొస్తే భగ్గంటున్నావ్...
పక్కకుపోతే భయపడుతున్నావ్
ఇట్టాగైతే ఎట్టాగేమరి...
ఆ: ఆవైపంటే ఈవైపంటావ్...
నే లెఫ్ట్ అంటే నువు రైట్ అంటావ్...
నీతో అన్నీ పేచీలే మరి
అ: ఆ పాదం కందేలాగా పరుగులెందుకే...
నీ భారం నాకే ఇవ్వకా...
ఆ: మాటల్తో మంత్రం వేస్తూ తియ్యగా...
మైకంలో ముంచేస్తావు మెల్లమెల్లగా అ: ॥చెలి॥



రచన: సిరివెన్నెల (5) గానం : శంకర్‌మహదేవన్,చిత్ర

అ: గుండెల్లో గులాబీల ముళ్ళు....
నాటిందే నిగారాల ఒళ్ళు...
నన్ను మాయజేయకే నెరజాణ..
ఆ: అయ్యయ్యో ఇలా రాకు వెళ్ళు
ఒంపుల్లో ఇరుక్కుంటే కళ్ళు...
నిన్ను లాగలేనుగా నేనైనా...
అ: తపోభంగమయ్యేలా... అలా కొంగు జారాలా...
ఆ: మరీ బెంగ పెరిగేలా... ఇలా తొంగి చూడాలా...
అ: అతి చిలిపిగ మదనుడు వదిలిన శరమీ సొగసరి...
మతి చెదరద ఎదురుగ కనబడితే మల్లీశ్వరీ... ఆ: ॥అయ్యయ్యో॥
అ: అగ్గిలాంటి నీ అందాలు....
రగిలించగానే ఈ చన్నీళ్ళు...
ఆవిరావిరై పోతాయే సౌందర్యమా
ఆ: సిగ్గుదాటి నీ ఆత్రాలు...
సొగసల్లుతుంటే సుకుమారాలు..
అల్లరల్లరైపోతాయే శృంగారమా...
అ: నిందించి తప్పించుకోకమ్మా...
కనువిందిచ్చి కవ్వించుకోకమ్మా
ఆ: నువ్వంత తెగించి రాకమ్మా... పోమ్మా...
అ: అతి చిలిపిగ మదనుడు వదిలిన శరమీ సొగసరి...
మతి చెదరద ఎదురుగ కనబడితే మల్లీశ్వరీ... ఆ: ॥అయ్యయ్యో॥
ఆ: కాగడాలు అనిపించేలా
నీ ఆగడాలు వెలిగించాలా
ఎక్కడెక్కడేం వున్నాయో గాలించగా
అ: స్వాగతాలు వినిపించేలా..
నీ సోయగాలు శృతిమించాలా..
హెచ్చుతగ్గు లెన్నున్నాయో వివరించగా
ఆ: చురుక్కు చురుక్కు మనేలా...
నను కొరుక్కు కొరుక్కు తినాలా...
అ: వయస్సు సమస్య తీరేలా రామ్మా...
అ: అతి చిలిపిగ మదనుడు వదిలిన శరమీ సొగసరి...
మతి చెదరద ఎదురుగ కనబడితే మల్లీశ్వరీ... ఆ: ॥అయ్యయ్యో॥

రచన: సిరివెన్నెల (6) గానం : ఎస్.పి.బాలు

నువు ఎవ్వరి ఎదలో పువ్వుల ఋతువై ఎప్పుడు వస్తావో
నిను నమ్మిన జతలో నవ్వులు చిదిమి ఎందుకు పోతావో
తెలియదే ఎవ్వరికీ...తేలదే ఎన్నటికీ...
అందుకే నీ కథకీ.. అంతులేదెప్పటికీ...
తీరాలులేవే ప్రేమా... నీ దారికి
చ॥ కలతలే కోవెలై కొలువయే విలయమా...
వలపులో నరకమే వరమనే విరహమా...
తాపమే దీపమా... వేదనే వేదమా...
శాపమే దీవెనా... నీకిదే న్యాయమా..
కన్నీరు అభిషేకమా నిరాశ నైవేద్యమా
మదిలో మంటలే యాగమా ....
ప్రణయమా...!!! ॥నువ్వు ఎదలో॥
చ॥ రెప్పలే దాటదే ఎప్పుడూ ఏకల...
నింగినే తాకదే కడలిలో ఏ అల..
నేలపై నిలవదే మెఋపులో మిలమిల
కాంతిలా కనబడే...భ్రాంతి ఈ వెన్నెల...
అరణ్యాల మార్గమా.. అసత్యాల గమ్యమా...
నీతో పయనమే పాపమా
ప్రణయమా.. ॥నువ్వు ఎదలో॥

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



## తారాగణం

విక్టరీ వెంకటేష్, కత్రినా కైఫ్, గజాలా, స్మిత, బాలయ్య, కోటశ్రీనివాసరావు, బ్రహ్మానందం, తనికెళ్ళ భరణి, నరేష్, ఆహుతి ప్రసాద్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, మల్లిఖార్జునరావు, చలపతిరావు, సునీల్, సి.వి.ఎల్.నర్సింహరావు, దేవదాస్ కనకాల, చిత్రం శ్రీను, బెనర్జీ, గణేష్, ప్రభు, రఘునాథరెడ్డి, గౌతమ్‌రాజు, చిట్టిబాబు, పూసల, లక్ష్మీపతి, సుదర్శన్, రాజ్యలక్ష్మి, రజిత, సన, పద్మ జయంత్, ప్రియాంక, హేమ, బేబీ గ్రీష్మ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ, మాటలు | : త్రివిక్రమ్ |
| పాటలు | : సిరివెన్నెల సీతారామశాస్త్రి, భువనచంద్ర |
| కొరియోగ్రఫీ | : రాజు సుందరం, రాజశేఖర్ కృష్ణారెడ్డి |
| కో-డైరెక్టర్ | : జి.సుధాకర్ |
| ఎడిటింగ్ | : శ్రీకర్ ప్రసాద్ |
| స్టంట్స్ | : 'స్టన్' శివ |
| సినిమాటోగ్రఫీ | : సమీర్ రెడ్డి |
| సంగీతం | : కోటి |
| నిర్మాత | : డి.సురేష్ |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : విజయభాస్కర్.కె |


డి.రామానాయుడు


డి.సురేష్


కె.విజయభాస్కర్


సిరివెన్నెల


భువనచంద్ర

డా॥డి.రామానాయుడు సమర్పించు
సురేష్ ప్రొడక్షన్స్

# మల్లీశ్వరి

THE PRINCESS

సురేష్ విజయభాస్కర్.కె కోటి





# కొమ్మ కొమ్మకో సన్నాయి...



## కథానాయకుడి కథ కరిగిపోని కల

(గత సంచిక తరువాయి)

రామారావుగారు ఆదర్శవిద్యార్థుల్లో అందగాడుగా, అందమైన ఆకర్షణీయమైన మందహాసంలా, మధుమాసం సన్న జాజుల నవ్వులతో సన్నగా పొడుగ్గా, వినయ విధేయతల తలమానికంలావున్న రోజులు 'మనదేశం' నాటివి. రాయలసీమ కరువు సహాయ ప్రదర్శనల కాలానికి కొంచెం గడిచేరిన రామారావు వ్యక్తిత్వం, మాయాబజార్ నాటికి ధీర గంభీరముద్ర దాల్చింది. అటు తర్వాత ఎక్కువగా పౌరాణిక పాత్రల ధోరణిలో అది మరింత 'ముదిరి' మేరునగ ధీరత్వానికి రూపుదిద్దింది.

ఒకసారి 'అగ్గిరాముడు' శతదినోత్సవం విజయవాడ సరస్వతీ టాకీస్‌లో జరిగినప్పుడు ఎంతో నిరాడంబరంగా జరిగిన ఆ సభకు ఎన్.టి.ఆర్. వచ్చారు. రేలంగి కూడా (హెడ్‌కానిస్టేబుల్ 441) హాజరైన ఆ సభలో రామారావు గారు ప్రసంగిస్తూ తన కాలేజీ రోజులు, విజయవాడ వీధులలో విద్యార్థిగా తిరిగిన నాటి జ్ఞాపకాలతో సహా ఆర్ద్రంగా తలుచుకుని కంట తడిపెట్టడం జరిగింది. తన గురువు విశ్వనాథ వారి వ్యక్తిత్వ వైలక్షణ్యాన్ని ఎంతో ముద్దుగా ఆయన ఆ సభలో వివరించడం జనాన్ని ఆకట్టుకుంది. తన ప్రసంగ మధ్యంలో హఠాత్తుగా ఆయన సభామధ్యంలో వున్న ఒక వృద్ధమూర్తిని చూసి వేదిక దిగి సభలోకి వచ్చి ఆయనను సాదరంగా తనతో నడిపించుకుని ముందు వరుసలో కూర్చోబెట్టి పాదాలకు నమస్కరించి తిరిగి తన ప్రసంగం కొనసాగిస్తూ తను స్కూలు విద్యార్థిగా వున్నప్పుడు తనకు ఆంధ్ర భాషాభిమానం , భాషా పరిచయం కలగజేసినది ఆ పెద్దాయనే అని వివరించారు.

గత జీవిత క్షణాలను ప్రేమతో భక్తితో స్మరించి అభిషేకించిన అరుదైన సినీ పురుషులలో రామారావుగారు ఒకరు. లీలామహల్ వద్ద తిన్న (తనకిష్టమైన) మిరపకాయబజ్జీలు కూడా ఆయన మరువలేదు,విడువలేదు. తన జీవిత కాలం పాటు పానం, ధూమపానం బహిష్కరించిన యోగి ఆయన. నటన కోసం కూడా బ.బ్రా.ర్థం గానే ఆయన ఆ విషయంలో నటించేవారు. ప్రాణాయామం, యోగాసనాల మీద అత్యంత నియమ నిష్టలు వుండేవి- 'అభ్యంగ మాచరేన్నిత్యం సజరాశ్రమవాతః,'అనే చరక సంహితలోని మహానూక్తి ఆయన పాటించారు. ఏలకులతో, అల్లంతో ఔషధప్రాయంగా తేనీరు సేవించడం ఆయన కిష్టం.



ఫోటో కర్టెసి : విజేత

ఒకసారి 'అడవిరాముడు' షూటింగ్‌లో నా చేతిలో జర్దాకిళ్లీల పొట్టం చూసి'ఏమిటది బ్రదర్' అని అడిగారు. ఉన్న విషయం చెప్పాను. 'విషంలాంటిదే! ఎందుకు వాడుతున్నారు' ఇదీ ప్రశ్న-నిరుత్తరుణ్ణి అయ్యాను. వెంటనే 'ఏదీ' అని అడిగి తీసుకుని కిళ్ళీ విప్పి చూసి, వాసన చూసి సువాసనకు కనుబొమలెగర వేసి 'ఇంకొంచెం జర్దా వేయించండి' అని అడిగి వేయించుకుని కిళ్లీగా మడిచి నోట్లో వేసుకున్నారు! అందరూ గాభరాపడి పోయారు. 'చెమటలు పట్టి,వాంతులైతే ఇంకేమన్నావుందా. అసలే అలవాటులేని మనిషాయే' అని గుసగుసలు కలకలాత్మకంగా మొదలైనాయి. పైగా 'ఆయన మింగారో ఏమో'అని కొందరు భయపడ్డారు సరిగ్గా అదేపని చేశారు రామారావు.

అప్పుడే 'షాట్' రెడీ అనిపిలుపు, నోట్లోది తాపీగా ఉమ్మి, కడుక్కుని మాములుగా షాట్‌లో అభినయం చేసి వెళ్లికూర్చున్నారు. అందరికీ అమితాశ్చర్యం వేసింది. శరీరాన్ని అంత అదుపులో వుంచుకున్న నటుడు మరొకరు లేరు. అప్పుడప్పుడు అలా అందరినీ ఆశ్చర్యపరచడం,దైహిక క్రమశిక్షణను గురించి చెప్పకుండా చెప్పడం ఆయన హోదా.

అయ్యప్ప దీక్ష నియమనిష్టలు తు.చ తప్పకుండా మండలం పాటు పాటించే వారంటే ఆయనకు చాలా గౌరవం వుండేది. ఆత్మశుద్ధికీ శరీర క్షాళనకు ఇది సినిమాజీవులకు చాలా అవసరమని నేను దీక్ష తీసుకున్నప్పుడు ఆయన అన్నారు. అయితే సామూహికంగా పాటించే ఈ దీక్షను ఆయన స్వీకరించినట్లులేదు.

జాతి సంస్కృతికి మూలాధారాలైన కళలను ఉపాసించి ఉపాధిగా చేసుకోదలచిన వారికి శ్రీనందమూరి తారకరామారావు జీవితం మార్గదర్శకమని చెప్పక తప్పదు. భాషలోను, పురాణేతిహాసాలలోను సమగ్రమైన పరిచయం, పాండిత్యాలుండాలని ఆయన జీవితం చేసే మౌనోపదేశం విన్న వాడే నిజమైన వేదాంతుడు కాగలడని నా విశ్వాసం. చరిత్ర పరిజ్ఞానం రామారావుగారి చేత ఎన్నో గొప్ప చిత్రాలు తీయించింది. ఆయనలోని వైరాగ్యసంపత్తి వీంబ్రహ్మేంద్రచరిత్ర తీయిస్తే సాహితీ పురుషాభిమానం పండిన వయః పరిపాకంలో, పదవిలో వున్నా శ్రీనాధ చిత్రాన్ని తెరకెక్కించింది.

కొందరు గొప్ప వ్యక్తులు వెళ్ళిపోతూ కొన్ని మధుర స్మృతులను ఆర్ద్ర సంఘటలను, మరపురాని క్షణాలను మిగిల్చిపోతారు.

ఒకానొక ఉగాదినాడు నంది అవార్డ్ అందుకోవడానికి వచ్చిన నన్ను దూరం నుంచే చూసి దగ్గరకు వచ్చి కరచాలనం చేస్తూ 'మీ పాటలు మానోట పలకడం లేదే! మా పాట మాదై పోయిందే' అన్న రామారావు గారిని నేను మరువలేను. మరొక్క సందర్భంలో 'తెలుగు అంతరాత్మని మేలు కొలపండి. సినిమా పాటల్లో ఇవి కూడా వచ్చేట్టు చూడండి. తెలుగు జాతి ఆత్మగౌరవాన్ని నిలబెట్టే పాటలు ఈనాడు ఎంతో అవసరం' అన్నారు.

నాకు జాతీయ పురస్కారం లభించినపుడు జరిగిన సభలో ఆరోగ్యం బాగా లేకున్నా ఆద్యంతము వుండి ఆశీర్వదించిన ఆయనను ఎలా మరిచిపోగలను!

ఆదర్శకళాకారుడు,ఆంధ్రజాతి అంతరాత్మకు సాక్షి శ్రీరామారావుగారు. ఆయనకు ఇదే నా అక్షరాంజలి.

**- వేటూరి సుందరరామమూర్తి**

ఫిబ్రవరి 28 రవీంద్రజైన్ పుట్టినరోజు సందర్భంగా....

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



## 'గోరీ తేరా గాఁవ్ బడా ప్యారా'

గోరీ తేరా గాఁవ్ బడా ప్యారా
మైఁతో గయా మారా ఆకే యహాఁరే
ఉస్ పర్ రూప్ తెరా సాదా
చంద్రమా జ్యూఁ ఆధా, ఆధా జవాఁరే ॥గోరీ తేరా॥
జీ కర్‌తా హై మోర్ కే పాఁవ్ మేఁ పాయలియా పెహనాదూఁ
కుహు కుహు గాతీ కోయలియా కో పూలోం కా గెహనాదూఁ
యహీఁ ఘర్ అప్‌నా బనానే కో
పంఛీ కరే దేఖో తిన్‌కే జమారే, తిన్‌కే జమారే ॥గోరీ తేరా॥
రంగ్ బిరంగే పూల్ ఖిలే హైఁ, లోగ్ భీ పూలోం జైసే
ఆ జాయే ఎక్ బార్ యహాఁజో జాయేగా ఫిర్ కైసే
ఝుర్ ఝుర్ ఝుర్‌తే హువే ఝుర్‌నే
మన్‌కో లగే హర్‌నే, ఐసా కహాఁరే, ఐసా కహాఁరే ॥గోరీ తేరా॥
పర్‌దేసీ అన్‌జాన్ కో ఐసే కోయీ నహీఁ అప్‌నాతా
తుమ్ లోగోం సే జుడ్ గయా జైసే జనమ్ జనమ్ కా నాతా
అప్‌నీ ధున్ మేఁ మగన్ డోలే, లోగ్ యహాఁ
బోలే దిల్ కీ జబాఁరే, దిల్ కీ జబాఁరే ॥గోరీ తేరా॥

## 'జబ్ దీప్ జలే ఆనా'

అ: జబ్ దీప్ జలే ఆనా, జబ్ షామ్ ఢలే ఆనా (2)
సంకేత్ మిలన్ కా భూల్ న జానా,
మేరా ప్యార్ న బిస్‌రానా ॥జబ్ దీప్॥
అ: మైఁ పల్‌కన్ డగర్ బుహారూంగా
తేరీ రాహ్ నిహారూంగా ॥మైఁ పల్‌కన్॥
మేరీ ప్రీత్ కా కాజల్ తుమ్
అప్‌నే నైనోం మేఁ మలే ఆనా ॥జబ్ దీప్॥
అ: జహాఁ పెహలీ బార్ మిలే థే హమ్
జిస్ జగహ్ సే సంగ్ చలే థే హమ్ ॥జహాఁ పెహలీ బార్॥
నదియా కే కినారే ఆజ్ ఉసీ
అమ్‌వా కే తలే ఆనా ॥జబ్ దీప్॥
అ: ని రి గ రి గ మ గ రి స స ని
ప ప మ రి గ స ని ద గ ప మ ప
అ: నిత్ సాంఝ్ సవేరే మిల్‌తే హైఁ
అ: నిత్ సాంఝ్ సవేరే మిల్‌తే హైఁ
ఉన్హే దేఖ్‌కే తారే ఖిల్‌తే హైఁ ॥నిత్ సాంఝ్॥
లేతే హైఁ విదా ఎక్ దూజే సే,
కెహతే హైఁ చలే ఆనా ॥జబ్ దీప్॥



చిత్రం
**చిత్ చోర్**
రచన
**రవీంద్ర జైన్**
సంగీతం
**రవీంద్ర జైన్**
గానం
**కె.జె.ఏసుదాస్**
అభినయం
**అమోల్ పాలేకర్, జరీనా వాహబ్, మాస్టర్ రాజు**



మనలో చాలామంది చాలాసార్లు 'నాదగ్గర అది ఉంటే ఇంకా సుఖంగా ఉండేది, నా దగ్గర ఇది ఉంటే ఇంకా ఎంతో సాధిస్తాను' అనుకుంటూ నిరాశ చెందుతూ ఉంటారు. కానీ సాధారణంగా ఉండే అవయవాలు లేని కొందరు ఆ అవయవలోపాలను అధిగమించి ఉన్నత శిఖరాలను చేరుకోవటం చూస్తే ఆత్మ విశ్వాసం విలువ తెలుస్తుంది. అన్ని రంగాల లోనూ ఇలాంటి మహనీయులు ఉంటారు. సంగీత రంగంలో రవీంద్రజైన్ ఈ కోవకు చెందినవారు. జన్మతః అంధుడైనా సంగీత దర్శకుడిగా, గీత రచయితగా ఆయన ఎన్నో విజయాలు సాధించారు.

సంగీతం, సాహిత్యం రెంటిలో కృషి చేసినవారు సినీరంగంలో అరుదుగా ఉంటారు. పైగా స్వయంగా చదవలేని రవీంద్రజైన్ తన సోదరుడు చదవగా ప్రముఖుల సాహిత్యం వింటూ హిందీ భాషను ఆకళింపు చేసుకుని పాటలు రాయగలిగారంటే ఆయన సహజకవి అనే చెప్పాలి. తనకున్న వైకల్యం వల్ల పూర్తి శాస్త్రీయంగా సంగీతం అభ్యసించటం కుదరక ఆయన లలిత సంగీతం పైనే దృష్టి పెట్టారు. 'లోరీ' చిత్రం తో చిత్రరంగంలో అడుగుపెట్టారు. రాజశ్రీ ప్రొడక్షన్స్ వారి 'సౌదాగర్' చిత్రానికి ఆయన చేసిన పాటలు హిట్టయ్యాయి. అందులో ముఖ్యంగా చెప్పుకోవలసిన పాట 'సజ్‌నా హై ముఝే సజ్‌నాకే లియే'. రవీంద్రజైన్ సంగీతం అందించిన ఎన్.ఎన్.సిప్పీ చిత్రం 'చోర్ మచాయే షోర్' సూపర్‌హిట్ అయింది. అందులో 'లేజాయేంగే లేజాయేంగే ', 'ఘుంఘ్రూ కీ తరహ్' పాటలు అమిత ప్రజాదరణ పొందాయి. ఆ తర్వాత 'గీత్ గాతా చల్', 'తపస్యా', 'అఖియోం కే ఝురోకోంసే', 'దుల్హన్ వహీజో పియా మన్ భాయే', 'చిత్‌చోర్', 'పతి పత్నీ ఔర్ వో', 'ఇన్సాఫ్ కా తరాజూ', 'ఫకీరా', 'నదియాకే పార్', 'రామ్ తేరీ గంగా మైలీ', 'హెన్నా' చిత్రాలకు పనిచేసి అందరి మన్ననలు పొందారు. 'రామ్ తేరీ గంగా మైలీ' చిత్రానికి ఆయనకు ఫిలింఫేర్ అవార్డు వచ్చింది. తెలుగులో ఎన్.టి.రామారావుగారు రూపొందించిన 'బ్రహ్మర్షి విశ్వామిత్ర' చిత్రానికి రవీంద్రజైన్ సంగీతం అందించారు. టి.వి సీరియల్ 'రామాయణ్'కు ఆయన అందించిన సంగీతం పండిత పామరులను రంజింపజేసింది. ఇంకా 'శ్రీకృష్ణ', 'నూపుర్', 'అలిఫ్ లైలా' సీరియల్స్‌కు కూడా ఆయన సంగీతం అందించారు. ఆయనకు 'సంగీత్ జ్ఞానేశ్వర్', 'సంగీత్ సమ్రాట్', 'అల్మస్త్ ఫకీర్' బిరుదులు లభించాయి.



హిందీ చిత్రాలలో కె.జె.ఏసుదాస్‌కు మొదట్లో రవీంద్రజైన్ ఎన్నో పాటలిచ్చి ప్రోత్సహించారు. గాయని హేమలతాకు బ్రేక్ ఇచ్చినదీ ఆయనే. 'చిత్‌చోర్'లోని 'తూ జో మేరే సుర్ మేఁ' పాటకు హేమలతాకు ఉత్తమ గాయనిగా ఫిలింఫేర్ అవార్డు వచ్చింది. ఆ చిత్రంలోని 'గోరీ తేరా గాఁవ్ బడా ప్యారా', 'జబ్ దీప్ జలే ఆనా' పాటలు క్లాసిక్స్‌గా చరిత్రలో చిలిచిపోయాయి. అందమైన సాహిత్యంతో పాటు హుందా అయిన సంగీతం అందించి చిత్రం సూపర్‌హిట్ కావటంలో ప్రధాన పాత్ర వహించారు రవీంద్రజైన్.

రొమాంటిక్ కామెడీ చిత్రాలు రూపొందించటంలో దిట్ట అయిన బసు ఛటర్జీ దర్శకత్వంలో రాజశ్రీ ప్రొడక్షన్స్ వారి చిత్రం 'చిత్‌చోర్' (చిత్తచోరుడు). గీతా (జరీనా వాహబ్ - ఈమె 'గాజుల కిష్టయ్య'లో హీరోయిన్) తలిదండ్రులు తమ ఊరికి వస్తున్న ఇంజనీర్‌తో గీతా పెళ్లి జరిపించాలను కుంటారు. కానీ ఆ ఇంజనీర్ బదులు వినోద్ (అమోల్ పాలేకర్) అనే ఓవర్‌సీయర్ ఆ ఊరికి వస్తాడు. తాము ఎదురుచూసే ఇంజనీర్ అతనే అని భావించి అతన్ని ఆదరిస్తారు వారు. గీతా అతన్ని ప్రేమిస్తుంది. ఇంజనీర్ వచ్చాక వినోద్‌ను మరచిపొమ్మంటుంది ఆమె తల్లి. గీతా తల్లిని ఎదిరిస్తుంది. చివరికి ఇంజనీర్‌కి నిజం తెలిసి వినోద్‌తో ఆమె పెళ్లి జరిపిస్తాడు. ఇదే కథతో రాజశ్రీ వారు 'మైఁ ప్రేమ్‌కీ దీవానీ హూఁ' చిత్రాన్ని నిర్మించి గత సంవత్సరం విడుదల చేశారు. నేటి ట్రెండ్ పేరు చెప్పి ఒక క్లాసిక్ చిత్రాన్ని అనవసరమైన సీన్లు జోడించి రీమేక్ చేయటంతో ఆ చిత్రం పరాజయం పాలయింది.

వినోద్ పట్నం నుంచి పల్లెటూరికి వచ్చి అక్కడవారి నైర్మల్యం, ఆదరణ చూసి చాలా ఆనందిస్తాడు. గీతాకు ఇంకా చిన్న తనపు చిలిపితనం పోలేదు. దీపక్ అనే పొరుగింటి పిల్లవాణ్ణి వెంటేసుకుని చిలిపిపనులు చేస్తూ ఊరంతా తిరుగుతూ ఉంటుంది. సంగీతం తెలిసిన వినోద్ ఆలాపనను అపహాస్యం చేస్తుంది. అతను హాస్య చతురత కలవాడు గనుక నొచ్చుకోకుండా సంగీతంలోని మాధుర్యం తెలపటం కోసం ఆ ఊరి అందాలను, జనుల మంచి హృదయాలను, గీతా అమాయకత్వాన్ని పొగుడుతూ తనమనసులోని మాటను పాటగా పాడతాడు.

గోరీ అంటే తెల్లని అమ్మాయి. గాఁవ్ అంటే ఊరు. ప్యారా అంటే నచ్చినది, చక్కనిది. 'మారా గయా' అనే మాటను 'గయా మారా' అని ప్రయోగించారు. 'ప్రాణం పోయింది' అని అర్థం. హిందీలో 'మారా గయా', 'తేరీ అదానే మారా' (నీ సొగసు ప్రాణం తీసింది)వంటి ప్రయోగాలు అద్భుతమైన విషయాలను వివరించటానికి వాడతారు. తెలుగులో 'పడి చచ్చాను' అన్నట్టుగా. 'ప్రియా ప్రియా చంపొద్దే', 'చూపుల్తో గుచ్చి గుచ్చి చంపకే' వంటి పాటలు గత దశాబ్ద కాలంగా వస్తున్నాయి. 'మారా గయా' అంటే మనం 'మతి పోయింది' అనుకోవచ్చు. సాదా అంటే నిర్మలమైనది, సహజమైనది. చంద్రమా అంటే చందమామ. 'ఆధా చంద్రమా' అంటే 'సగం చంద్రుడు'. మనం నెలవంక అనుకోవచ్చు. జవాఁ అంటే యౌవనవంతమైనది. 'ఆధా జవాఁ' అంటే ఇంకా పూర్తిగా యౌవనం రానిది, ఎదిగీ ఎదగనిది.



'పిల్లా నీ ఊరెంతో బావుంది
నాకు మతే పోయింది ఇక్కడికొచ్చాక
ఆపై నీ రూపు చక్కనిది
నెలవంకను పోలింది ఎదిగీ ఎదగక'

పల్లెటూరి వాతావరణం, అక్కడి మనుషుల నిష్కల్మషత్వం చూసిన అతను 'మీ ఊరు చూసి నాకు మతిపోయింది' అంటున్నాడు ఆమెతో. ఇంకా చిలిపితనం పోని ఆమె నెలవంకలా సగమే ఎదిగినట్టు ఉందట. సంపూర్ణంగా లేకపోయినా నెలవంక అందం నెలవంకదే. అమాయకత్వం నిండిన ఆమె మోము కూడా అందమైనదే మరి.

మోర్ అంటే నెమలి. పాయలియా అంటే అందె,గజ్జె. కోయలియా అంటే కోయిల. గెహనా అంటే నగ. పంఛీ అంటే పక్షి. తినకే అంటే పుల్లలు.

**'నెమలి కాళ్ళకు అందెలు కట్టాలని ఉంది**
**కూకూ పాటల కోయిలకు పూల నగ పెట్టాలని ఉంది**
**ఇక్కడే గూడు కట్టుకోవాలని పక్షి పుల్లలు ఏరుతోంది చూడు'**

అందంగా నాట్యం చేసే నెమలిని చూసి దాని కాళ్ళకు అందెలు కట్టి

ప్రోత్సహించాలని ఉందట. కోయిల పాటకు మది పులకించి పువ్వుల నగ పెట్టి అభినందించాలని ఉందట. ఆ ఊరిలోనే ఉండిపోవాలని ఉందని అంటున్నాడు అతను. పుల్లలు ఏరుకుని గూడు కట్టుకునే పక్షిలా అతను బంధాలు ఏర్పరచుకుని అక్కడ స్థిరపడాలనుకుంటున్నాడని అందమైన పోలికతో చెప్పారు. ఇందులో ధ్వనించే వేదాంతభావం రవీంద్రజైన్ పాండిత్యాన్ని పరిచయం చేస్తుంది.

'రంగ్ బిరంగే' అంటే రంగురంగులు కలవి. 'ఝుర్ ఝుర్' అంటే బిరబిర. ఝుర్‌నా అంటే ఏరు. హర్‌నా అంటే హరించటం.

**'రంగురంగుల పూలు పూశాయి, మనుషులూ పూల వంటి వారే**
**ఓసారి ఇక్కడికొచ్చాక మళ్ళీ వెళ్ళగలరా ఎవరైనా**
**బిరబిర పారే ఏరులు మదినే దోచేను, ఇంకెక్కడుంటుందిలా'**

ఆమె అతని కోసం రోజా తమ తోటలోని పూలతో పూలగుత్తి తయారు చేసి తెస్తుంది. ఆ పూలు రకరకాలుగా ఉన్నా అన్నీ అందమైనవే. అలాగే ఆ ఊరి మనుషులు అందరూ మంచి మనసుగలవారే అని అతని భావం. 'ఈ ఊరికి ఒకసారి వచ్చారంటే విడిచి వెళ్ళటం కష్టం' అంటున్నాడు.



గలగల పారే ఏరులు అతనికి ఎంతో ఆహ్లాదాన్ని కలిగించాయి. ఇలాంటి ప్రకృతి అందాలు అతను ఎక్కడా చూడలేదు.

అన్‌జాన్ అంటే అజ్ఞాతులు. అప్‌నానా అంటే తమవారిని చేసుకోవటం. జుడ్‌నా అంటే కలవటం. నాతా అంటే బంధం. 'అప్‌నీ ధున్ మేఁ మగన్' అంటే తమదైన లోకంలో నిమగ్నమైనవారు అనుకోవచ్చు. జబాఁ అంటే భాష.

**'తెలియని పరదేశిని ఇలా అక్కున చేర్చుకోరెవ్వరూ**
**మీతో నాకు ఏర్పడింది జన్మజన్మల బంధము**
**తమదైన లోకంలో ఉండే ఈ జనులు మనసు భాష మాట్లాడుతారు'**

పరిచయం లేని పరదేశిని ఎవరూ త్వరగా తమలో కలుపుకోరు. కానీ వారు అతన్ని ఎంత ఆదరించారంటే జన్మజన్మల బంధం ఏర్పడినట్టు అనిపించింది అతనికి. వారి లోకమేదో వారిదే అన్నట్టుగా మనసులు ఎలా ఆకట్టుకోవాలో వారికి తెలుసు.

ఈ పాట వింటూంటే 'మధుమతి'లోని 'సుహానా సఫర్' అక్కడక్కడ గుర్తొస్తుంది. చిన్నపిల్లలను, శాస్త్రీయ సంగీతంతో పరిచయం లేనివారిని కథాపరంగానూ, వాస్తవంగానూ అలరించేలా రూపొందించిన పాట ఇది. ఆ కృషి ఎంత సఫలం అయిందో ఈ పాట సాధించిన విజయమే చెబుతుంది. శాస్త్రీయతకు దగ్గరగా మలచిన 'జబ్ దీ జలే ఆనా' పాట కూడా అంతటి విజయమూ సాధించిందంటే దానికి రవీంద్రజైన్‌లోని కవి, స్వరకర్తల ప్రతిభా సమన్వయమే కారణం. గీతాకు వినోద్ సంగీతం నేర్పేటప్పుడు పాఠంలో భాగంగా నేర్పే పాట ఇది. ఈ పాటలోని సాహిత్యానికి, చిత్రకథకు సంబంధం లేదు.

'దీప్ జలే' అంటే దీపాలు వెలగటం. 'షామ్ ఢలే'అంటే సాయంత్రం వెళ్ళిపోవటం. మిలన్ అంటే కలయిక. భూల్‌నా అంటే మరువటం. బిస్‌రానా అంటే విస్మరించటం. ఆకాశవాణి వివిధభారతిలో వచ్చే 'భూలే బిస్‌రే గీత్' కార్యక్రమం వినే ఉంటారు. మరచిన, విస్మరించిన గీతాలు అని ఆ శీర్షిక అర్థం.

**'దీపాలు వెలిగే వేళ రా,**
**సందె దాటే వేళ రా**
**సంకేతమిదే కలయికకు, మరువకు, నా ప్రేమ విడువకు'**

ఆ ప్రేయసీ ప్రియుల కలయికకు చీకటి పడి దీపాలు వెలగటమే సంకేతమట. ఆ సంకేతాన్ని మరువద్దని, తన ప్రేమను విస్మరించవద్దని ప్రియుడు ప్రేయసికి విన్నవించుకుంటున్నాడు.



వల్‌కన్ అంటే కనురెప్పలతో, డగర్ అంటే దారి, బాట. బుహార్‌నా అంటే ఊడ్చటం. 'రాహ్ నిహార్‌నా' అంటే ఎదురు చూడటం. ప్రీత్ అంటే ప్రేమ. కాజల్ అంటే కాటుక. నైన్ అంటే కనులు. మల్‌నా అంటే పూనుకోవటం.

**'నే కనురెప్పలతో బాటను ఊడ్చేను**
**నీ కోసం ఎదురుచూసేను**
**నా ప్రేమను కాటుకగా కనులకు పెట్టుకుని రా'**

ప్రేయసి వచ్చే దారిలో ధూళిని తన కనురెప్పలతో ఊడుస్తానంటున్నాడు ఆ ప్రియుడు. ఆమె కోసం ఎదురు చూస్తున్నాడని చెప్పటానికి ఇంతకంటే పరాకాష్ట ఏముంటుంది? 'నీ కనులలో నా ప్రేమను దాచుకో' అనే భావం ఎంతో భావుకంగా 'నా ప్రేమను కాటుకగా నీ కళ్ళలో పెట్టుకో' అని చెప్పారు.

**'మనం తొలిసారి కలిసిన చోట**
**కలిసి పయనం మొదలిడిన చోట**
**నదీతీరాన నేడు ఆ మావిచెట్టు నీడకు రా'**

తాము మొదటిసారి కలిసి ప్రేమప్రయాణం మొదలుపెట్టిన చోట మళ్ళీ మళ్ళీ కలవాలని ప్రేమికులు అందరికీ కోరిక ఉంటుంది. ఆ చోటు నదీతీరాన మామిడిచెట్టు నీడైతే ఇక చెప్పేదేముంది?

నిత్ అంటే నిత్యం. సాంఝ్ అంటే సాయంత్రం,సందె. సవేరా అంటే ఉదయం. పగలు అనే విస్తృత అర్థంలో కూడా వాడతారు. విదా అంటే వీడ్కోలు. 'ఎక్ దూజేసే' అంటే ఒకరి నుంచి ఒకరు.

**'రోజూ సందె, పగలు కలిసేను**
**వాటిని చూసి తారలు విరిసేను**
**అవి రెండూ వీడ్కోలనుకుని మనలను రమ్మని పిలిచేను'**

రోజూ సందె, పగలు కలుసుకుంటాయి. అవి కూడా ప్రేమికుల వంటివే. పగలు ప్రియుడైతే సందె ప్రేయసి. సందె ఒడిలో పగలు సేద తీరుతుంది. ఆ సమయంలో చుక్కలు పొడవటం మొదలు పెడతాయి. వారి ప్రేమకు మురిసి విరిసే పువ్వుల వంటివి ఆ చుక్కలు. సాయంసమయానికి ఎంత చక్కని వర్ణన ఇది. చివరకు సందె,పగలు వీడ్కోలు చెప్పుకుని వెళ్ళిపోతాయి. అలా వెళ్ళిపోతూ ఈ ప్రేమికుల జంటను రమ్మని పిలుస్తాయట. ఎంత అందమైన ఊహ? 'మేం వెళుతున్నాం. మా ప్రేమను మీరు కొనసాగించండి' అనే సంకేతమది.

ఈ రెండు పాటలలో ఒక పిల్లవాడు నాయికానాయకుల వెంట ఉండటం అప్పటి చిత్రాలలోని ఇన్నోసెన్స్‌కి ప్రతీక. నేడు మార్పు పేరు చెప్పి ఆ ఇన్నోసెన్స్ లేకుండా చేస్తున్నారు. అందుకేనేమో చిత్రాల పరాజయాల సంఖ్య పెరిగిపోతోంది.

**-పి.వి.సత్యనారాయణ రాజు**

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 7

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రేయ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

- జీడిగుంట రామచంద్రమూర్తి



**జరిగిన కథ**

రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహుద్దూర్ వంశానికి చెందిన వీరభద్ర అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుస లాడుతుంటాడాయన. వీరభద్రం పెద్దకొడుకు శ్రీరామ్ పట్నంలో చదువుతూంటే చిన్న కొడుకు లక్ష్మణమూర్తి తండ్రి దగ్గరే ఉండి పదోతరగతి చదువుతూ ఉంటాడు. శ్రీరామ్‌ను అశ్వని ప్రేమిస్తూ ఉంటుంది. తనకు బాకీగా ఉన్న కట్నం బాపతు సొమ్మును రెడీగా ఉంచమని మామ వీరభద్రంకు ఉత్తరం రాస్తాడు రాజేంద్ర . దాని గురించి బాల్యస్నేహితుడు లాయర్ చిదంబరంకు చెప్పి మంచి సలహా ఇమ్మంటాడు. సంక్రాంతి పండుగకు అల్లుడు రాజేంద్ర, కూతురు గీతలు వస్తారు. మావల సంఘం సెక్రటరీ అప్పారావు ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించినట్టు వీరభద్రానికి తెలుస్తుంది. -(ఇక చదవండి)

వీధిలోకి వెళ్లిపోయాక నారాయణను దగ్గరకు పిలిచి అడిగాడు.

"ఏమిటోయ్ నారాయణా!...మా మావ 'అల్లుళ్లూ,ఆరళ్లూ' అంటూన్నాడేమిటీ?"

"చిత్తం!..మనూరి మావలసంగం సెక్రట్రీ అప్పారావ్ గోర్ని ఆరల్లుడుగోరు, 'తాత్తై-తధికిణితోం' అంటూ భరతనాట్యం ఆడించేశారండీ"

రాజేంద్రకి విషయం అర్థంకాలేదు.

"అంటే?" అడిగాడు.

"అదేనండీ! ఆరల్లుడుగోరు... మావగోర్ని 'లారీ' కొనిపెట్టమన్నారంటండి, కానీ మావల సంగం రూల్సు ఒప్పవ్ కదండీ మరి!... ఇస్తే సంగం ఎలేస్తుంది... ఇయ్యకపోతే అల్లుడు కూతుర్ని గ్గేస్తాడు... అందుకని, ఆయనగోరు ఇన్ని నిద్రమాత్రలు మింగేశారంటండి!' టూకీగా చెప్పాడు.

"అనలు ఈ మావలసంగం రూల్సు ఏమిటయ్యా మధ్యన?" విసుక్కున్నాడు రాజేంద్ర.

"చిత్తం!..ఈమధ్యనే తాపించారండి"

"ఎవరు స్థాపించారూ?"




"అదంతా సెప్పాలంటే మూగమనసులు సినీమాలో ప్లాస్‌బేక్కులోకి ఎల్పోయినట్టు ఎల్పోవాలండి... అలా కూసోండి... సెప్తాను! కుర్చీ రాజేంద్ర దగ్గరకు లాగేడు... రాజేంద్ర అందులో కూర్చున్నాక నారాయణ చెప్పటం ప్రారంభించాడు...

"ఆ మద్దెనోసారి కొంతమంది ఊరి పెద్దలు అయ్యగోరి కాడకు వచ్చారండి... నారాయణ చెప్తూంటే- ఆదృశ్యం రాజేంద్ర కళ్ళముందు నడుస్తోంది.

◎ ◎ ◎

వీరభద్రం హాల్లోవున్న ఉయ్యాల బల్ల మీద కూర్చుని నారాయణతో తలమర్దనా చేయించుకుంటూండగా నలుగురు పెద్దమనుషులు అక్కడకు వచ్చారు. భయభక్తులతో నమస్కారం చేశారు.

"గ్రామపెద్దలందరూ ఒకే పర్యాయం వేం చేశారు! ఏమిటి విశేషం?... చందాలేమైనా 'కలక్టు' చేస్తున్నారా?" అడిగాడు వీరభద్రం.

అంతలో నారాయణ 'చాప' తెచ్చి అక్కడ పరిచాడు... నలుగురూ దానిమీద ఒదిగి కూర్చున్నారు.

"మేం ఒక ముఖ్యమైన పని మీద వచ్చాం మాస్టారూ!" ఒకాయన చెప్పాడు.

"శలవీయండి!"

"ఈమధ్యన మన ఊరి పోస్టు మాస్టారు... మాధవరావుగారమ్మాయి చనిపోయిన విషయం మీకు తెలుసుగా?"

"అవునవును! పాపం వంటచేయు చుండగా, ప్రమాదవశాత్తూ ఆమె చీరకు స్టౌ మంటలంటుకుని మరణించింది కదా!"

"అది అబద్ధం మాస్టారూ ఆమె మరణం ప్రమాదవశాన జరిగింది కాదు"

"మరి?" ఆసక్తిగా చూస్తూ అడిగాడు వీరభద్రం.

వెంటనే మరో పెద్దమనిషి చెప్పాడు.

"అసలేం జరిగిందంటే మాష్టారూ మాధవ రావుగారు వారి అల్లుడిగారికి పెళ్ళిపీటల మీద ఇస్తానన్న కట్నం ఇవ్వలేక పోయారట!.. త్వరలోనే ఇస్తానని కాగితం రాసిచ్చి అప్పటికి శుభకార్యం కానివ్వమని అతని కాళ్లు పట్టుకున్నార్ట!... అమ్మాయి కాపురానికి వెళ్ళిన తర్వాత ఆ అల్లుడు, కట్నం పట్టుకు రమ్మని ప్రతీరోజూ ఆమెను హింసించే వాడట... కానీ ఆ పిల్ల 'ససేమీరా - నేను తేను గాక తేను' అని మొండికేసిందట!... అంతే!... ఆ అల్లుడూ, అతని తల్లీ కలసి - ఓ పథకం ప్రకారం, ఆ పిల్ల మీద పెట్రోలు పోసి - అగ్గిపుల్ల గీశారట!"

వీరభద్రం విస్తుపోయాడు-

"ఏమీ యదార్థమా?.." ఉలికిపాటుతో అడిగాడు.

"అవును బాబూ! - చుట్టుపక్కలవాళ్లు చూసి చెప్పారండి... ఆమాట్న మాధవరావుగారు పోలీసు రిపోర్టు ఇచ్చార్లెండి... పోలీసులు గట్టిగా నాలుగు తగిలించేసరికి- వాళ్లు ఒప్పేసుకున్నారండి!" నాలుగోవ్యక్తి చెప్పాడు.

"ఎంత దారుణమునకు ఒడిగట్టారూ?..."

"చిత్తం ! రాను రాను ఇలాంటి దారుణాలు మితిమీరిపోతున్నాయి మాష్టారూ!... వీటిని అరికట్టటానికి మనమందరం ఉద్యమించాలి!... మొదటి వ్యక్తి ఆవేశంగా చెప్పాడు.

"మనమా! ఇందు మనం చేయగల కార్యమేముందీ?"

"కట్నాలు ఇవ్వటం - తీసుకోవటం నేరమని అందరికీ తెలియ చెప్పాలి!".

"ఆ విషయంపై ప్రభుత్వం చట్టమే చేసిందికదా? అపై రేడియో, టివీలయందు ఉధృతముగా ప్రచారంసైతం జరుగుతోంది!" అన్నాడు వీరభద్రం.

"చట్టాలవల్ల, ప్రభుత్వ ప్రచారంవల్లా ప్రయోజనం వుండదు మాస్టారూ! మనుషుల మనసులు మారాలి!.. ఆ మార్పు కోసం మనం



అందరం నడుంకట్టాలి!"

వీరభద్రానికి అర్థంకాలేదు. "ఎక్కడో మారుమూల ఈ కుగ్రామంలో నివశిస్తున్న వాళ్ళం... మనం ఇంతటి బృహత్కార్యాన్ని సాధించగలమా?" అనుమానాన్ని వ్యక్తం చేశాడు.

"తప్పక సాధించగలం మాస్టారూ!... ఏ ఉద్యమమైనా ప్రారంభం ఎప్పుడూ పలుచగానే వుంటుంది... పదిమంది మధ్యకు వెళ్ళినపుడే ఉధృతమవుతుంది...'ఉద్యమం' అనిపించుకుంటుంది".

ఆలోచనలో పడ్డాడు వీరభద్రం...

"అయినచో మనం ఏం చేయాలో అదీ శలవియ్యండి!"- అడిగేడు తర్వాత.

మొదటివ్యక్తి చెప్పాడు-

"ముందుగా మన గ్రామంలోనే ఒక సంఘాన్ని స్థాపించాలి... కట్నం ఇవ్వటం పుచ్చుకోవటం - మన మధ్య మనమే నిషేధించుకోవాలి. ఎక్కడ అలాంటి సంఘటన జరిగినా - దాన్ని మనం ఖండించి - అవసరమైతే పోలీసుల దృష్టికి తీసుకెళ్ళాలి!... కట్నకానుకలు ఇచ్చిన వారినీ - పుచ్చుకున్న వారినీ కూడా మన గ్రామం నించి బహిష్కరించాలి!"

"అంతేకాదు! చుట్టుపక్కల గ్రామాల క్కూడా మనం - వారానికోసారి వెళ్ళి అక్కడ ఈ విషయమై మీటింగులు పెట్టాలి.అక్కడ కూడా మన సంఘం శాఖల్ని ఏర్పాటు చెయ్యాలి... అక్కడి ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యాలి. మనం చేసే పనులగురించీ - సాధించిన విజయాల గురించీ - ఎప్పటికప్పుడు న్యూస్ పేపర్లకు సమాచారం పంపిద్దాం... అలా ఒకటి రెండు సంవత్సరాల్లో రాష్ట్రం మొత్తం మీద ఈ ఉద్యమం ఊపందుకుని - అప్పుడెప్పుడో సారా వ్యతిరేక ఉద్యమం విజయాన్ని సాధించినట్టుగా - మన ఉద్యమానికీ, మన సంఘానికీ మంచి గుర్తింపు లభిస్తుంది... మన గ్రామం కూడా ఆదర్శ గ్రామంగా నిలుస్తుంది!" - రెండో పెద్దమనిషి - కాస్తంత ఆవేశంగా ఉపన్యాస ధోరణిలో ప్రశంగించాడు. వాళ్ళు ఆలోచనల్నీ,ఆవేశాన్నీ




అర్థం చేసుకున్నాడు వీరభద్రం... వాళ్లు చెప్పినట్లు చేస్తే త్వరలోనే వరకట్న నిషేధం పట్ల ప్రజల్లో చైతన్యం కలిగి క్రమేపీ ఆ దురాచారం దూరమై పోగలదన్న నమ్మకం అతనిలో కలిగింది... ఒక నిర్ణయానికి వచ్చాడు.

"మీరు చెప్పింది సబబుగానే ఉంది... ఈ విధంగా మన గ్రామంలో ఒక సంఘాన్ని స్థాపించటం వల్ల - తప్పక మన గ్రామం చరిత్ర ప్రసిద్ధి పొందుతుంది."- అన్నాడు.

ఇప్పుడు అక్కడ కూర్చున్న నలుగురిలోనూ ఉత్సాహం కనిపించింది.

"మరో చిన్న విన్నపం"- అన్నాడు మొదటి వ్యక్తి.

ఏమిటన్నట్లు చూశాడు వీరభద్రం...

"ఈ సంఘానికి మీరే అధ్యక్షులుగా వుండి మమ్మల్ని ముందుకి నడిపించాలి!" చెప్పాడతను వెంటనే.

"అవును మేష్టారూ... మీరే వుండాలి!... ఊరి ప్రజలందరికీ మీ పట్ల ప్రేమాభిమానాలతో పాటు భయభక్తులు కూడా ఉన్నాయి. కనుక ఆ పదవిలో మీరుండటవమే సమంజసంగా వుంటుంది." - వెంటనే రెండో మనిషి బలపరిచాడు.

"పోతే ఈ అప్పారావుగారు సంఘానికి కార్యదర్శిగా వుంటారు.!" - మూడోవ్యక్తిని చూపిస్తూ చెప్పాడు మొదటి పెద్దమనిషి...

"మంచిది... అట్లే కానివ్వండి! మాకు సమ్మతమే!" వీరభద్రం చూపుడువేలితో మీసాలు సరిచేసుకుంటూ - తన అంగీకారాన్ని తెలియచేశాడు.

అంతలో నారాయణ - గ్లాసుల్తో కాఫీ తెచ్చి అందరికీ అందించాడు...

అప్పారావు - ఓ గ్లాసు అందుకుని - కాఫీ ఓ గుటక వేసి చెప్పాడు - ముఖ్యంగా పెళ్ళీడు కలిగిన తల్లిదండ్రులనందర్నీ సంఘంలో సభ్యులుగా చేర్చుకోవాలి... సభ్యత్వపు రుసుం కూడా ఏర్పాటు చేసి కార్యవర్గ సభ్యుల్ని ఎన్నుకోవాలి. ఈ సమావేశానికి పేపరు వాళ్లను కూడా పిలవాలి!"

"అన్నింటికంటే ముఖ్యమైనది మరొకటుంది." రెండోమనిషి కల్పించుకుంటూ అన్నాడు... అందరూ అతనివైపు ఆసక్తిగా చూశారు.

"మనం ఎదుటివారికి చెప్పేముందు - మనస్ఫూర్తిగా మనం ఆచరించాలి... అంటే కొన్ని కట్టుబాట్లు మనకు మనమే విధించుకోవాలి... ప్రాణమైనా ఇవ్వాలి తప్ప అల్లుళ్లకు కట్న కానుకలు ఇవ్వకూడదు!" - చెప్పాడతను.

"బాగా చెప్పేరు!"- ముక్త కంఠంతో అన్నారందరూ.

"సరే! రేపు పంచమి... బుధవారం! మంచి రోజు. ఉద్యమ ప్రారంభానికి సన్నాహాలు చేయండి... అలాగే సభ్యులను నమోదు చేసుకునే ప్రయత్నము కూడా ప్రారంభించండి" - అన్నాడు వీరభద్రం.

పెద్దమనుషులు నలుగురూ శలవు తీసుకుని వెళ్లిపోయారు...

"తర్వాత - నారాయణ మళ్లీ వీరభద్రం తలమర్దనా చేయటానికి వచ్చాడు... అయితే బాబుగోరూ... తమరి అల్లుడుగోరికి కట్నం ఇచ్చారు కదా?.. అది తిరిగి తీసేసుకుంటారా?" తనపని చేస్తూనే అడిగేడు.

"ఇచ్చింది-తిరిగి పుచ్చుకొనమని మేం చెప్పుటలేదు! ఇకముందు కట్నకానుకలను ఇచ్చుటా - పుచ్చుకొనుటా వల్లకాదని మాత్రమే నిబంధన చేశాం... అయినా అల్లునికి నేనింకా కట్నం సొమ్ము కొంత బాకీ వుంటిని గదా?... దానికి ఈ నిబంధన వర్తిస్తుంది" - అంటూ లేచాడు వీరభద్రం.




కుర్చీలో కూర్చునివున్న రాజేంద్రతో అంటున్నాడు నారాయణ- "అదిబాబూ! ఈ




మావలసంగం తాలూకు ప్లాసుబేక్కు!.. కనక తమరు కూడా, తమకు రావాల్సిన కట్నం తాలూకు బాకీని 'రద్దు' చేసుకోవాలన్న మాట!"

"నా సంగతి సరే, తన కొడుక్కి మా మావ కట్నం తీసుకోకుండానే పెళ్లి చేశాస్తాడా?" రాజేంద్ర అనుమానంగా చూస్తూ అడిగేడు...

"మరంతేకదండీ?...కట్నం తీసుకున్నట్టు ఎవరికైనా తెల్సిందంటే ఈరి పరువు పోతుంది... పదవీ పోతుంది...! అయినా ఈ ఇంటికోడలుగా రావటానికి అయ్యగోరి మేనకోడలు సిద్ధంగానే వున్నారు కదండీ. మేనరికం అన్నాక కట్నాలు, కానుకలూ వుండనేవుండవు... ఒకవేళ అయ్యగోరు కక్కుర్తి పడదామన్నా ఆరి బావగోరి దగ్గర ఏమన్నా ఉంటేగా ఇయ్యటానికి?" - చెప్పాడు నారాయణ.

"రామచంద్రా!... బామర్దీ!... నువ్వెంత దురదృష్టవంతుడివోయ్?... ఆరెకరాల మాగాణికి వారసుడివి...ఆరడుగుల అజానుబాహుడివి!... అందమైన పర్సనాలిటీ వున్నవాడివి, ఆంధ్రాయూనివర్శిటీ డిగ్రీ తీసుకుంటున్న వాడివి. ఇన్ని అర్హతలుండి - అణాకానీ కట్నం లేకుండా ఖర్చయి పోతున్నావా?.. అయ్ పిటీ యూ!" రాజేంద్ర స్వగతంలో అనుకున్నాడు శ్రీరామ్‌ని తల్చుకుంటూ.

నారాయణ పెరట్లోకి వెళ్ళిపోయాడు.

"హాల్లోనే కూర్చుండిపోయారేమిటీ?" అంటూ వచ్చింది గీత - అతని చేతిలో ప్రసాదం పెట్టింది... దాన్ని కళ్ళకద్దుకుని నోట్లో వేసుకున్నాడు రాజేంద్ర "నేనెక్కడ కూర్చుండిపోతే ఏమైందిలే గానీ - ఈ సారి మీ నాన్న నా కట్నం బాకీ తీర్చకపోతే - నువ్వు పెర్మనెంటుగా ఈ ఇంట్లోనే కూర్చుడిపోతావ్!" అన్నాడు. సరిగ్గా అదే క్షణంలో గాజు ప్లేటులాంటిదేదో భళ్లున క్రిందపడి బ్రద్దలైనట్టు శబ్దమైంది. రాజేంద్ర, గీతా ఉలిక్కిపడి అటు తిరిగి చూశారు. వంటింట్లోంచి ఉప్మా ప్లేటుతో వస్తున్న పార్వతమ్మ చేతిలోని ప్లేటు వదిలేసింది కాబోలు. అది కిందపడి బద్దలై ఉప్మా చెల్లాచెదురుగా పడింది. తల్లిని చేరుకున్న గీత ఆమె స్పృహ తప్పి పడిపోతోందని గ్రహించింది... క్రిందపడిపోకుండా పట్టుకుని భర్త సహాయంతో నెమ్మదిగా తీసుకొచ్చి సోఫాలో కూర్చోబెట్టింది. తనపైట చెంగుతో రెండు క్షణాలు గాలి తగిలేలా విసిరి ఫ్లాస్కులో వున్న కాఫీ తెచ్చి తాగించింది. రెండు నిమిషాల తర్వాత పార్వతమ్మ తేరుకుంది. కళ్ళుతిరిగేయా? బీపీ ఏమైనా వుందేమో?... డాక్టరుకి చూపించుకున్నావా?" అడిగింది గీత సపర్యలు చేస్తూనే.

"అదేంకాదే తల్లీ !... అల్లుడిగారి కోసం ఉప్మా తెస్తూంటే 'నువ్వు పెర్మనెంటుగా ఈ ఇంట్లోనే కూర్చుండి పోతావ'ంటూ ఆయన చెప్పటం వినిపించింది... అంతే! భయంతో కళ్లు తిరిగినట్లయి..." చెప్పింది పార్వతమ్మ. తర్వాత రాజేంద్రను చేరుకుంది. "అల్లుడుగారూ! మీ మావగారి సంగతి మీకు తెలుసుగా?.. పిసినిగొట్టు కాకపోయినా పిసరంత మూర్ఖత్వం, చేరడంత చేదస్తం వున్న మనిషి...! నీ డబ్బు నీకు ఇచ్చే వారే ! కానీ ఉరుమురిమి మంగలంమీద పడినట్టు ఈ ఊర్లో ఆ పోస్టుమాస్టారి పిల్ల 'వరకట్నం హత్య'కు బలై - ఓ దిక్కు మాలిన సంఘం పుట్టుకొచ్చింది... దానికి ఈ పెద్ద మనిషి ప్రెసిడెంటవడంతో నీకిచ్చిన మాట వెనక పడింది. ఈ సారికి నీ పట్టు వదిలి పెట్టు నాయనా!... త్వరలోనే ఆయన గార్ని ఎలాగోలా ఒప్పించి నీకు రావాల్సిన డబ్బు నేను ఇప్పిస్తాను!"- ఆర్ద్రింపు స్వరంతో చెప్పింది... రాజేంద్ర కొంచెం మెత్త పడ్డాడు...

ఇంతలో గీత అందుకుంది - "ఔనండీ!.. అమ్మ మాట కాదని - మీరు పట్టుబడితే నాన్నకూడా అప్పారావుగారిలా ఏదైనా అఘాయిత్యం చేసుకుంటాడు. అసలే ఆయనగారికి కొంచెం మూర్ఖత్వం ఎక్కువ!... మా అమ్మ మాంగల్యాన్ని కాపాడి, పసుపు కుంకమల్ని నిలబెట్టండి!"

రాజేంద్ర పూర్తిగా మెత్త పడ్డాడు..."సరే!... వచ్చే సంక్రాంతి వరకూ ఆగుతాను... అప్పటికీ మీ నాన్న దారికి రాక పోతే - నీదారి నీది - నాదారి నాది!" - అంటూ అక్కణ్ణించి విసురుగా వెళ్లిపోయాడు.

అప్పారావుగారిని పరామర్శించి వస్తానంటూ వాకిట్లోకి వెళ్ళిన వీరభద్రం - బయట గుమ్మం అవతలే నిలబడి - ఈ దృశ్యాన్ని చూసి - 'అల్లుడిగండం' గడిచినందుకు హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు.. అవసరమైతే అలాంటి ప్రయోగం చేయమంటూ ఆనాడు 'సలహా' ఇచ్చిన లాయరు చిదంబరానికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు....

ఆ 'నాటకం'లో తన పాత్రను సమర్ధవంతంగా పోషించిన నారాయణను అభినందించి - టౌనుకెళ్ళి సినీమా చూసి రమ్మంటూ - పాతిక రూపాయలు బహుమతిగా ఇచ్చాడు.

* * *

పుస్తకాలు పట్టుకుని కాలేజీలోంచి బయటకు వచ్చాడు శ్రీరాం...! రోడ్డుమీద పరధ్యానంగా నడుస్తున్నాడు... కొంత దూరం వెళ్ళే సరికి అతని పక్కనే 'సాంత్రో' కారొచ్చి ఆగింది. డ్రైవింగ్ సీట్లో కూర్చున్న అశ్విని - చిరునవ్వుతో శ్రీరామ్ ని పలకరించింది-

"హాయ్ శ్రీరామ్!"

"హలో!" - తెచ్చిపెట్టుకున్న నవ్వుతో పలకరించాడు.

"కమాన్!"- డోరుతెరచి అతన్ని లోపలకు ఆహ్వానించిందామె. శ్రీరామ్ కారెక్కలేదు. "సారీ!...నేను హాస్టల్‌కు వెళ్ళాలి." సీరియస్‌గా చెప్పాడు.

"నేను రమ్మంటున్నది అరణ్యంలోకి కాదు!... అయినా ఎప్పుడూ హాస్టలూ, కాలేజీలేనా?... అప్పుడప్పుడూ కాస్తంత 'పిల్లగాలి'ని కూడా అనుభవించాలి. కమాన్ ఐసే!" అతని చేయి పట్టుకుని లోపలకు లాగబోయింది అశ్విని.

-(ఇంకావుంది)





# సులలిత స్వరం సుమధుర రూపం

# సురయ్యాకే స్వంతం

హిందీలో గాయకనటులు ఎంతమంది ఉన్నారు? (నటులు అంటే, నటీమణులు కూడా) అలాంటి వారి పేర్లు చెప్పమని ఎవరైనా అడిగితే, చప్పున గుర్తొచ్చేవారు చాల తక్కువ. అందరికంటే ముందు గుర్తుకొచ్చే వ్యక్తి సైగలే. ఆతర్వాత - ఒకటో రెండో సినిమాల్లో నటించిన తలత్ మెహమూద్, లతా మంగేష్కర్. వీళ్ళు ఈ కోవకు చెందరు. ఒకటి రెండు హిట్ ల తర్వాత అదృశ్యమై పోయిన సులక్షణా పండిత్, సల్మాఆగా లు అంతగా చెప్పుకోదగ్గ వారు కారు (నటనకు , గానానికీ కూడా).

సౌందర్యానికీ, గానానికీ, నటనకూ, అన్నిటికీ మించి అసాధారణమైన ప్రేక్షకాదరణకు నోచుకున్న ఏకైక నటగాయని సురయ్యా. అయితే తన 39 వ యేట తెరమరుగైన తర్వాత, ఆమెను పట్టించుకున్న వారు లేరు; జ్ఞాపకం తెచ్చుకున్న కాలమ్ లు లేవు; ఆమెను ఆహ్వానించిన సంగీత వేదికలు లేవు. చానళ్ళు అసలే లేవు. ఎపుడో చాలా ఏళ్ళ కిందట దూరదర్శన్ మెట్రో చానల్లో ఆమె తో ప్రసారమైన ఒక ఇంటర్వ్యూలో అదే సౌందర్యం, అదే అలంకరణ, అదే సుకుమార స్వరం కనిపించి, వినిపించి, ఆమె అభిమానులను ఆశ్చర్యానందాల్లో ముంచెత్తాయి. చివరికి జనవరి 31 న ఆమె మరణించినపుడు కూడా ఆమెను చూడడానికి వచ్చిన సినీ రంగ ప్రముఖులను వేళ్ళ మీద లెక్క పెడితే, రెండు చేతులు కూడా పూర్తవలేదు. చలనచిత్ర రంగంలో (రాజకీయంలోలా ) ప్రజల జ్ఞాపక శక్తి చాలా అల్పమైంది. పరిమితమైంది.

సురయ్యాను Child Prodigee అనవచ్చేమో. తన 12 వ ఏటనే, తాజ్ మహల్ (1941) చిత్రంలో ముంతాజ్‌గా నటించి, గానంచేసి మెప్పించింది. హమారీ బాత్, ఫూల్ వంటి సినిమాల్లో కూడా నటించినా, 1946 లో ఆనాటి మేటి నటి, తన లాగే లాహోర్ లో జన్మించి, తనలాగే 17వ యేటే నాయిక అయిన నూర్జహాన్ తో కలిసి, రెండో నాయికగా 'అన్‌మోల్ ఘడీ' చిత్రంలో నటించడంతో, సురయ్యాకు దశ తిరిగింది. నౌషాద్ సంగీతంలో అజరామరంగా చెప్పుకునే ఆ చిత్రంలో 'జవా హై మొహబ్బత్ హసీ హై జమానా' 'ఆజా మెరీ బరబాద్ మొహబ్బత్ కే సహారే' వంటి సూపర్ హిట్ పాటలు నూర్జహాన్ కు దక్కినా, ' మన్ లేతా హై అంగడాయి, జీవన్ పే జవానీ చాయి,' 'సోచా థా క్యా క్యా హోగయా' 'మై దిల్ మే దర్ద్ బసా లే ఆయీ'. సురయ్యా స్వర మాధుర్యం వల్ల వీనుల విందు చేస్తూ, గాయని గా ఆమె ప్రత్యేక వ్యక్తిత్వానికి నాంది పలికాయి.

ఆ తర్వాత సంవత్సరం నూర్జహాన్ పాకిస్తాన్ కు వెళ్ళిపోవడంతో, సురయ్యా స్వల్పకాలానికే అయినా, హిందీ సంగీత సామ్రాజ్ఞి అయింది. 'ప్యార్ కే జీత్ ' బడీ బహన్, దిల్లగీ సినిమాలు అమెలోని ప్రతిభను సంపూర్ణంగా వెలికి తెచ్చాయి. సౌందర్యంలోను, గానంలోనూ ముగ్ధత్వం సురయ్యాలోని ప్రత్యేకత. ప్యార్ కే జీత్ లోని 'తెరీ నైనోంనే చోరీ కియా మేరా ఛోటాసా జియా పర్ దేశియా' 'ఓ దూర్ జానే వాలే, వాదా న భూల్ జానా,' 'బడి బహన్' లోని 'వో పాస్ రహే యా దూర్ రహే నజరోమె సమాయే రెహతే హై- ఇత్ నా తో బతాదే కోయీ హమే క్యా ప్యార్ ఇసీకో కెహతే హై' దిల్లగీ లోని 'బిగ్‌డీ బనాలే వాలే' ఈ ముగ్ధత్వానికి నిదర్శనాలు. ఆ రోజుల్లో సురయ్యా సినిమాలు ఒక్కొక్కటీ అనేక సార్లు చూసిన వారుండే వారట. ధర్మేంద్ర స్వయంగా తను దిల్లగీ సినిమాను 40 సార్లు చూసినట్లు చెప్పుకున్నారు. మెరీన్ డ్రైవ్‌లో ఆమె ఇంటి ముందు జనం గంటల తరబడి, ఒక్క చూపుకోసం, ఒక్క దర్శనం కోసం వేచివుండే వారని ఆమె మిత్రులు, తోటి సినీరంగ ప్రముఖులు ఇప్పడు గుర్తు చేసుకుంటున్నారు. 1941 నుంచి, 1961 వరకు చలనచిత్ర రంగంలో ఉన్నప్పటికీ, సురయ్యా రాజ్యమేలిన రోజులు 1946నుంచి 52 వరకే.

సురయ్యా హీరోల జాబితా ఆసక్తికరమైంది. కె.ఎల్. సైగల్, శ్యామ్, భరత్‌భూషణ్, దేవానంద్‌లతో ఆమె జోడి ప్రసిద్ధి చెందింది. సైగల్ కు వీరాభిమాని అయిన సురయ్యా, పర్ వానా, ఒమర్ ఖయ్యాం, తద్‌బీర్ చిత్రాలలో అతనితో కలిసి నటించడం తన అదృష్టంగా భావించింది. 'పర్‌వానా' లో సైగల్ పాటలే ఎక్కువ హిట్టయినా, సురయ్యా పాడిన, 'జబ్ తూహి నహీ అప్ నే' చాలా ప్రసిద్ధి చెందింది. భరత్ భూషణ్ తో 'మిర్జా గాలిబ్ 'లో నటించి అందులో పాటల గానంలో చూపిన పరిణతికి విశేష ప్రశంసలు పొందింది.

'యే న థీ హమారీ కిస్మత్' గజల్ ను చాలా మంది సినిమాల్లోనూ, విడిగానూ పాడారు. కానీ, సురయ్యా పాటకు లభించిన ప్రశంసలు ఎవరికి లభించలేదేమో. స్వయంగా తొలి ప్రధాని జవహర్ లాల్ ఈ పాట విని, 'గాలిబ్ ఆత్మకు జీవం పోశారు' అన్నారట. అలాగే, 'దిలే నాదాన్ తుఝే హువా క్యాహై' 'సుక్త్ చీన్ హై గమె దిలో, ఆహ్ కో చాహియే క్యా' ఈ సినిమాలో సురయ్యా కంఠస్వరం నుంచి వెలువడిన ఆణిముత్యాలు. అయితే సురయ్యా ఆరు సూపర్ హిట్టు సినిమాలు దేవానంద్‌తో కలిసి చేసినవే. వాళ్లిద్దరి జోడి ఆనాటి ప్రేక్షకులకు చాలా ప్రియమైనది. దేవానంద్ తో విడిపోయిన తర్వాత, సురయ్యా నటించిన సినిమాలు ప్రజాదరణ పొందడం కూడా తగ్గింది.

చాలా మంది హిందీ నేపథ్య గాయకుల్లాగే, తనపూర్తి ప్రతిభను వెలికి తెచ్చే పాటలను సురయ్యాకూ నౌషాద్ ఇచ్చారు. అమాయకంగా, విషాదంగా పాడుతున్న సురయ్యాకు 'మే సావన్ రుత్ ఔర్ హమ్' (దాస్తాన్ -రఫీ తో కలిసి) వంటి

పాట ఇచ్చి, ఆమె స్వరంలో పాశ్చాత్య బాణీలు కూడా ఒదుగుతాయని నిరూపించారు. అలాగే, మిర్జా గాలిబ్ లో గులాం మహమ్మద్ సంగీతం, వారిస్ లో అనిల్ బిశ్వాస్ సంగీతం (రాహీ మత్ వాలీ - తూ ఛేడ్ ఎక్ బార్ దిల్ కా సితార్ -ఒక వైపు తలత్ తో కలిసి, రెండో వైపు సోలోగా ) సురయ్యా పాడిన అతి మధురమైన గీతాలు.

లతా మంగేష్కర్ రంగంలోకి దిగిన తర్వాత, సురయ్యా పాటలు తగ్గాయి. తనను ఎక్కువగా ప్రోత్సహించిన నౌషాద్ కూడా లతా కు అవకాశాలివ్వడం ప్రారంభించడంతో సురయ్యాకు బహుశా నిరాశ కలిగివుంటాయి. ఇటీవల ఒక ఇంటర్వ్యూలో నౌషాద్, తమ లత పట్ల ఆదరంతో, ఆమె అద్భుత గానం పట్ల కలిగిన ఇష్టంతో, సురయ్యా ను నిర్లక్ష్యం చేసిన మాట నిజమేనని ఒప్పుకున్నారు. 1963లో సజ్జద్ మల్లిక్ స్వరపరచిన 'రుస్తుం సొహరాబ్ లోని ' యె కైసీ అజబ్ దాస్తా హోగయీ హై- చుపాతే చుపాతే బయా హోగయి హై 'సురయ్యా చివరి దశ పాటల్లో సుప్రసిద్ధమైంది. 'శమా' లో రఫీతో కలిసి పాడిన పాటలు, సోలోలు వింటే, 1960 దశకంలో కూడా ఇంత అద్భుతంగా పాడిన సురయ్యా ఎందుకు విరమించుకుందా అని బాధకలుగుతుంది.

ఎంతో విన సొంపయిన కంఠస్వరం, ఎలాంటి శిక్షణా లేకున్నా, భావ మాధుర్యం, శృతి పరిపక్వతతో మరీ మరీ వినాలనిపించే గాన ఫణితి - అన్నిటినీ మించి, నటి కూడా కావడం- ఇన్ని సుగుణాలున్న సురయ్యా హిందీ చలన చిత్ర రంగానికి చాలా త్వరగా వీడ్కోలు చెప్పడం దురదృష్టకరమైన విషయం. దానికి కారణాలు వ్యక్తిగతమూ కావచ్చు (అన్నింటా అమ్మమ్మగారి జోక్యం), వృత్తి గతమూ కావచ్చు (మంగేష్కర్ సోదరీ మణుల ఆగమనం ). కానీ, తదనంతర కాలంలో గాయకనటిగా కంటే దేవానంద్ ప్రేమించి, పెళ్ళి చేసుకోలేకపోయిన అమ్మాయిగా సురయ్యా ఎక్కువ మందికి గుర్తుండిపోయింది. ఎవర్ గ్రీన్ నటుడు దేవానంద్ ఇప్పటికి తన జీవితంలో నిజంగా ప్రేమించింది ఒక్క సురయ్యానే అని చెప్పుకోవడం మాత్రం అతని నిజాయితీ కి నిదర్శనం. (చాలా మంది నటులు తమ ఇమేజ్ దెబ్బ తింటుందని ఇలాంటి నిజాలు చెప్పరు).

సురయ్యా అవివాహితగా ఉండిపోవడానికి దేవానంద్ ఉదంతం కారణమవునో కాదో తెలీదు కానీ, ఆమె ను దేవానంద్ సందర్భంలో కాక, చాలా చక్కని గాయని గా గుర్తు తెచ్చుకోవలసిన అవసరం ఉంది. రాబోయే తరాలు, తన ఆస్తికి వీలునామా రాయని కళాకారిణిలా గుర్తుపెట్టుకునే ప్రమాదం కూడా ఉంది. ఆమె గురించి ప్రస్తుతం ఇలాంటి చర్చలే జరుగుతున్నాయి. వాటన్నిటికీ మించి, హృదయాలను హత్తుకునే లాలిత్యం, మార్దవం కలిగిన కంఠస్వరం, దానికి తగిన మధురమైన రూపం ఉన్న కళాకారిణిగా, ఇంత మంది తారలు తారా పథంలో వెలిగినా హిందీ లో చెప్పుకోదగ్గ ఏకైక గాయక నటిగా సురయ్యాను స్మరించుకున్నప్పుడే ఆమెకు న్యాయం చేసిన వాళ్లమవుతాం. ఆమె క్యాసెట్లు మళ్ళీ రిలీజ్ చేయడం, ఈ తరం వాళ్ళకు ఆమె పాటలు వినిపించడం ఆమెకు సరైన నివాళి.

**- మృణాళిని**

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1962



ముంతాజ్

ప్రేమ్‌నాథ్-ముంతాజ్ జంటగా నటించిన 'వతాన్' చిత్రం సినీ సంగీతంలో సరికొత్త విప్లవానికి తెరలేపింది. 9 మంది సంగీత దర్శకులు(ఫకీర్ మొహమ్మద్, జిమ్మి అసర్, శంభు, దత్తారాజ్-శ్యాంబాబు, బ్రిజ్ భూషణ్, డేవిడ్, రాజ్‌భూషణ్) స్వరాలను అందించిన (కొన్ని పాటలకు ఇద్దరు కలిసి పనిచేశారు) ఈ చిత్రం మాత్రం మ్యూజికల్‌గా ప్రేక్షకాదరణ పొందలేకపోయింది.

90 వ దశకంలో ఫిల్మ్ ప్రమోటర్స్‌గా కంపెనీలు వస్తే 1962లో సాంగ్స్ ద్వారా కంపెనీలు తమ ఉత్పత్తులకు ఉచిత పబ్లిసిటీని సంపాదించగల్గాయి. 'ఓ డన్‌లప్ జైసే నార్' పాట వాటిలో మొదటిదిగా చెప్పుకోవచ్చు.

బి.డి.బర్మన్(ఎస్.డి.బర్మన్ కాదు) మొహబ్బత్ జిందాబాద్ చిత్రానికి సంగీతాన్నిచ్చారు. అంతకు ముందు ఆయన 50 దశకంలో కొన్ని చిత్రాలకు సంగీతాన్ని ఇచ్చినప్పటికీ ఆయనకు సరైన గుర్తింపు రాలేదు.

'బాజే ఘుంగ్రూ' చిత్రానికి మదన్‌మోహన్(సంగీత దర్శకుడు మదన్‌మోహన్ కాదు) గీత రచయితగా పనిచేశారు. 'సారీ రాత్ జాగీ, లగన్ ఐసీ', 'జానే దే సైయా న బహియాఁ' అనే రెండు గీతాలను ఆయనే రాశారు.

'అన్‌పఢ్' చిత్రానికి మదన్‌మోహన్ అందించిన స్వరాలు ప్రజాదరణ పొందాయి. 'హై ఇసీ మైఁ ప్యార్ ఆబ్రూ','రంగ్ బిరంగీ రాఖీ', 'జియా లే గయో జీ మోరా సాఁవరియా', 'ఆప్ కి నజరోఁ నే సమ్‌జా' పాటలు లతా క్లాసిక్స్‌గా నిలిచిపోతే మహేంద్రకపూర్ గానం చేసిన 'సికిందర్ నే పోరస్ సే కి థీ లడాయ్', కామిక్ పాటగా మంచి పేరు తెచ్చుకుంది. 'మన్‌మౌజీ' చిత్రానికై ఈయన స్వరపరిచిన 'జరూరత్ హై' పాట కిశోర్ హిట్స్‌లో ఒకటిగా నిలిస్తే, 'మైఁ తో తుమ్ సంగ్ ' లతా జెమ్స్‌లో ఒకటిగా నిలిచింది.

'చైనా టౌన్' చిత్రం కోసం రవి స్వరపరిచిన 'బార్ బార్ దేఖో' గీతం సెన్సేషన్ సృష్టించింది. అఫీషియల్‌గా వెస్ట్ ఇండీస్ మ్యూజిక్ గ్రూపు అడాప్ట్ చేసుకున్న తొలిగీతంగా ఈ పాట చరిత్రలో నిలిచిపోయింది.



కైఫీ అజ్మీ

30, 40 దశకాలలో గొప్ప రచయిత అయిన పండిట్ ఇంద్ర తన కెరీర్‌లో చిట్టచివరి చిత్రం 'ఆల్హా ఊదల్' కు పనిచేశారు.

'గ్యారా హజార్ లడ్కియాఁ' చిత్రంకోసం కైఫీ అజ్మీ తనకు మంచి గుర్తింపు తీసుకువచ్చిన పద్యం 'ఔరత్' ను సిట్యువేషన్ సాంగ్ గా మార్చారు. 'మేరే మెహబూబ్ మేరే సాథ్ హీ చలనా హై తుజే' అంటూ సాగే ఈ గీతాన్ని మహమ్మద్ రఫీ గానం చేయగా ఎన్.దత్తా స్వరపరిచారు. ఇదే ట్యూన్ ఉపయోగించి 35 సంవత్సరాల తరువాత 'తమన్నా' చిత్రం కోసం అనూ మలిక్ 'ఉర్ మేరీ జాన్ మేరే సాత్' అంటూ సోనూ నిగమ్ చేత పాడించారు.

(వచ్చే సంచికలో మరికొంత)

## కొంటెకొశ్శెన్లు - తుంటరి జవాబులు

**రమణశాస్త్రి, సంగారెడ్డి**

ప॥ మనం 'పనిదొంగ'లమా?

జ॥ ఎవరామాటన్నది! మన పనే మనం చెయ్యం; పక్క వాళ్ల పనిని దొంగిలించే పని మనకేంటి.



ప్ర॥ ఇరుగుపొరుగు వాళ్ళు?

జ॥ నహాయానికి 'లేనివారు', సలహాలకి 'కలవారు'.

**ఎం.మస్తాన్‌రెడ్డి, విశాఖపట్నం**

ప్ర॥ ఆ వస్తువు లేదని తెలిసినా తెలుగువారందరూ సాధారణంగా పేర్కొంటూ ఉంటారు. ఏమిటది?

జ॥ గాడిద గుడ్డు

**జి.రాజేష్,హైదరాబాద్**

ప్ర॥ ఈసారి ఎన్నికల్లో మీరెవరికి ఓటేస్తారు?

జ॥ 'నేను అధికారంలోకి రాగానే నా ఫోన్ నెంబర్‌ని 3652460గా మార్చుకుంటాను' అని ఎవరు ప్రకటిస్తారో వారికి (అంటే 365 రోజులూ 24 గంటలూ 60 నిముషాలూ ప్రజలకు అందుబాటులో ఉండడం అన్నమాట. ఈమాట చంద్రబాబు నాయుడు గారికి చెప్పమని ఈమధ్యనే తెలుగుదేశంలో చేరిన ఏవీయస్ గారికి చెప్పాం కూడా)

## ఈ రూటేవేరు



పరస్పరం - మన పర్స్ వేరేవాళ్ల పరం కావటం

ఇంటర్వ్యూ - 'ఇంటర్' చదవటం మీద అభిప్రాయం

**- జె.శ్రీకాంత్, రాజమండ్రి**



## చిలిపి లిపి



| | |
|---|---|
| అమీర్‌పేట్ | - ధనవంతుని కడుపు |
| ఉడతాభక్తి | - Squirrel devotion |
| ముఖద్వారం | - Face door |
| ఫలహారం | - Fruit Necklace |

**-బి.శ్రీనివాసాచారి, అమీర్‌పేట్, హైదరాబాద్.**

## పేరు - రిపేరు



ఆమె -అంకుల్- గర్ల్‌ఫ్రెండ్

అతను - రాక్షసుడు -ఆమె- దేవత

చూపులు కలిసిన శుభవేళ- పెళ్లి -ఐతే- ఇక అంతా శుభమే పెళ్లి జరిపించండి

అన్నయ్య- చిరంజీవి

నీతో -ప్రేమ -తొలిచూపులోనే -ఐతే-ఎంజాయ్

**-వై.ధీరజ్‌కుమార్, నందిగామ**

## చిలిపి కవిత



ఉన్నప్పుడు ఓ పెద్దమేడ,
ఉంటే బావుంటుంది కదా 'ఔటు హౌస్' కూడా!
అని అనగానే భగ్గున మండి మా ఆవిడ,
వీధిలోకి విసిరేసింది నా పెట్టేబేడ?!
మేడలు కావాలనుకునే ఆడవారు
ఎందుకు సాగిస్తారిలాంటి వారు (WAR)!?

**-డాక్టర్.నెల్లుట్ల వేంకటేశ్వరరావు, సికింద్రాబాద్**

## డబుల్ రోల్



'దరి'కి రావద్దు 'దరి'ద్రపు ముఖమా!
ఒరేయ్ 'రాజు' ఇలా'రా జు'న్ను తిందువు గాని
నాకు 'ఆయా'సంగా ఉంది 'ఆయా'!

**- ఎస్.శివనారాయణ, కొత్తపేట, ప్రకాశం జిల్లా.**

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| చిట్టా రామ్‌కుమార్ | = | చిరాకు |
| కంపా లక్ష్మినరసింహం | = | కలహం |
| చిల్లర ఫిలిప్స్ | = | చిప్స్ |

**-బి.శ్రీనివాసాచారి, అమీర్‌పేట్, హైదరాబాద్.**

## పేరడీ పేరెడ్



కవి:- తగునా ఇది ఎడిటర్! తమరే ఇటు పల్కనగున
తగునా ఇది ఎడిటర్...
దయాదృక్కులను కలిగిన మీరే ఇటులనదగునా
తగునా ఇది ఎడిటర్...
రచయితనగ నెవడూ మీ పత్రికలకు ప్రియుడూ
మీరు శాలువతో సత్కరింప చేయదగిన ఘనుడూ
ఈఘనుని మీద అలుకబూన ఏటికి చీటికి మాటికి
తగునా ఇది ఎడిటర్...
ఎడిటర్:-ఫో పోర పొమ్మికన్ ఫో పోపోర పొమ్మికన్ నా
కార్యాలయమ్మునకు నీకవిత్వమ్ముతో
ఇక రావలదు రాతగదు చీఫో ఫో పోర పొమ్మికన్
అరరే ఎంతటి సుత్తిగాడవుర సర్కులేషనును దింపినాడవుర
నీ సాహిత్యమూ పరిహాసము నీ సాహిత్యము పరిహాసము
దౌర్భాగ్యపు రచనా వ్యాసాంగము
సహించరు క్షమించరు భరించరు పాఠకుల్
వచ్చిన బాటన్ పట్టుము వేగన్ ఫో పోర పొమ్మికన్
కవి:- యాడ్‌లు లేనందున పేజీలు నింపువాడనే,
కేజిల్తో నింపువాడనే,
డైరెక్టుగా మీ పత్రికను ఉద్ధరించువాడనే,
గ్లామర్లేని కవుల ఉసురు తగలదె
బయటకు గెంటగ ॥తగునా॥
ఎడిటర్:-ఎడిటర్లకెల్ల నే చీఫ్‌నే...
జర్నలిజములోన జంభారినే...
నీ కవితారుఝరీ చాల్చాలోయి సరి
నీ కవితారుఝరీ చాల్చాలోయి సరి
కవివేనని నమ్మితి పోకిరి
దురాత్ముడా దుష్టాత్ముడా గర్వాత్ముడా నీచుడా
ఇపుడె తెలిసెన్ నీపస ఎల్లన్ ఫోఫోర పొమ్మికన్
నా కార్యాలయమ్మునకు నీ కవిత్వమ్ముతో
రావలదు రాతగదు ఛీ ఫోఫో.
('రాముడు- భీముడు' చిత్రంలో "తగునా ఇది మామా"
పాటకు పేరడీగా...)

**-పులిపాక తాజుద్దీన్, జయపూర్ (ఒరిస్సా)**

**ఈ సంచికలోని పేరడీ పేరెడ్‌ని రాసిన పులిపాక తాజుద్దీన్ (జయపూర్) గారికి సోహన్ మ్యూజిక్ వారు 'సంబరం' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN MUSIC



స్వర సుందరి



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
డా॥ పి.బి.శ్రీనివాస్
'హాసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

**ఆ**నాటి సుమధుర గీతాలెన్నిటిలోనో, కొన్ని గీతాలకే లత హృదయం స్పందించింది. పాట ఎంతో బాగుంటేనేకాని, లత మెచ్చుకోలేక పోయేవారు. ఆమె అభిరుచి అంతటి ఔన్నత్యం కలది. ఇటీవలి సంగీతం పట్ల ఆమె అభిప్రాయం ఏమిటో, ఈమధ్య ఒక ప్రముఖ పత్రికలో మొదటి పేజీలోనే ఆమె క్లోజప్ ఫొటో చూడగానే స్ఫురిస్తుంది. కళ్లూ, చెవులూ కూడా మూసుకుని ఆమె అందించిన ముఖకవళికల భంగిమలో ఎన్నెన్నో అంతరార్థాలూ, గూఢార్థాలూ, ద్యోతకమౌతాయి. ఆమె ఎంతటి గొప్ప స్వీట్ సెటైరిస్టో ఆ ఫొటో చూస్తే చాలు స్పష్టంగా విశదమౌతుంది. మాటలు లేకుండానే, సముచిత భంగిమతోనే తన మనోగతాభిప్రాయాలని వెలువరించడం, లతకేచెందిన ప్రత్యేక సామర్థ్యం.

మదన్ భైయ్యా అని ఎప్పుడూ తన ప్రత్యేకాభిమాన సంగీత దర్శకుడి గురించి ఆమె తఱచూ ముచ్చటించటం కద్దు. మదన్‌మోహన్ కీ లత గానం అంటే ప్రాణం. తన పాటకి లత అందించిన జీవం ఆయన కళ్లల్లో నీళ్ళు నింపేది. లత ని 'బేటీ'అని సంబోధించి ప్రశంసించే వారట తనకి అమితంగా నచ్చిన రీతిగా ఆమె పాడినప్పుడల్లా "ఆయనకి నేను పాడిన పాటలన్నీ నాకిష్టమైనవే, కాని వాటిలో కొన్ని అధికంగా పాప్యులర్ అయ్యాయి. అయినా ఆయన శక్తి సామర్థ్యాలకి అనుగుణంగా ఆయనకి గుర్తింపు రాలేదనే నా బాధ. ఆయన పరమపదించిన పిదపగానీ, ఆయన సంగీత సృష్టిలోని ఘనత జనతకి అవగాహన కాలేదు" అని లత తన బాధని వ్యక్తపరిచారు అనేక సందర్భాల్లో, 'నైనాబర్‌సే'పాట రికార్డింగు సమయాన లతాకి సుస్తీ చెయ్యడంవల్ల ఆమె వచ్చి పాడలేదట. అందువలన షూటింగు సమయంలో 'లతా' పోర్షన్ అంతా మదన్‌మోహన్ తనే పాడారట - హీరోయిన్ సాధన పై చిత్రీకరింపబడుతున్న పాట మగ గొంతులో రావటం విని షూటింగు సమయాన అందరూ విస్తుపోయారుట - తరవాతనే మదన్ మోహన్ గొంతుకి బదులుగా లతా గొంతుతో పాటని రికార్డు చేశారట. ఇలాంటి సన్నివేశాలు చిత్ర సీమలో అప్పుడప్పుడూ జరుగుతూ వుండడం కద్దు. డైరెక్ట్ పిక్చర్స్‌లో కూడా డబ్బింగు విధానం తప్పదు. లక్ష్మీకాంత్ ప్యారేలాల్‌కి రాజ్‌కపూర్ కంపెనీలో ప్రవేశం కలిగించిన ఘనత లతామంగేష్కర్‌దే. సాధారణంగా కేబరేడాన్సు సాంగ్సు పాడడం లతాకి ఇష్టం లేదు. ఆశాభోంస్లే ఆ పాటలకి ప్రత్యేకించబడిన గాయని ఆ రోజుల్లో. తనకలాటి పాట ఇవ్వరాదని లక్ష్మీకాంత్‌తో చెప్పినా ఒక కేబరే పాట ఆమెయే పాడి తీరాలని లక్ష్మీకాంత్ పట్టుపట్టారు. అంతేకాకుండా ఆ సన్నివేశానికి తగ్గట్టుగా ఆ పాట లత ఎలా పాడితే ఉత్తమంగా రూపొందుతుందో, అలా ట్యూన్ కట్టివ్వాలంటే ఏమాత్రం తోచని రీతిగా లతాచేత పాడించుకున్నారు. చిత్రంలో ఆ పాట హెలెన్ డాన్సుతో మరీ రక్తి కట్టింది. ఆ పాట ఆనాడు ఎంత పాప్యులరో ఈనాడూ అంతగానే ప్యాపులర్. కారణం లతా ఆ పాటకి అందించిన జీవంలోగల ప్రత్యేకత. "ఇంతకాం"అనే చిత్రంలో "ఆ జానేజా౹" అనే ఆ పాట కేబరే పాటలకే మకుటాయమానంగా రూపుదిద్దుకుంది. నిజానికి లతా పాడలేని పాటే లేదు అని ఘంటాపథంగా చెప్పొచ్చు.



'పాకీజా' చిత్రంలో మీనాకుమారి

కమాల్ అమ్‌రోహీ మీనాకుమారి కోసమనే తీసిన చిత్రం పాకీజా - దానికి గులాం మహమ్మద్ సంగీతం. పాటలన్నీ పాపులర్ అయ్యాయి. ముఖ్యంగా "ఠాడే రహియో, ఇన్హీలోగోఁనే" అనే రెండు పాటలు బ్రహ్మాండమైన హిట్లు... కాని ఆ చిత్రంలో లతకి నచ్చిన పాట వేరొకటి. "చల్‌తే చల్‌తే" అనే మంచి స్వింగు గల ట్యూనూ, రిథమూ ఆ పాటకి వన్నె చేకూర్చాయి.

తన గాత్రం ఏ మాత్రం బాగులేదని, ఉదయాన్నే అనిపిస్తేచాలు ఆనాటి రికార్డింగు హుళక్కే. ఫోను చేసి తను రావటంలేదని చెప్పేసేవారామె. అందుచేతనే ఆమెని గురించి కొందరు విమర్శించేవారట - "ఓపట్టాన

రానేరాదు - వచ్చినా పాడదు ఇష్టంలేకపోతే" అని. దానికి సమాధానంగా లత చెప్పేదేమిటంటే తన గొంతు బాగా లేదని అనిపించినపుడు రికార్డింగు రద్దు చేసినపుడు కొన్ని వందలమందికి ఇబ్బంది కలగవచ్చు. కాని బాగులేని గొంతుతో పాడి ఓ పాటనిగాని పాడుచేస్తే, బాధపడేవారూ, ఇబ్బంది పడే శ్రోతలు వేలల్లోనూ లక్షలలోనూ వుంటారు. అల్లాంటప్పుడు రికార్డింగు కేన్సల్ చెయ్యడమే బెటర్‌కదా అని "లతా" అభిప్రాయం! ఇలాంటి సెటైర్‌లో లతకిసాటి లతయే.

లతామంగేష్కర్ అనే దివ్యాంగన ఉత్తమ ప్రతిభావంతురాలేకాక, గొప్ప అదృష్టవంతురాలు కూడా. డబ్బుగడించడంలోనూ సత్కీర్తి సంపాదించుకోవడంలోనూ, లతని మించిన వారూ మించేవారూ లేరంటే అది పదహారణాల పచ్చి నిజం.

లత స్కూల్‌కి వెళ్లినది ఒకేఒక రోజున. కాని యూనివర్సు యూనివర్సిటీలో ఆమె చదివిన అనుభవ పాఠాలు కోకొల్లలు. అందుచేతనే కాబోలు, ఈ చదువుకోని మహామేధావికి, ఆరు విశ్వవిద్యాలయాలు పోటీపడి మరీ గౌరవ "డాక్టరేటు" ఉపాధి అందజేశారు. వాటిలో న్యూయార్కు యూనివర్శిటీ ప్రత్యేకంగా పేర్కొన దగినది. 20వ శతాబ్దపు ఉత్తమ వనితగా లతా ఎన్నుకోబడడం ఆమె అభిమానులందరికీ ఆనందదాయకం. "పరిపూర్ణమైన గళస్వరం" అంటే లతా గాత్రమేనని లండన్‌లోని రాయల్ ఆల్ బర్ట్ హాల్‌లో కంప్యూటర్‌ద్వారా నిరూపించ బడినదట. అగణిత సంగీత ప్రేమికులు ఎవరి పాట అంటే ప్రాణాధికంగా ప్రేమిస్తారో అటువంటి లతాకి ఇష్టమైన విషయాలూ, వ్యక్తులూ, ఏవేవో, ఎవరెవరో తెలుసుకునేందుకు ఆమె అభిమానులందరూ ఇష్టపడతారు.

లతని మెప్పింపచేసిన వివరాలలో ముఖ్య మైనవి కొన్ని - పండుగలలో "దీపావళి". నగలలో వజ్రాలు పొదిగినవి - పట్టణాలలో న్యూయార్కు, ఇండియన్ సిటీస్‌లో - ముంబైగా మారిన బాంబే - రంగులలో పరిశుభ్రమైన తెలుపు - హాబీలు -వంటవండడం, ఫొటోగ్రఫీ - క్రీడారంగంలో టెన్నిస్, ఫుట్‌బాల్, క్రికెట్ - గీతరచయితలలో - సాహిర్‌లూధియాన్‌వీ, షకీల్ బదాయూనీ, మజ్‌రూహ్ సుల్తాన్‌పురీ, నీరజ్, నఖ్‌శలాల్‌పురీ - శైలేంద్ర - సంగీత దర్శకులలో - మదన్‌మోహన్, సలీల్‌చౌధరి, జైదేవ్, చిత్రనిర్మాతలలో - సత్యజిత్ రాయ్, బిమల్‌రాయ్ గురుదత్ - నేపథ్యగాయకులలో - నూర్‌జహాన్ & కె.ఎల్.సైగల్ - శాస్త్రీయ సంగీత గాయకులలో - ఉస్తాద్ బడేగులాం అలీఖాన్, ఉస్తాద్ అమీర్‌ఖాన్ - చిత్రాలలో - గాన్‌విత్ ది విండ్ (ఆంగ్లం) లైమ్‌లైట్ (చార్లీచాప్లిన్),టైటానిక్ పడోసిన్ - లతగాత్ర ప్రత్యేకత- అనేకమంది గాయనీగాయకులు రెండు లేక రెండున్నర స్థాయిలలో పాడగలరు. కాని లతా గళానిది మూడు స్థాయిల రేంజ్. హైపిచ్‌లో కూడా లోపిచ్‌లో గల వాల్యూమూ, బలమూ, చెక్కు చెదరకుండా, ఆలాపించగలగడం. ఒక అద్భుత విషయం ఏమిటంటే లత గొంతుని కాపాడే ఆహారంలో కొల్హాపూర్ మిరపకాయల ఆధిక్యం. ఆహారవిషయంలో ఆమె తప్పకుండా పాటించే కొన్ని నియమాలూ,ఎల్లలూ -

ఆమె చాలా ఇష్టపడే ఒక వస్తువు - చూయింగ్‌గమ్. - సువాసన ద్రవ్యాలతో 'అత్తరు' ఆమెకి ఎక్కువ మక్కువ. లతా పేరిట ఒక అత్తరు ప్రత్యేకంగా పరిచయం చెయ్యబడింది ఒక వ్యాపారసంస్థ చేత. లతా కోరికలలో ముఖ్యమైనది, మళ్లీ జన్మంటూ వుంటే ఇండియన్‌గా, మహారాష్ట్రలో పుట్టాలి. కాని ఆడదానిగా మాత్రం కాదు.

లతామంగేష్కర్ పేరిట ఒక ఎవార్డు (పురస్కార్) నెలకొల్పబడింది మధ్యప్రదేశ్ ప్రభుత్వంచేత. ఆ అవార్డు అందుకున్నవారిలో, అనిల్ బిశ్వాస్, నౌషాద్ అలీ, కిశోర్ కుమార్, జైదేవ్, మన్నాడే, ఆశాభోన్స్లే, ఖయ్యూం ప్రభృతులు ఉదాహరణీయులు. తన గాత్రం సాయిరాబానుకి చాలా బాగా సూట్ అవుతుందని అనిపిస్తుందట లతా మనసుకి. లత తండ్రి దీనానాథ్‌కి కొన్ని నమ్మకాలు వుండేవి. ముఖ్యంగా ఇంగ్లీష్ అక్షరాలలో H అనే అక్షరం

## మీకు తెలుసా?

✦ లతా చేత ఎంతో ఆదరింపబడ్డ లక్ష్మీకాంత్ ప్యారేలాల్‌లు 1992లో విడిపోవడానికి కారణం తెలుసా? లతా యే!

1992 నాటికి లతా గొంతు మాధుర్యం కోల్పోతోంది కాబట్టి వేర్వేరు గాయనీమణులను ప్రోత్సహించాలని లక్ష్మీకాంత్ అభిప్రాయం.

తొలినుండీ తమను ఆదరిస్తూ వచ్చిన లతాను కాదని వేరేవారిచే పాడించడం కృతఘ్నత కింద వస్తుందని, ఆమె గొంతు ఇంకా బాగానే ఉందనీ ప్యారేలాల్ ఉద్దేశ్యం.

✦ 'హమ్‌రాహీ' సినిమాలో 'ముఝ్‌కో అప్‌నీ గలే లగాలో, ఐ మేరే హమ్‌రాహీ' అనే టైటిల్ సాంగ్ గుర్తుండే వుంటుంది. ఆ పాటను జైకిషన్ లతా, రఫీలచే పాడిద్దామని ప్లాను చేశాడు. కానీ లతాకు అప్పుడు జైకిషన్‌పై కోపంగా ఉంది. పల్లవి అనే అమ్మాయిని జైకిషన్ పెళ్లాడడం లతాకు నచ్చలేదు. అందువల్ల పాట పాడనంది.

కానీ ముందుగా పాట రికార్డు చేయించి పెట్టుకుంటే లతాకు నచ్చచెప్పి పాడించవచ్చన్న ధైర్యం జైకిషన్‌ది. వేరెవరైనా ప్రఖ్యాతులచే పాడిస్తే తీయడం కష్టమని ముబారక్ బేగంచే పాడించి రికార్డు చేయించి లతాకై ఎదురుచూశాడు జైకిషన్. కానీ లతా డబ్బింగ్‌కు రాకపోవడంతో గత్యంతరం లేక ముబారక్ వెర్షన్‌నే ఉంచేశాడు. కానీ ఆ పాట ఎంతో హిట్ అయింది!

✦ వివిధభారతిలో విశేష్ జయమాలా కార్యక్రమంలో సినీ రంగంలో ప్రముఖులు వచ్చి మాట్లాడి తమకిష్టమైన పాటలు వినిపించేవారు. అలా ఓసారి ఓ.పి.నయ్యర్‌ను పిలిచారు. లతాతో వృత్తిపరమైన వైరం తప్ప వ్యక్తిగత వైరం లేని నయ్యర్ ఆ కార్యక్రమంలో లతా పాట ఒకటి వేద్దామనుకున్నాడు. 'రాధా నా బోలే నా బోలే (అజాద్) వేద్దామా, 'తుమ్ క్యా జానో తుమ్హారీ యాద్ మే' (షిన్ షినాకే బబ్లా బూ) లలో ఏది వేద్దామా అని ఊగిసలాడి చివరకు రెండోది వేశాడు.

లతాకు ఆ ఛాన్సు వచ్చినప్పుడు ఓ.పి.నయ్యర్ పాట 'యే హై రేశ్‌మీ జుల్ఫోంకా అంధేరా' (మేరే సనమ్) ప్రసారం చేసింది కానీ సి.రామచంద్రది ఒక్కటి కూడా వేయలేదు. కానీ విదేశీ పర్యటనలలో రామచంద్రను విస్మరిద్దామంటే మాత్రం కుదిరేది కాదు. 'యే జిందగీ ఉసీ కీ హై' (అనార్కలి) పాడమని శ్రోతలు పట్టుబట్టి నెగ్గేవారు. కళాకారుల మధ్య వెయ్యి గొడవలుండుగాక, రసజ్ఞుడికి కావలసినది మంచిపాట, అంతే!

✦ లతా విదేశీ పర్యటనలు ఆమెకు ఎంతో డబ్బు సమకూర్చాయి. 1974లో లండన్‌లోని రాయల్ ఆల్బర్ట్ హాలులో నెహ్రూ మెమోరియల్ ఫండ్‌కై పాడిన నుండి ఆమెకు ఫారిన్ ప్రోగ్రాంలలో తన డిమాండ్ తెలియవచ్చింది. తన ప్రోగ్రాం 'లైవ్' రికార్డుల అమ్మకాలపై 10 శాతం రాయల్టీ పొందసాగిందామె!

1989 ప్రాంతాలలో ఇండియాటుడే ఇచ్చిన వివరాల ప్రకారం చూడబోతే స్వంతంగా సంగీతాన్ని కూర్చి అందించిన కచ్చేరీకి రవిశంకర్‌కు 1000 డాలర్లు ఆదాయం వస్తే, నౌషాద్, రామచంద్ర, బర్మన్ ఇత్యాదులు కూర్చిన పాటలు పాడినందుకుగాను లతా ఆదాయం కచ్చేరీకి 15వేల డాలర్లు!

- కమ్యూనికేటర్ ఫీచర్స్

# ఓపి నయ్యర్ -



ఓ.పి.నయ్యర్ లతాచే ఎందుకు పాడించలేదన్న సంగతి ఎవ్వటికీ ఆసక్తి కలిగించే విషయమే!

అక్టోబరు 16-31, 2003 సంచికలో యమ్.బి.యస్.ప్రసాద్‌గారు రాజు భరతన్ రిఫరెన్స్ ఇస్తూ "మెహబూబా" సినిమాకై రోషన్ బదులుగా నయ్యర్‌ను నియమించడంతో లతా కినిసి నయ్యర్‌కు పాడనని స్టేటుమెంటు ఇచ్చిందని రాశారు. నవంబరు 1-15,2003 సంచికలో శ్రీ విష్ణుభొట్ల ఉదయ్ భాస్కర్ గారు "ఆస్మాన్"(1952) చిత్రానికై అనిల్ బిశ్వాస్‌ను తొలగించడం వల్ల తనకు, లతాకు అభిప్రాయ భేదం వచ్చిందని నయ్యర్ తనతో స్వయంగా చెప్పారని రాశారు.

నాకు తెలిసిన వివరాలను పాఠకుల ముందుంచుతున్నాను. "ఆర్‌పార్" (1954) చిత్రం "ఓ.పి.నయ్యర్ వేవ్" ను సృష్టించడంతో పంపిణీదారుల వత్తిడి కి లొంగి అంతవరకే కొన్ని పాటలు రికార్డు చేసిన ప్రముఖ సంగీత దర్శకులను తొలగించారు

అలా జరిగిన చిత్రాలు, ఒరిజినల్‌గా అనుకున్న సంగీతదర్శకులు, వారు అప్పటికే రికార్డు చేసిన పాటల సంఖ్య -

1. మహబూబా(54)- రోషన్ - 4
2. మంగూ (54) మహమ్మద్ షఫీ - 3
3. బాప్‌రేబాప్ (55) - సి.రామచంద్ర - 3
4. సబ్‌సే బడా రుపయ్యా(55) - నౌషాద్ - 4
5. ఢాకే కి మల్‌మల్ (50) - రాబిన్ చటర్జీ - 1

ఈ ఐదు చిత్రాల్లో ఒక్క "మెహబూబా"చిత్రంలో మాత్రం లతా పాడిన నాలుగు పాటలున్నాయి. అందువల్ల గొడవ వస్తేగిస్తే "మెహబూబా" సినిమా విషయంలోనే రావాలి. అదీ "ఓపి నయ్యర్ వేవ్" విషయంలోనైతే!

ఇక "ఆస్మాన్" చిత్రం సంగతి చూడబోతే - అసలు ఈ చిత్రానికి ఒరిజినల్ సంగీత దర్శకుడు అనిల్ బిస్వాస్ అని మొట్టమొదటిసారి వింటున్నాము! ఈమధ్య వివిధభారతిలో ప్రతి ఆదివారం "దాస్తాన్ నయ్యర్" అనే సంగీత కార్యక్రమం ప్రసారమవుతూంది. 11-1-2004నాటి కార్యక్రమంలో ఓ.పీ.నయ్యర్ తాను అమృత్‌సర్‌లో వుండగా తన స్నేహితుడు "ఆస్మాన్" చిత్రనిర్మాత ప్రోద్బలంపై తనకు టెలిగ్రామ్ ఇవ్వగా బొంబాయి వచ్చానని అప్పుడు ఆ చిత్రానికి సంగీతం ఇవ్వడానికి ఒప్పందం జరిగిందని చెప్పాడు. ఇక్కడ నయ్యర్ నామమాత్రంగా కూడా అనిల్‌బిశ్వాస్ ప్రస్తావన తీసుకురాలేదు.

కొన్నాళ్లక్రితం జీటీవీ టివిఎస్‌సరిగమా మెగా ఫైనల్ సంగీత కార్యక్రమంలో న్యాయనిర్ణేతగా పాల్గొన్న ఓ.పీ.నయ్యర్ తాను "ఆస్మాన్" చిత్రానికి సంగీతం సమకూర్చే కొత్తలో తనను ఆ చిత్ర గీతరచయిత ప్రేమ్‌ధవన్ తన కారులో అనిల్ బిశ్వాస్‌గారింటికి తీసికెళ్లి పరిచయం చేయించారనీ తెలిపాడు. ఈ కార్యక్రమానికి నయ్యర్‌తో పాటు అనిల్‌బిశ్వాస్, ప్రేమ్‌ధవన్,నౌషాద్,కల్యాణ్‌జీ, ఖయ్యామ్, రాజ్‌కుమారి ఇతరులు న్యాయనిర్ణేతలుగా విచ్చేశారు. ఈ సందర్భంలో కూడా నయ్యర్ తన మొదటి చిత్రం "ఆస్మాన్"కు ఒరిజినల్ సంగీత దర్శకుడు అనిల్‌బిశ్వాస్ అని తెలుపలేదు.

ఇక్కడ ఇంకో విషయం ప్రస్తావించాలి. "ఆస్మాన్" (52) కంటె ముందు "కనీజ్" (49) అనే చిత్రానికి తాను కేవలం పార్శ్వసంగీతం సమకూర్చాననీ, ఆ చిత్రానికి కొన్ని పాటలు స్వరపరిచిన గులాం హైదర్ మధ్యలో పాకిస్తాన్ వెళ్ళిపోగా మిగతా పాటలను హంస్‌రాజ్ బెహల్ స్వరపరిచాడనీ ఓ.పి.నయ్యర్ ఓ సారి తెలిపారు.

అత్యంత ప్రియం. అందుకే 'లత'కి మొదట 'హేమ'అనీ తదుపరి ముద్దుపేరుగా 'హృదయ'అనీ, అటు పిమ్మటనే 'లతిక'అనీ, చివరికి 'లత'అనీ ఆయన సంబోధించేవారు. కాని తమ కుటుంబం గోవాలోని 'మంగేశి'అనే చిన్న గ్రామానికి చెందినదవడం చేత ఆయన 'లత'పేరుకి మంగేష్కర్ అనే పదంకూడా జోడించారట. దీనానాథ్‌మంగేష్కర్‌లో రెండు "హెచ్"లు వున్నాయి. LATHA MANGESHKAR అని రాస్తే రెండు హెచ్‌లున్నాయి.

" HRIDAYANATH MANGESHKAR"అసలు మంగేష్కర్‌ల ఇంటిపేరు "హర్డేకర్" పేరులో కూడా మూడు హెచ్‌లు వున్నాయి. ఇది ఒక అపురూపమైన ప్రత్యేకత. ఆశాభోంస్లేలో కూడా రెండు హెచ్‌లున్నాయి. వివాహానంతరము కూడా. ముందూ ఆశా మంగేష్కర్‌గా వున్నప్పుడు కూడా హెచ్‌లు రెండే. దీన్ని బట్టి మనకి తోచే విషయం ఏమిటంటే దీనానాథ్‌కి "హృదయం" అనేది ఎంత ముఖ్యమో అనే నిజం. నేను తరుచూ అంటూ వుంటాను A good HEART is Greater than the Greatest Brain అని. అరచేతిలోని రేఖల్లో కూడా, హృదయరేఖది, మస్తిష్క (Brain) రేఖకన్నా ఉన్నతస్థానం. అది భగవత్సంకల్పమే నిస్సందేహంగా.

మంచి హృదయం గల ఉత్తమ గాయని లతామంగేష్కర్‌కి, భారత ప్రభుత్వం అందించే ఉత్తమ జాతీయ బహుమానం "భారతరత్న" లభించడం ఎంతైనా సమంజసం. ఇందిరాగాంధీ, మదర్‌థెరీసా, అరుణా అసఫ్ ఆలీ, ఎం.ఎస్. సుబ్బలక్ష్మి గార్ల తరువాత "భారతరత్న" అందుకున్న అయిదవ భారతీయ మహిళా రత్నం, లతా మంగేష్కర్ అనే నిరుపమాన వనితామణియే. నిజం చెప్పాలంటే, ఏ బిరుదుకైనా "లతా మంగేష్కర్ అనే పదమే బిరుదు అని అనడం అన్ని విధాలా సబబు. బారత దేశ చరిత్రకే వన్నె తెచ్చిన సంగీత సరస్వతీ అవతారం లతా మంగేష్కర్."

హిందు దేశం మొత్తంలో "భారతరత్న" "దాదాసాహెబ్‌ఫాల్కే" ఎవార్డులు రెండూ అందుకున్న ఇద్దరు వ్యక్తులు - సత్యజిత్‌రాయ్ మరియు లతా మంగేష్కర్. ఇద్దరికిద్దరూ మహోన్నత చరిత్రని సృష్టించిన మహనీయులే.

అయితే, తెలియనివారు కొంతమంది, అంతులేని ధనం ఆర్జించిన 'లత'దేశానికి ఏమంత గొప్ప సేవ చేసింది అని టేకిస్తూ వుంటారు వక్రదృష్టితో. 'లత'దేశానికి అందించిన 'దీనానాథ్' హాస్పిటల్ ఒకటేచాలు ఆమె చేసిన ప్రజాసేవకి నిదర్శనంగా దీనులందరికీ ఉచిత చికిత్స అందించడం ఆ ఆస్పత్రి లక్ష్య ప్రత్యేకత. తన తండ్రి స్మృతి చిహ్నంగా, లత నిర్మించిన "ఆస్పత్రి" దేశమంతటికీ మహోపకారం

మరి ఉదయభాస్కర్‌గారిచ్చిన సమాచారం మాటేమిటి? అనుకోకుండా ఓ.పి.నయ్యర్‌గారే పొరబడ్డారా? ఇక్కడ లతా బయాగ్రఫీ రాసిన హరీష్ బిమానీ కథనం గుర్తు చేసుకోవాలి -

'ఆస్మాన్ చిత్రనిర్మాత ప్రోద్బలంపై లతా ఓ.పి.నయ్యర్ సంగీత దర్శకత్వంలో "ఆస్మాన్" చిత్రానికి పాడడానికి అంగీకరించింది. కాని రిహార్సల్ రోజు ఆమెకు చాలా రికార్డింగ్‌లున్నందున అవన్నీ పూర్తిచేసుకునేసరికి చాలా పొద్దుపోయింది. నయ్యర్‌గారి రిహార్సల్‌కి వెళ్ళలేక పోయింది. మరుసటి రోజుకూడా ఇదే జరిగింది. ఇలా వరుసగా రెండు మూడు రోజులు జరగడంతో నయ్యర్ ఇది అవమానకరంగా భావించి అసలు ఏమి జరిగిందో విచారించకుండా చిత్ర నిర్మాత పంఛోలీ గారికి గట్టిగా ఫిర్యాదు చేశాడు. అప్పటికే ఈ విషయాన్ని గోరంత కొండంతలయింది. దాంతో తరువాత వారిద్దరు కలిసి పనిచేయడానికి వీలుపడలేదు.' ఈ విధంగా జరిగిందని లతా తనతో చెప్పినట్లు హరీష్‌బిమానీ రాశారు.

# - లతా

"ఆస్మాన్" చిత్రంలో ఆడగొంతుకలో మొత్తం ఐదు పాటలున్నాయి. వీటిలో నాలిగింటిని గీతాదత్ పాడగా మిగతా ఒక పాటను ("మొహే నిందియా చురాలేగయే") అప్పటి ప్రఖ్యాత గాయని రాజ్‌కుమారి పాడింది. ఈ పాట చాలా కష్టతరమైనదనీ, మొదట లతాను దృష్టిలో పెట్టుకొని ఈ పాటను స్వరపరచడం జరిగిందని పాత జ్ఞాపకాలను గుర్తుచేసుకుంటూ రాజ్‌కుమారి తనకీ విషయాన్ని చెప్పినట్లు హరీష్‌బిమాని రాసారు.

"బిమానీ" రాసినదాంట్లో నిజముందనిపిస్తుంది. సయీ పరాంజపే తీసిన "సాజ్" (1997) సినిమా ఓపీ - ఆశా- లతాల నిజజీవితాలను ఆధారం చేసుకుని తయారయిందని వార్తలు వచ్చిన సందర్భంగా లతా ఇంటర్వ్యూ కూడా ఒకటి "డక్కన్ క్రానికల్"లో కిరణ్మయి పేరిట ప్రచురితమైంది. ఇందులో "నయ్యర్‌కి మీరెందుకు పాడలేదు?" అనే ప్రశ్నకు లతా ఇచ్చిన సమాధానం - "కుదరలేదు! ఒక సారి రికార్డింగ్ కూడా నిశ్చయ మైంది. కాని వీలుపడలేదు."

మరి "లతాచే ఎందుకు పాడించలేదు?" అనే ప్రశ్నకు నయ్యర్ ఇవేమీ ప్రస్తావించడు. "లతా గొంతు సుతి మెత్తగా, సున్నితంగా వుంటుంది. నా సంగీతం సమ్మోహ పరిచేవిధంగా, సెడక్టివ్‌గా వుంటుంది. అందుకని ఆమె గొంతు నా సంగీతానికి సరిపడదు." అంటాడు.



షుమారు 75 చిత్రాల్లోని అయిదారువందల ఓ.పీ. పాటల్లో ఒక్క పాటకు కూడా అతని సంగీతానికి లత కంఠం సరిపోదా!? ఒకటేమిటి, నా దృష్టిలో యాభైకి మించిన పాటల్లో సరిపోతుంది! మచ్చుకి "బోలో పర్‌దేసియా (మంగూ), "ఛోటాసా బాల్‌మా" (రాగిణి), "రాతోంకో చోరీచోరీ" (మొహబ్బత్ జిందగీహై), "మై పియా అఖియా మీచే" - "అకేలీ హూం మై పియా ఆ" (సంబంధ్). "ఆస్మాన్"లో రాజ్‌కుమారి పాడిన "మొహేనిందియా చురాలేగయే"గురించి చెప్పనే అక్కరలేదు.

నయ్యర్ లతా చేతనే కాదు, పూర్‌మాన్స్ లతా అని పిలుచుకునే సుమన్ కళ్యాణ్‌పూర్ (లతా,రఫీ ఘర్షణ కొనసాగుతున్నప్పుడు ఎస్.డి బర్మన్, శంకర్ - జైకిషన్ వంటివారు రఫీతో యుగళ గీతాలకు, సోలో గీతాలకు లతాకు బదులు సుమన్ కల్యాణ్‌పూర్‌ను వాడుకున్నారు)చేత కూడా పాడించడం మానేశాడు. "ఆర్‌పార్" చిత్రంలో గీతా,రఫీతో బాటు "మొహబ్బత్ కర్‌లో జీ భర్‌లో" అనే పాటలో సుమన్ కల్యాణ్‌పూర్ ఒకేఒక చరణం పాడుతుంది. ఈ చరణం సినిమాలో మాత్రమే వుంటుంది. కాని రికార్డుపై లేదు. కాని "ఆర్‌పార్" తరువాత ఓ.పీ.సుమన్ కల్యాణ్‌పూర్‌తో ఎపుడూ - ఆశాతో విడిపోయిన తర్వాత కూడా - పాడించలేదు.

కారణాలేమైనా, వీరిద్దరు కలిసి ఎందుకు పనిచేయకపోవడానికి కారణం ఇగో ప్రాబ్లెమ్ అనిపిస్తుంది. వీరిద్దరూ ఒకరి ప్రతిభ ఇంకొకరు గుర్తించడమేకాక ప్రశంసిస్తారుకూడా. అయినా కలిసి పనిచేయలేదు. దానివల్ల వారిద్దరిలో నష్టపోయిందెవరాన్న ప్రశ్న నాబోటి వారిని బాధిస్తుంది. ఒకసారి వి.ఎ.కె రంగారావుగారిని అడిగితే ఆయనన్నారు - "ఇద్దరూ కాదు. నష్టపోయిందల్లా సంగీత ప్రియులూ, శ్రోతలూ!"

**- సత్తూర్ రాజగోపాల్**

కావిస్తోంది. లతామంగేష్కర్ మెడికల్ ఫౌండేషన్, ఒక అద్వితీయ చికిత్సాసంస్థ. లతా చేసిన గుప్త దానాలు అగణితాలు. వాటికి పబ్లిసిటీ ఇవ్వకుండా వుండడం లత గొప్పతనానికి సంపూర్ణ సంకేతం.

1947లో లత పాడిన మొదటి హిందీపాట "ఆప్ కీ సేవామేఁ' అనే చిత్రంకోసమే. అందువలననే కాబోలు లతా సంగీత ప్రతిభా పారవాలు, రసజ్ఞ సంగీత ప్రియుల సేవకే అంకితమై, వినియోగింపబడుతూ వున్నది ఈనాటికీ.

లతా మంగేష్కర్‌లో నాటిన "పట్టుదల" (దీక్ష) ఆమె విజయాలన్నిటికీ మొదటి కారణం. లత మహారాష్ట్ర మహిళ. ఆమె ఆదిలోనే పాడవలసివచ్చిన పాట "అందాజ్"లోని గజల్ "ఉఠా ఏజా ఉన్‌కే సితం". దిలీప్ కుమార్‌కి సంపూర్ణ సందేహం ఆమె నిర్దుష్టంగా ఉర్దూలో పాడగలదా అని. నౌషాద్‌కి కూడా కొంత సందేహం



దిలీప్‌కుమార్

వున్నా ఆమె స్థిర ప్రజ్ఞని గుర్తించి వుండడం వల్ల ఏదో చెప్పలేని నమ్మకం. ఆమె తప్పకుండా గజల్ గానంలో అపూర్వ విజయం సాధించగలదని దిలీప్ కుమార్ చేసిన గేలి ఆమె పట్టుదలని మరింత పెంచింది. ప్రత్యేకంగా భాష నేర్చుకొనేందుకు ఒక ఉస్తాద్ వద్ద శిష్యరికం చేసి ఎవరూ నమ్మలేనంతగా ప్రావీణ్యం సంపాదించిన లత పాడిన గజల్స్, సినీమాల లోవేకాక, ప్రైవేటు ఆల్బమ్స్‌లో కూడా ప్రఖ్యాతినీ ప్రశంసలనీ గడించాయి.

ఉర్దూలో ఆమెకుగల ప్రత్యేక పరిజ్ఞానమే కారణం. నా మొదటి గజల్‌విని, "సాకీ" అనే పదంలో నేను కాఫ్‌లనే అక్షరాన్ని ఉచ్చరించిన విధానం పొందగలిగిన అభినందనకి. - మహారాష్ట్ర భాషలో ఎంత ప్రవీణురాలో ఉర్దూలో కూడా అంతగానిష్ణాతురాలైన లత అత్యంతా భినందనీయురాలు. (ఇంకావుంది)



ప్రముఖ దర్శకుడు
**శ్రీ సింగీతం శ్రీనివాసరావు**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**కరిజ కథలు 7**

# నేపథ్యం



మనుష్యుల్లో దేవుళ్ళూ ఉన్నారు. దానవులూ ఉన్నారు. కానీ వారిని గుర్తించేదెలా? పురాణాల్లో ఎవరు ఎవరన్నది స్పష్టంగా రాసుంది. కానీ రోజూ కనిపించే వారిలో ఈ తేడా తెలుసుకోవడం ఎలా? సామాన్య పౌరునికయితే ఇది తెలుసుకోవడం అనవసరం. కానీ మంత్రి స్థానంలో వున్న వారికి అలా కుదరదుగా! అందుకనే మంత్రిగారికి కొందరి వ్యక్తుల స్వభావాలవల్ల రాచకార్య నిర్వహణలో కొన్ని సమస్యలు ఎదురౌతాయి. అలాంటి సమస్య ఒకటి ఇప్పుడు మంత్రిగారి నెత్తిమీద పడింది.

నగరంలోని తూర్పుపేటలో నివసించే వారిలో రెండు తెగలు. ఒక తెగకు పెద్ద కోరమీసాల కోటయ్య. మరొకదానికి మిడిగుడ్ల సిద్ధయ్య. పేటలో వీర్నెవరు చూసినా జడుసు కుంటారు. మామూలుగా కలుసుకున్నప్పుడు ఇద్దరూ చిరకాల మిత్రుల్లా ఒకరిమీద ఒకరు ఛలోక్తులు విసురుకుంటారు. అందరితోనూ సరదాగానే ఉంటారు. అయినా అందరికీ వాళ్ళను చూస్తే భయం. "అమ్మో! వాళ్ళు రాక్షసులు" అంటారు. దీనికి ఒక కారణం ఉంది. వీళ్ళిద్దరికీ నాటకాలాడించడం, ముఖ్యంగా ఆ నాటకాలలో నటించడంలో ఒక తనివితీరని మమకారం. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఒక రకమయిన ఉన్మాదం. ముఖ్యంగా రావణాసురుడి పాత్రలో ఇద్దరూ అద్వితీయులని అందరూ అంటారు. మరి ఇద్దరి అద్వితీయులెలా ఉంటారు? అందుకే ఎవరికి వారు తామే అద్వితీయుడని చాటుకుంటాడు. ఈ మాట ఎవరు కాదన్నా వారికి ఆగ్రహం

వస్తుంది. పద్యాలు పాడడంలో సిద్ధయ్యే మేటి అని ఎవడైనా అంటే కోటయ్య వాడి పీక పిసికేస్తాడు. రాక్షసత్వాన్ని ప్రదర్శించడంలో కోటయ్యదే పైచెయ్యని ఎవడైనా అంటే సిద్ధయ్య చేతిలో వాడి బొచ్చె బద్దలు కావాల్సిందే. ఈ ఒక్క విషయంలో మాత్రం ఇద్దరికీ సహించరాని వైరం. కొద్దిరోజులలో ఊళ్లో నవరాత్రి సంబరాలు మొదలెయ్యాయి. ప్రతిసంవత్సరం దుర్గాష్టమి నాడు రాత్రి ఏదో ఒకనాటకం ప్రదర్శించడం సంప్రదాయం. అలాగే ఈ దుర్గాష్టమి రోజు రాత్రి రామాయణ నాటకం వేయించి అందులో రావణాసురుడి పాత్రను వేయాలని సంకల్పించాడు కోటయ్య. ఇదే సమయంలో ఇదే సంకల్పం సిద్ధయ్యకు కూడా వచ్చింది. కోటకు అనుకొని ఉన్న మైదానంలో భారీగా ఒక రంగస్థలాన్ని నిర్మించి అందులో నాటకం వెయ్యాలనుకున్నాడు కోటయ్య. సిద్ధయ్య కూడా ఇలాగే అనుకున్నాడు. తనకొచ్చిన ఈ ఆలోచనను రహస్యంగా ఉంచాలనుకున్నాడు కోటయ్య. సిద్ధయ్య కూడా అంత రహస్యంగానే ఉంచాలనుకున్నాడు.

మైదానంలో నాటకాలుగానీ, క్రీడలు గానీ, వేరే ఎలాంటి వినోద ప్రదర్శనలను జరిపించాలనుకున్నా దానికి అనుమతి ఇవ్వవలసింది ఇద్దరు. ఒకరు మైదానాధికారి. మరొకరు వినోదాధికారి. ఈ ఇద్దరిలో ఏ ఒక్కరు అనుమతి ఇచ్చినా చాలు.

ఒక మంచి ముహూర్తం చూసుకొని కోటయ్య తన అనుచరులతో రహస్యంగా వినోదాధికారి దగ్గరకు వెళ్ళాడు. అదే సుముహూర్తంలో సిద్ధయ్య కూడా రహస్యంగా మైదానాధికారి దగ్గరకు వెళ్ళాడు. ఒకరికి తెలియకుండా ఒకరు నాటకం ఆడటానికి అనుమతి తీసుకున్నారు. చివరకు ఆ సాయంత్రం ఇద్దరూ ఊరంతా తాము వేయబోయే నాటకాలను గూర్చి ప్రచారం చేసే సమయంలో జరిగిన విషయం ఇద్దరికీ తెలిసివచ్చింది. ఒకే సమయంలో ఒకే మైదానంలో ఇద్దరు ప్రత్యర్థులు అదే నాటకాన్ని వేస్తున్నారన్న వార్త అందరిలో కుతూహలాన్ని రేపింది. కోటయ్య, సిద్దయ్యలు మాత్రం ఈ పరిస్థితిలో విపరీతమైన ఆందోళనకు గురి అయ్యారు. ఇద్దరూ మళ్ళీ మైదాన వినోదాధికారులను కలుసుకొని, అనుమతిని ముందు మేం కోరాం అంటే మేం కోరాం అంటూ వాదించుకొని, అది తమకే ఇవ్వాలని అడిగారు. ఇలాంటి ఇబ్బందికరమైన పరిస్థితి అధికారుల కింతకు ముందెన్నడూ రాలేదు. అయినా వాళ్ళిద్దరూ మిత్రులు. పైగా తోడళ్ళుళ్ళు కూడా. వారిలో ఏదైనా అభిప్రాయ భేదాలొస్తే, అది కుటుంబంలో ఎటువంటి విషమ పరిణామాలకు దారితీస్తుందో వారికి తెలుసు. అందుకని వాళ్ళిద్దరూ కూడబలుక్కుని "మేము ఇద్దరికీ అనుమతి ఇచ్చాము. ఎవరు నాటకం వెయ్యాలో, ఎవరు వెయ్యకూడదో మీలో మీరే నిర్ణయించుకోండి" అన్నారు.

ఒక శాంతి నిర్ణయానికి వచ్చే స్థితిలో కోటయ్య, సిద్ధయ్య లేరు. ఆరు నూరైనాసరే నేనే రావణాసురుణ్ణని ఇద్దరూ శపథం చేశారు. వెంటనే నాటక ప్రదర్శనకు కావలసిన ఏర్పాట్లు చేయించాల్సిందిగా అనుచరులకు అనుమతి చ్చారు. రెండు రంగస్థలాల నిర్మాణం మొదలయింది. ఒకరు మైదానానికి ఉత్తరాన కడ్తాంటే, మరొకరు దక్షిణాన కట్టడం మొదలెట్టారు. మధ్యలో కూర్చున్న జనం మావైపుకు తిరిగి చూస్తారని ఒకరంటే, కాదు మావైపే తిరిగి చూస్తారని మరొకరు గొప్పలు చెప్పుకున్నారు. ఈ సమస్య ఎలా తేల్తుందో చూడాలని అందరూ ఆసక్తితో ఎదురు చూస్తున్నారు. ఇద్దరు రావణాసురులను ఒకేసారి చూసే సమయంకోసం కాచుకొని ఉన్నారు.

ఇరు వర్గాల వారి ప్రచారాలు తీవ్రస్థాయి నందుకున్నాయి. కానీ ఘడియలు గడిచే కొద్ది ఇద్దరు రావణాసురులలో ఒక రకమయిన భయం కూడా ఉత్పన్నమయింది. చూడ్డానికి వచ్చిన జనం ఒకవేళ ఎదటివాడే మెరుగు అంటె? అది భరించలేని అవమానం. అలాంటి పరిస్థితికి అవకాశం ఇవ్వకూడదు. అందుకుగాను ఇద్దరూ వారివారి అనుచరులను పిలిచి వాళ్ళు చెయ్యవలసిన పనులను విశదీకరించారు.

''మీరందరూ నాటకం జరుగుతు న్నంతసేపూ నాటకాన్ని చూడకూడదు జనాన్నే చూడాలి. జనం మనల్నే చూస్తుండాలి. అటు తిరిగారో, వెంటనే కర్రలతో తల పగిలేలా ఒకటెయ్యండి. అంతకంటె ముఖ్యం పేటలోని వారంతా నాటకానికి రావాలి. కాదన్నారో, - మీ పని అదే. కర్ర - తలపగలగొట్టడం'' అనుచరులకు చేతనయిన పని కూడా అదొక్కటే గనక వారికిచ్చిన బాధ్యతను సంతోషంగా స్వీకరించారు.

ఏదో తమాషా చూద్దాం అనుకున్న జనానికి ఈ మాట వినగానే భయం పుట్టుకుంది. "ఎందుకొచ్చిన నవరాత్రి సంబరాలు? ఏమిటా రావణాసుర బాధలు?" అనుకున్నారు. రేపు రాత్రికే నాటకం. ఇప్పుడూరుకుంటె పరిస్థితులు విషమిస్తాయనే భయంతో పేటలోని కొందరు పౌరులు రహస్యంగా మంత్రిగారి ఇంటికి వెళ్ళారు. ఉన్న విషయాన్ని ఆయనకు సవివరంగా విన్నవించుకున్నారు. "మంత్రిగారూ! ఈ క్లిష్ట పరిస్థితిలోంచి మమ్మల్ని మీరే కాపాడాలి. నాటకానికి వెళ్ళకపోతే కొట్తానంటున్నారు. వెళ్ళి అటుచూస్తే వీళ్ళు కొట్తారు. ఇటు చూస్తే వాళ్ళు కొట్తారు. ఎటూ చూడకుండా దేవుడా అంటూ పైకి చూస్తే ఇద్దరూ కొట్తారు. ఎలాగైనా ఆ నాటక ప్రదర్శనలను మీరు నిషేధించాలి" అన్నారు. మంత్రి గాంభీర్యంగా తల ఊపి "మీరు వెళ్ళండి. నేను చూస్తాను" అని ముక్తసరిగా చెప్పి వాళ్ళను పంపించాడు. పైకి గంభీరంగా కనిపించినా ఇందులో సాధక బాధకాలు మంత్రికి తెలుసు. కోటయ్య,సిద్ధయ్యలు మొండివాళ్ళు. వాళ్ళ పేర్లు నిలబెట్టుకోడానికి ఎంతకైనా సాహసిస్తారు. ఇప్పుడెలా? వర్షం వస్తే బాగుండుననుకున్నాడు. కానీ ఇది ఎండాకాలం. ఆ అవకాశం ఏ కోశానా లేదు. పరిస్థితులెదురయినప్పుడు అతనికి తెలిసింది ఒక్కటే. వెళ్ళి కరాజుగారికి మొత్తం విన్నవించుకోడం.

"ఏం మంత్రీ! తూర్పు పేటలో పరిస్థితి బాగా వేడెక్కినట్టుంది?" అనడిగాడు కరాజు మంత్రి చెప్పడానికి ముందే. రాజుగారు అన్నివిషయాలు ఎలా తెలుసుకుంటాడా అని ఆశ్చర్యపోయాడు మంత్రి.

"అవును మహారాజా! గొడవలు జరక్కుండా ఉండాలంటే మీరా నాటకాలను నిషేధించాలి.



రాజాజ్ఞను ఎవ్వరూ ఉల్లంఘించలేరుకదా?" అన్నాడు మంత్రి

"ఉల్లంఘించలేరు కదా అని అవసరం ఉన్నా లేకున్నా రాజాజ్ఞ ఇవ్వడం సమంజసం కాదు మంత్రీ. పైగా ప్రతి దుర్గాష్టమి నాడు వేసే నాటకాలు ఈ ఏడు వెయ్యలేదంటె అది రాజ్యానికి అప్రతిష్ట."

"మరివ్పుడు ఏం చెయ్యమంటారు మహారాజా, ఒకేచోట రావణాసురుడి పాత్ర వెయ్యడానికి ఇద్దరు ముందుకొస్తుంటె?" అన్నాడు మంత్రి.

"మంత్రీ! రావణాసురుడి పాత్ర వెయ్యడానికి ముఖ్యంగా కావలసిందేది?" మంత్రి అర్థంకాక చూసాడు.

"అతని తలలు. అవి చేసేవాడు ఈ ఊళ్ళో ఒక్కడే ఉన్నాడు. అతనే తలల పెదతాత. మీరు వెళ్ళి, రాత్రి రహస్యంగా పెదతాతను కలవండి. ఒకే ఒక రావణాసురుడికి సరిపోయే తలల్ని మాత్రం ఇంట్లో ఉంచి, అతన్ని ఈ రాత్రికే ఊరువిడిచి వెళ్ళమనండి. సమస్య దానికదే సర్దుకుపోతుంది" అన్నాడు కరాజు.

తలల పెదతాత ఇల్లంతా నాటకాల దుస్తులూ, కిరీటాలూ, కత్తులు వంటి వాటితో నిండుంది. పెదతాత ఒక మూల కూర్చొని ఏదో పనిలో నిమగ్నుడై ఉన్నాడు. మంత్రిగారు రాగానే నిలబడి నమస్కరించాడు. రావణాసురుడి తలల గురించి మంత్రి అడిగాడు.

"అదిగోనండి - తొమ్మిది తలలు సిద్ధంగానే ఉన్నాయి" అన్నాడు పెదతాత.

"అదేమిటయ్యా. రావణాసురుడికి పదితలలుకదా?"

"అవునండి. వేషం వేసే వాడి తల ఒకటుందిగా! మిగతా తొమ్మిది తలలూ అటు అయిదు ఇటు నాలుగు తగిలించుకుంటె సరిపోతుంది"

ఈ మాత్రం ఆలోచించలేకపోయానే అనుకున్నాడు మంత్రి. పెదతాతతో రహస్యంగా "చూడు పెదతాతా! నీవీ తలల పని ఇంతటితో ఆపు" అన్నాడు.

"మరొక తొమ్మిది తలలు -" ఏదో చెప్పబోయాడు పెదతాత.

'అక్కర్లేదు. ఈ తొమ్మిది తలలు మాత్రం ఇక్కడుంచు. ఈ పైకం తీస్కొని ఈ రాత్రికే ఎవ్వరికీ చెప్పకుండా ఊరువిడిచి వెళ్ళు. వారం అయింతర్వాత రా. ఎందుకు అని అడక్కు. ఇది రాజాజ్ఞ" అన్నాడు మంత్రి.

పెదతాత తనులేనపుడు చేయవలసిన పనులన్నీ తన మనవడికి అప్పచెప్పి, ఎవ్వరైనా అడిగితే దుస్తులూ నగలతో పాటు ఈ తొమ్మిది తలలే ఉన్నాయని చెప్పమని చెప్పి, అర్థరాత్రయ్యేసరికి అదృశ్యుడయ్యాడు.

కోటయ్య, సిద్ధయ్యలు ఎంతసేపూ తమ తగాదా ధ్యాసలో ఉన్నారే గాని, తలల గురించి ఆలోచన వాళ్ళకు రాలేదు. అది ఎప్పుడూ సిద్ధంగా ఉంటుందనే ధీమా కూడా. ఉదయం అయ్యేసరికి ఇద్దరు రావణాసురులకు కలిపి తొమ్మిది తలలే సిద్ధంగా ఉన్నాయన్న నిజం ఇరువైపులవారికి తెలిసింది. దాంతో అందరూ పెదతాత ఇంట్లోకి దూరి ఆ తలలు మావంటె మావి అనుకుంటూ తలల్ని పట్టుకొని చెరొకవైపు లాక్కోడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలో తొమ్మిది తలలూ రెండు భాగాలై కోటయ్యకు అయిదు తలలు, సిద్ధయ్యకు నాలుగు తలలూ దక్కాయి.

ఈ పరిస్థితిలో ఏం చెయ్యాలో కోటయ్య, సిద్ధయ్యలకిద్దరికీ అర్థం కాలేదు. రాజ్య సంప్రదాయం ప్రకారం దుర్గాష్టమి రాత్రి నాటకం వేసే పూచీ వాళ్ళదే. వీళ్ళు సందిగ్ధంలో ఉండగా ఈ వార్త అలా అలా ప్రాకి చివరకు రాజుగారి చెవిన పడింది. అది విన్న రాజు మంత్రిద్వారా ఒక సలహా పంపించాడు. అది ఒక వార్తాహరుడి ద్వారా కోటయ్య, సిద్ధయ్యలకు తెలిసింది. ఇది సలహా అని చెప్పినా, రాజుగారి సలహా గనక ఆజ్ఞే అవుతుంది కదా! ఆ సలహా ఇలా ఉంది.




'కోటయ్య, సిద్ధయ్యలిద్దరూ సంప్రదాయాన్ని నిలబెడ్తూ దుర్గాష్టమినాడు నాటకాలాడాలని నిశ్చయించడం సంతోషించదగ్గ విషయమే. కానీ వాళ్ళు రావణాసురుడి పాత్ర వెయ్యాలని సంకల్పించినా, దైవ సంకల్పం వలన ఒకరికి అయిదు తలలూ, ఒకరికి నాలుగు తలలూ దక్కడంతో ఆ పాత్రల ప్రదర్శనకు అంతరాయం కలిగింది. కానీ వారిచ్చిన మాట ప్రకారం ఒక నాటకం, - అది ఏదైనాసరె, - ప్రదర్శిస్తేనే శ్రేయస్కరం. లేకుంటె ఈ రాజ్యంలో ప్రజలు తాము అనుకున్నది చెయ్యలేదనే అప్రతిష్ట వస్తుంది.

అందుకని అయిదు తలలు దక్కిన కోటయ్య, తన తలను జతచేసి షణ్ముఖుడైన సుబ్రహ్మణ్య స్వామి పాత్రనూ, అదే విధంగా సిద్ధయ్య తన దగ్గరున్న నాలుగు తలలూ, తన తలకు జోడించి పంచముఖ ఆంజనేయ స్వామి పాత్రను ధరించవలసినది. ఇందుకుగాను ఆయా తలలలో చేయవలసిన రంగు మార్పులను చేసి, శుభప్రదంగా నవరాత్రి సంబరాలను కొనసాగించవలసినది. ఇద్దరూ నటనానుభవం కలవారు గనుక ఇది సుసాధ్యం.'

రాజాజ్ఞ పాటించడానికి ఇద్దరూ ఉద్యుక్తులయ్యారు. జనం కుతూహలంగా చూస్తుండగా ఒక వేదిక మీద సుబ్రహ్మణ్యస్వామి, మరొక వేదికమీద ఆంజనేయస్వామి కనిపించడంతో అందరిలో ఒక నూతన భక్తిభావం పుట్టుకొచ్చింది. కోటయ్య, సిద్ధయ్యలు వారికొచ్చిన కొత్త పాత్రల్లో లీనమయి నటిస్తుంటె, అటూ ఇటూ రెండు వైపులా చూస్తున్న జనంలో భక్తి ఆవేశంగా మారింది. నాటకం అయ్యేసరికి అందరూ ఇద్దరు దేవుళ్ళకు కర్పూరం వెలిగించి హారతులు పట్టారు. ఇన్నాళ్ళూ తమను చూసి భయపడిన జనం, ఇప్పుడు హారతులిస్తుంటే, కోటయ్య, సిద్ధయ్యలకు కొత్తగా, ఆనందంగా ఉంది. ఇకనుంచీ రాక్షసుల పాత్రలుకాదు, దేవుళ్ళ పాత్రలనే వెయ్యాలని ఇద్దరూ నిర్ణయించుకున్నారు. ఇలా కొన్నాళ్ళు ఈ పాత్రలను వేసే సరికి వాళ్ళ కొత్త రూపాల్నే ప్రజలు తమ దృక్పథంలో సంతరించుకున్నారు. ఒకప్పుడు దానవుల్లాగా కనిపించిన వ్యక్తులు ఇప్పుడు దేవుళ్ళలాగా కనిపిస్తున్నారు.

ఈ శుభ పరిణామాలను గురించి ఏకాంత మందిరంలో కరాజుతో చర్చిస్తున్న మంత్రిని చూసి, "చూసారా మంత్రీ! ఒక వ్యక్తి ఇలాంటి వాడని ప్రజలు నిర్ణయించేది అతని స్వభావంవల్ల కాదు. అతను వేసే వేషం వల్ల" అన్నాడు కరాజు చిరునవ్వుతో.

◆

# హాసం సినీగీతకోశం 2003

(గత సంచిక తరువాయి)

## నీతో వస్తా

విడుదల తేదీ:19.09.2003 దర్శకత్వం :కె.అజయ్ బ్యానర్:విల్లా ఆర్ట్ ప్రొడక్షన్స్ సంగీతం :మాధంపెద్ది సురేష్, ఎం.ఎం.శ్రీలేఖ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ముద్దులంటించవే స్వీటీ టూటీ ఫ్రూటిగా | వేటూరి | ఉదిత్‌నారాయణ్, సాధనా సర్గమ్ & కోరస్ |
| 2.మల్లెపువ్వంటి సోకే ముట్టుకోనీవె | విజయ్‌కుమార్ | సంగీత, రమేష్, వినాయగమ్ |
| 3.అబ్బనీ నాజూకు లేతా తమలపాకు అందగత్తె నువ్వేలే | వేటూరి | ఉదిత్ నారాయణ్, కల్పన కోరస్ |
| 4.కలసిన తొలకరి అందం కసిమీద కాటేస్తే | వేటూరి | సందీప్, మహాలక్ష్మీ, కోరస్ |
| 5.మనసే తలుపు తెరిచి చెలిని పిలిచే | విజయ్ కుమార్ | మల్లి,బిందు |
| 6.ఏక్ దో తీన్ చార్ వయసుకే ఎదురు లేదురా | వేటూరి | శంకర్‌మహదేవన్ & కోరస్ |

## ఠాగూర్

విడుదల తేదీ: 24-09-2003 దర్శకత్వం :వి.వి.వినాయక్ బ్యానర్:లియో ప్రాజెక్ట్స్ (ప్రై) లిమిటెడ్ సంగీతం :మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. కొడితే కొట్టాలిరా సిక్స్ కొట్టాలి | చంద్రబోస్ | శంకర్‌మహదేవన్ |
| 2. గప్పుచిప్పు గప్పుచిప్పు గంతులిప్పుడు | సుద్దాల అశోక్ తేజ | మనో,చిత్ర |
| 3. వానొచ్చేనంటే వరదొస్తాది | భువనచంద్ర | ఉదిత్‌నారాయణ్, శ్రియాగోషాల్ |
| 4. నేను సైతం... ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను | శ్రీశ్రీ, సుద్దాల అశోక్‌తేజ | బాలు |
| 5. చిన్నగ॥3॥ అది కన్నులు విప్పిన తుమ్మెద | చంద్రబోస్ | హరిహరన్, చిత్ర |
| 6. మన్మధా మన్మధా...మామ పుత్రుడా ఇంద్రుడే చంద్రుడై | వేటూరి | మల్లికార్జున్, మహాలక్ష్మి |

## నాగమనాయుడు

విడుదల తేదీ:26-09-2003 దర్శకత్వం :పి.సి.రెడ్డి బ్యానర్:తారా ఆర్ట్స్ సంగీతం :ప్రమోద్‌శర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నిన్న చూసిన అమ్మాయి నువ్వా నువ్వా నువ్వా | దేవర విజయకుమార్ | ప్రమోద్ శర్మ, ఉష |
| 2.సిల్క్ ॥3॥ చీర చిన్నదీ మనసేమో లాగేస్తూవున్నది | భాస్కరభట్ల | టిప్పు, కౌసల్య |
| 3.నా మనసులోవుంది నువ్వేనంట అల్లరి ఏంటంట | భాస్కరభట్ల | వేణు, సునీత |
| 4.వానొచ్చి వానొచ్చి కోకే తడిసింది ఈ వానొచ్చి | భాస్కరభట్ల | ప్రమోద్ శర్మ, ఉష |
| 5.నింగిలో చంద్రుడు నేలకు వచ్చెను | భాస్కరభట్ల | మనో |
| 6.యాడేడో కుట్టినాది కందిరీగ నీతోడు కోరుకుంది మల్లెతీగా | భాస్కరభట్ల | స్వర్ణలత |

## విష్ణు

విడుదల తేదీ: 28-09-2003 దర్శకత్వం : షాజీ కైలాస్ బ్యానర్: శ్రీ లక్ష్మి ప్రసన్న పిక్చర్స్ సంగీతం :ఇస్మాయిల్ దర్బార్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.వందనం వందనం మీరే నా జీవితం | భువనచంద్ర | సోనూనిగమ్ |
| 2.ఒక సారీ గాజు మిట్టె పెడితె నాకెంతో నొప్పి నొప్పి | గురుచరణ్ | ఉదిత్ నారాయణ్, కవితా కృష్ణమూర్తి |
| 3.రావోయి చందమామ మా ప్రేమ గాధ వినుమా | సుద్దాల అశోక్‌తేజ | ఉదిత్‌నారాయణ్, సాధనా సర్గమ్ |
| 4.అరే అరే మావా మావా అరే అరే మావా మావా | గురుచరణ్ | ఉదిత్‌నారాయణ్ |
| 5.నీ పేరే తనపైన తన పేరే ఎదపైన | సుద్దాల అశోక్‌తేజ | సోను నిగమ్, సాధనా సర్గమ్ |
| 6.హ్యాపీ హ్యాపీ హ్యాపీబర్త్‌డే హ్యాపీ బర్త్‌డే | గురుచరణ్ | ఉదిత్‌నారాయణ్ సుఖ్వీందర్‌సింగ్ |
| 7.నెల్లూరీ నెరజాణా నా మనసంతా నీ వమ్మా | గురుచరణ్ | కె.కె, కవితా కృష్ణమూర్తి |

## ఎలా చెప్పను

విడుదల తేదీ: 02.10.2003 దర్శకత్వం :రమణ బ్యానర్:స్రవంతి మూవీస్ సంగీతం :కోటి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.మాఘ మాసవేళ కోకిలమ్మపాట | సీతారామ శాస్త్రి | ఉదిత్‌నారాయణ్,శ్రేయ గోషల్ |
| 2.ఈ క్షణం ఒకే ఒక కోరిక నీ స్వరం వినాలని | సీతారామ శాస్త్రి | చిత్ర |
| 3.ఆ నవ్వులో ఏముున్నదో చెలించింది నా మనసు | సీతారామ శాస్రి | కార్తీక్ |
| 4.మేఘాల పల్లకిలోన దిగివచ్చింది | సీతారామ శాస్రి | శ్రీరాంప్రభు, సునీత |
| 5.రంగుల తారక నింగిన ఆగక నేలకి | సీతారామ శాస్త్రి | కార్తీక్, సునీత |
| 6.ప్రతీ నిజం పగటికలగా నిరాశగా | సీతారామ శాస్త్రి | చిత్ర |
| 7.మంచు తాకిన ఈ వనం పూలు | సీతారామ శాస్త్రి | మల్లిఖార్జున్ |
| 8.మన్నించు ఓ ప్రేమా మురిపించుకోకమ్మా | సీతారామ శాస్త్రి | ఉదిత్ నారాయణ్, చిత్ర |

## తొలిచూపులోనే...

విడుదల తేదీ: 09.10.2003 దర్శకత్వం : వై.కాశీ విశ్వనాథ్ బ్యానర్:ఉషాకిరణ్ మూవీస్ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.హేచ్చాచ్చా ఎచ్చా రెచ్చా | భాస్కరభట్ల | శంకరమహదేవన్ |
| 2.శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం | బండారు దానయ్య | ఉదిత్‌నారాయణ్, శ్రీయాగోషల్ |
| 3.సఖియా సఖియా(2)నీకై వేచే వున్నాలే | కందికొండ | శంకరమహదేవన్, కౌసల్య |
| 4.కన్నులు మూస్తే చాలు నువ్వే కల్లోకొస్తావు | సూర్యకుమారి | చక్రి,కౌసల్య |
| 5.పగడాల పెదవిపైన తెలుగింటి మీగడల్లె | చిన్నచరణ్ | రాజేష్,హరిణి |
| 6.హల్లో అమ్మాయి...బాపూ బొమ్మాయి | భువనచంద్ర | ఉదిత్‌నారాయణ్, శ్రీయగోషల్ |

## ఒకరికి ఒకరు

విడుదల తేదీ: 09.10.2003 దర్శకత్వం :రసూల్ ఎల్లోర్ బ్యానర్:ఆనంది ఆర్ట్స్ క్రియేషన్స్ సంగీతం :కీరవాణి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.వెళ్ళిపోతే ఎలా | సిరివెన్నెల | కీరవాణి |
| 2.నాదిరి దీనా(3) నచ్చినదాని కోసం నాతపన | చంద్రబోస్ | కార్తీక్, గంగ |
| 3.అల్లో నేరేళ్లో ఆల్లా నేరేళ్ళో(2) | చంద్రబోస్ | కీరవాణి, గంగ |
| 4.ఘాటు ఘాటు ప్రేమ(2) నీకు నాకు నడుమ | చంద్రబోస్ | టిప్పు, నిత్య సంతోషిణి |
| 5.నువ్వే..నాశ్వాస మనసున నీకై అభిలాష | చంద్రబోస్ | శ్రీయా గోషల్ |
| 6.ఎక్కడున్నావమ్మా...ఓ ప్రియతమా | చంద్రబోస్ | బాలు |

## ఒట్టు ఈ అమ్మాయెవరో తెలీదు

విడుదల తేదీ:10-10-2003 దర్శకత్వం :హరిబాబు బ్యానర్:సారధి ప్రొడక్షన్స్ సంగీతం :ఘంటాడి కృష్ణ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నీ షేపుచూసి టెంపరేచర్ ఎక్కువయిందా | జయసూర్య | శంకర్ మహదేవన్, గంగ |
| 2.ఒంపుల సొంపుల చెలినీవా... | ఘంటాడి కృష్ణ | ఘంటాడికృష్ణ, నిత్యసంతోషిణి |
| 3.మనసు మనసులో లేనే లేదే... | భాస్కరభట్ల | టిప్పు, గోపికా పూర్ణిమ |
| 4.ముద్దు ముద్దు గుమ్మ ఓ బాపు బొమ్మ | వేమూరి విశ్వనాథ్ | షాన్, సునీత |
| 5.భళిర భళిర దొర బతుకులిడిన దొర | పెద్దాడమూర్తి | మనో, గంగ |
| 6.అరె..కోహినూరు వజ్రమా ఉరికే జలపాతమా | తైదల బాపు | సందీప్ భౌమిక్, సునీత |

## ఇన్‌స్పెక్టర్

విడుదల తేదీ:10-10-2003 దర్శకత్వం : కె.యస్.నాగేశ్వరరావు బ్యానర్: ఎ.ఎ.ఆర్ట్స్ సంగీతం :వందేమాతరం

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. లే ఒక్కొక్క అడుగు నీకింకలేదు వెనకడుగు | సుద్దాల అశోక్‌తేజ | వందేమాతరం |

## ఓరి..నీ ప్రేమ బంగారం కానూ

విడుదల తేదీ: 16.10.2003 దర్శకత్వం :ఏవీయస్ బ్యానర్:మైత్రి టాకీస్ సంగీతం :మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.పడమటి సంధ్యారాగం నీ చిరునవ్వయ్యింది | వెన్నెలకంటి | మల్లికార్జున్, గోపికా పూర్ణిమ |
| 2.రూపే లేకపోతే హేపీ ఎవ్వరూ పెట్టలేరు టోపీ | జొన్నవిత్తుల | రాజేష్, విశ్వ, మల్లికార్జున్, రఘుకుంచె, వేణుమాధవ్ |
| 3.స్వాగతమూ జీవితాంతం చల్లని ఓ నేస్తం... | సాయిహర్ష | యస్.పి.చరణ్,కల్పన |
| 4.రా..రామ్మరా...దా..దామ్మదా ఈ ఆటలో...ఓ పాటగా | సుద్దాల అశోక్‌తేజ | దేవన్, సునీత |
| 5.హే....శ్రీరస్తూ శుభమస్తూ ప్రేమంగా క్షేమంగా | సాయిహర్ష | సందీప్ భౌమిక్ ,సునీత |
| 6.నీ చిలిపి చొరవ నిలుప తరమా! | సిరివెన్నెల | సందీప్ భౌమిక్,సునీత |

## తొలిపరిచయం

విడుదల తేదీ: 17.10.2003 దర్శకత్వం :కిరణ్ కర్నిడి బ్యానర్:యూనివర్సల్ మూవీస్ సంగీతం :బంటీ-మారుత్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నామానసు ఏదేదో చిలిపి పనులు చేసేస్తే | బంటి.జి | కిరణ్ కర్నిడి |
| 2.మందారం పూచింది నాలో ఓ ఇంద్రోళం సాగింది లోలోన | బంటి.జి, సునీత | బలభద్ర, పాత్రుని మధు |
| 3.చూసే కనులకు మాత్రం మనమెంతో | మల్లిఖర్జున్, ఉష | కలువకృష్ణ సాయి |
| 4.సరిగ సంగీతమే సరి తో ఆఆరాజా విత్ మి | విష్ణు | కలువ కృష్ణ, సాయి |
| 5.ఎదలో నిన్నే ఏనాడు కొలిచాను..కలిసే | సందీప్, నిత్యసంతోషిణి | రామకృష్ణ |
| 6. నందారే నందారే నాయి ముద్దుల గుల్లక్క సరిసరి(2) | లెనినా చౌదరి | ఆంధ్రాఫోక్ |
| 7.చూసే కనులకు మాత్రం మనమే ఇద్దరం | మల్లికార్జున్, ఉష | కలువకృష్ణ, సాయి, మారుత్ |

## కుర్రాడొచ్చాడు

విడుదల తేదీ: 17.10.2003 దర్శకత్వం :టి.రాజేందర్ బ్యానర్: శింబు సినీ ఆర్ట్స్ సంగీతం :టి.రాజేందర్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.విఘ్నేశ్వరా వందనం పోటికి పోటీ ఆడదాం | టి.రాజేందర్ | శంకర్‌మహదేవన్ |
| 2.ప్రేమంటే నువ్వే నువ్వే నను కలిసెను నీ చూపే | టి.రాజేందర్ | హరీష్ రాఘవేందర్ |
| 3.క్లింటన్ కుమార్తె | టి.రాజేందర్ | టిమ్మీ |
| 4.జయం జయం శ్రీ రామ రామ జయం విజయం | టి.రాజేందర్ | ప్రసన్నరావ్ |
| 5.మారా మారా సుకుమారా సుకుమారా వీరా వీరా మహావీరా | టి.రాజేందర్ | టిప్పు,మాతంకి |
| 6.లిటిల్ లిటిల్ సూపర్‌స్టార్॥2॥ వచ్చే వచ్చే వచ్చే చూడు | టి.రాజేందర్ | బాలు |
| 7.నామనసున నిండినదానా నీ మనసును నేనే కానా | టి.రాజేందర్ | కార్తిక్, శ్రీవర్ధిని |
| 8. జ్యోతికవా లేక భూమికవా ముంతాజా మనీషాకోయిరాలా | టి.రాజేందర్ | శింబు |

## శివమణి 98480 22338

విడుదల తేదీ: 23.10.2003 దర్శకత్వం :పూరీ జగన్నాథ్ బ్యానర్:వైష్ణో అకాడమీ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఏనాటికీ మనమొకటేననీ ఏ చీకటి ఇటు రాలేదని | భాస్కరభట్ల | రఘుకుంచె, కౌసల్య |
| 2.గోల్డ్‌రంగుపెదవులు బాగున్నవి | కందికొండ | రవివర్మ,రేవతి |
| 3.ఏలో ఏలో ఎన్నియల్లో తేలే ఈడే తేనియల్లో | విశ్వ | స్మిత |
| 4.రామ రామ రామ నీలి మేఘ శ్యామ | కందికొండ | కౌసల్య |
| 5.మోనా మోనా మోనా మీన కనుల సోనా | చక్రి | హరిహరన్, కౌసల్య |
| 6.సుస్ సున్ సుందరి ఊరించె క్యాడ్బరీ | కందికొండ | శంకరమహదేవన్,కౌసల్య |

## వీడే

విడుదల తేదీ: 31.10.2003 దర్శకత్వం :రవిరాజా పినిశెట్టి బ్యానర్:కనకరత్న మూవీస్ ప్రై.లిమిటెడ్ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.అందమైన పాపపేరు ఐశ్వర్య | భాస్కరభట్ల | శంకరమహదేవన్, కౌసల్య |
| 2.అమ్మాడి యమ్మ యమ్మారే | సాహితి | రవివర్మ |
| 3.కిన్నెరసాని వన్నెలరాణి | సాహితి | హరిహరన్, కౌసల్య |
| 4.చవక్ నాంచల్ | సాహితి | ఉదిత్‌నారాయణ్,సునీత |
| 5.అడుగడుగో వస్తున్నాడు | సుదాల అశోక్‌తేజ | తెలంగాణా శకుంతల |
| 6.ఎందురంటూ లేనే లేని మొనగాడు వీడే | భాస్కరభట్ల | చక్రి అండ్ కోరస్ |

# శ్రీరామచంద్రులు

విడుదల తేదీ: 07-11-2003 దర్శకత్వం :ఐ.శ్రీకాంత్ బ్యానర్: సింధూర క్రియేషన్స్ సంగీతం :ఘంటాడి కృష్ణ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.పాల వెల్లిలా నువ్వ చూసే చూపు నవ్వే నవ్వూ ఎంతో బాగుందే | వైదల బాపు | హరిహరన్, సాధనాసర్గమ్ |
| 4.డీడిడిక్కీ పిల్లా డీడిడిక్కీ నువ్వు నాకు జోడైతే డీడిడిక్కీ | వైదల బాపు | కె.కె, సునీత |
| 5.పెళ్ళామంటే కాదోయి వంకాయి పులుసు | సాహితి | నిష్మ, శ్రీదేవి |
| 1.జాబిలి లేకపోతేనే నువ్వుంటేచాలు సూర్యుడు రాకపోతేనే | బొంపెం జయసూర్య | ఉదిత్ నారాయణ్, నిత్య సంతోషిణి |
| 2.సాగసరి జాణ గడసరి నినుచూశాకా మైనా నిను చూశాకా | మద్దెల శివకుమార్ | కుమార్ సాను, శ్రీదేవి |
| 3.పెళ్ళాం మాట వింటె నీ చాప్టర్ క్లోజు మంటకలిసి పోదా | సాహితి | ఘంటాడి కృష్ణ, శ్రీనివాస్, రామకృష్ణరవి కుమార్ |

# నేను... సీతామహాలక్ష్మి

విడుదల తేదీ:08-11-2003 దర్శకత్వం : జి. నాగేశ్వరరెడ్డి బ్యానర్:మహర్షి సినిమా సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.కనులు మూస్తే చాలు నువ్వె కల్లోకొస్తావు | భాస్కరభట్ల | సందీప్‌భౌమిక్, కౌసల్య |
| 2.నువ్వేనా నువ్వేనా నా ప్రేమ నువ్వేనా నువ్వేనా నువ్వేనా | పైడిపల్లి శ్రీనివాస్ | చక్రి, కౌసల్య |
| 3.ముద్దు ముద్దు ముద్దూ అచ్చంగా వెచ్చంగా వున్నది | సాయి శ్రీహర్ష | రఘు కుంచె, కౌసల్య |
| 4.అనగనగా ఒకప్రేమ కుట్టిందమ్మా చలిచీమై గుండెలనే | కందికొండ | యస్.పి.బాలు, కౌసల్య |
| 5.ఆకాశమా ఆకాశమా చేజారకే నా ప్రాణమా | భాస్కరభట్ల | యమ్.యమ్.కీరవాణి |
| 6.కోటిపల్లి సుందరాంగి పిల్ల నీ కొంటెనవ్వు చూసె గుండె గుల్ల | కందికొండ | వాసు, కౌసల్య |

# అభిమన్యు

విడుదల తేదీ:12-11-2003 దర్శకత్వం : మల్లికార్జున బ్యానర్:రాక్‌లైన్ మూవీస్ సంగీతం :మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.గన్నుపట్టితే నక్సలిజం పెన్నుపడితే జర్నలిజం | చంద్రబోస్ | కార్తిక్ |
| 2.నీ పేరేంటో తెలుసు నాకు | చంద్రబోస్ | మల్లికార్జున్, గోపికా పూర్ణిమ |
| 3. టీవీలాంటిదిరా అమ్మాయి | చంద్రబోస్ | టిప్పు, హరిణి |
| 4.ప్రపంచాన్నే గెలిచిన రోజు పతంగాన్నై ఎగిరిన రోజు | చంద్రబోస్ | విజయ్ ఏసుదాస్,కల్పన |
| 5.చిన్నవాళ్ళ మనసులలోన మేలుకున్న ఓ ప్రేమ | చంద్రబోస్ | ఉన్నికృష్ణన్ |
| 6.కోలో కోలోయమ్మ కోలో కుట్టినాది కుర్రతేలో | చంద్రబోస్ | ఉదిత్‌నారాయణ్, సుజాత |

# నేను పెళ్ళికి రెడీ

విడుదల తేదీ: 14-11-2003 దర్శకత్వం : వెంకీ బ్యానర్: ఆర్.పి.జి కంబైన్స్ సంగీతం :చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.నువ్వుంటే చాలు | భాస్కరభట్ల | హరిహరన్ |
| 2.గోపాలకృష్ణ పెళ్ళికావాలా | పెద్దాడ మూర్తి | చక్రి, కౌసల్య, సునీత |
| 3.సావి వన్..సావి టూ | భాస్కరభట్ల | శంకర్‌మహదేవన్, స్మిత |
| 4.నువ్వుంటే చాలు | భాస్కరభట్ల | సునీత |
| 5.చంద్రముఖి | పైడిపల్లి శ్రీనివాస్ | శంకరమహదేవన్, కౌసల్య |
| 6.నీవు నేను ఒకటేలే | పెద్దాడమూర్తి | సింహ, మంజు |
| 7.ముగ్గురు భామల | పెద్దాడమూర్తి | రవివర్మ, సునీత |

# గోవా

విడుదల తేదీ: 14-11-2003 దర్శకత్వం :పి.కిశోర్‌కుమార్ బ్యానర్:పయొనీర్ మల్టివిజన్స్ లి. సంగీతం :కృష్ణవాసా

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఎంజాయ్‌దిదే...ఓ...గోవాలో హోలిడే | వరికుప్పల | రాధాకృష్ణన్ |
| 2. ఎంత ముద్దో...ఎంత సొగసో | టి.మణిశర్మ | శంకర్ మహదేవన్, సునీత |
| 3.జలకాలటకు...లేటెస్ట్ మేమే కాదా స్విమ్మింగ్ | భాస్కరభట్ల | శ్రీయా గోషల్ |
| 4.రావేరా చిలుకా...రావే...నవ్వే రంగుల కళ్ళు నీవే | వరికుప్పల | ఉదిత్ నారాయణ్, సునీత |
| 5.ఏదో చెప్పలేక మౌనంగా ఉండలేక.. | టి.మణిశర్మ | హరిహరన్, శ్రీయా గోషల్ |
| 6.మస్తీ బసి జవానే నషా....మస్తీ బసి దీవానే...నషా | చంద్రబోస్ | సునిధి చౌహాన్ |

(వచ్చే సంచికలో మరికొంత)



# ఏడ తానున్నాడో...

ఏడ తానున్నాడో కృ.శా.
జాడ తెలిసిన చెప్పిపోవా
అందాల ఓ మేఘమాలా అని...
నల్లకుచ్చిళ్ళ చుక్కల పావడా కట్టుకుని
వెన్నెల వెలుగులో కడిగిన ముత్యంలా మెరిసిపోతూ...
మా వూరి కొత్త కోవెల చుట్టూ తిరిగే మేఘమాలని అడిగేను...
భోరున ఏడ్చేసింది...
పాపం పిచ్చిపిల్ల నీ కోసం తనూ బెంగపెట్టుకుంది..
ఓదార్చటం నా వల్ల కాలేదు..
సరే, తెల్లారేక మల్లీ జాజీ మందారాలను పిలిచి అడిగేను..
కంగారు పడ్డాయి.. బెంబేలు పడ్డాయి.. డీలా పడ్డాయి..
వాటి మనసులు కదిలిపోయాయి..
తనువులు వడిలిపోయాయి..
నిన్నూ నీ మాటల్నీ, పాటల్నీ, పద్యాల్నీ తలచుకొని..
మనసులో తేనె వాకలు స్రవించాయి..
అప్పుడు.., నువ్వు లేవని అనిపించినప్పుడు..
అవి శిలాపుష్పాలుగా మారిపోతున్నాయి...
నీ గురించి బాధపడినప్పుడల్లా..
అవి పూస్తూనే ఉన్నాయి వాసనలేని పువ్వుల్లా..
నీతో పాటు వాటి పరిమళాన్ని తీసుకొని వెళ్ళిపోయావు?!
నువ్వెక్కడున్నావో నాకు తెలుసు!
నీ కలల కావేరి హృదయ దేవేరి
కవితాప్రేయసి ఊర్వశితో పాటు
నువ్వెకడున్నావో నాకు తెలుసు...!
నందనారామంలో మీ పారిజాతచ్ఛాయ నాకు తెలుసు!
మీ యిల్లు ఒరుసుకొని మందాకిని
పరిగెడుతుందని నాకు తెలుసు..!
దాని ఒడ్డున ప్రవాళ పర్యంకాన కూర్చొని నీళ్ళలో కాళ్ళు ఆడిస్తూ..
ఆశ్చర్యంతో దాని నురుగులకేసి చూస్తూ..
ఆనందంతో కేరింతలు కొడుతూ..
"మనసున మల్లెల మాలలూగెనే
కన్నుల వెన్నెల డోలలూగెనే
ఎంతహాయి ఈరేయి నిండెనో
యిన్నినాళ్ళకీ బ్రతుకు పండెనో"
అని పాడుకుంటున్నారనీ తెలుసు!
ఏమీ అనుకోనంటే ఓ మాట..
యింతోటి ఊర్వశి కోసం మమ్మల్నందర్నీ వదిలేసి వెళ్ళిపోయావు..
ఏదో చుట్టపు చూపుగా వెళ్ళొస్తావనుకుంటే అక్కడే మకాం వేశావు.
ఏఁ పెట్టిందో అది..
ఆఁ.. ఆఁ.. ఊర్వశిని ఏమైనా అంటే చాలుమరి..
కోపం వచ్చేస్తుంది నీకు..
"ఊర్వశి స్త్రీ, ఊర్వశిదేవి, ఊర్వశి మోహినీ హాసమల్లి రుచి,
వైజయంతీ పరిమళము" అంటూ ఆమెను వెనకేసుకొస్తావు..
మా బాధ ఎవరికి చెప్పాలి చెప్పు.
నువ్వులేక యిక్కడ..

మావికొమ్మ, కోయిలమ్మ, మాధవీలత, కోవెలతోట,
సన్నాయి, గవాయి, హరివిల్లు, విరిజల్లు, వసంతం, కవిత్వం
కోమాలోకి వెళ్ళిపోయి చాలా కాలమైంది.
'క్షీరసాగర గర్భం నుంచి, కైలాస పర్వత శృంగం నుంచి,
అణువణువు నుంచీ నేను పంపే సందేశాలు...
ప్రేమ సందేశాలు, ఆనంద సందేశాలు, కల్యాణ సందేశాలు' అని నువ్వంటావు

కానీ యిక్కడ మాకన్నీ సందేహాలే..!

నువ్వు లేని తెలుగు సినిమా పాటైతే మరీను...

యింగ్లీషు కాన్వెంటులో చేరిన పసిపిల్లాడిలా తెలుగు మరిచిపోయింది,

నిర్మాతలూ దర్శకులూ ఆ పిల్లాడి తల్లిదండ్రుల్లా మమ్మీ డాడీ అని పిలిపించుకొని మురిసిపోయే పనిలో తలమునకలై ఉన్నారు..

నువ్వేమో తెలుగు సినిమా పాటకి పాలనురుగుతో స్నానం చేయించి పూలపరిమళాల సాంబ్రాణి పొగవేసి కళ్ళకి మెరుపుల కాటుకలద్ది, జరీపూల అంగీకట్టి, పారిజాతాలు మల్లెలు కలిపిన అత్తరులద్ది..

తెలుగువాళ్ళ వాకిట్లో ఆడుకోడానికి పంపితే..



ఎవరోపాపం.. బురద గుంటలోకి తోసేశారు.. అందులోంచి బయటికి రాలేక ఉక్కిరిబిక్కిరి అయిపోతోంది.

చేతకాని వాళ్ళలా చాలమంది చూస్తూ కూర్చున్నారు.. వాళ్ళలో నేనూ ఉన్నాను.. నా చేతకాని తనానికి..

అహంభో అభివాదయే!!

"మాట నడిచే మనిషైతే పాట ఎగిరే పక్షి"అని నీ మాటగా చెప్పినా ఎవ్వడూ వినటం లేదు. పాశ్చాత్య పదబంధుర పంజరాల్లో బంధించేయమంటున్నారు పసిపాటని. పాపం పసిపాపని..!!

అప్పుడు పుట్టివుంటే.. అని కలలుగన్నావు కానీ యిప్పుడు పుట్టివుంటే తెలిసుండేది మా బాధ. ఐనా బాధ గురించి నేను చెప్పడమేంటి? మనిషి బాధని మనసు బాధని నీకు తెలిసినంతగా ఎవరికి తెలుసు చెప్పు..

'నేను హేమంత కృష్ణానంత శర్వరిని, నాకు కాలమ్మొకటే కారురూపు నా శోకమ్ము వలెనె, నా బ్రతుకు వలె, నా వలెనె..' అని వాపోయిన వాడివి నువ్వు.

అస్తమానం లోకాన్ని నిందిస్తూ కూర్చోవటమే నా పని అనుకోకు. ఏమాటకామాట చెప్పుకోవాలి..

ఈ మధ్య 'మల్లీశ్వరి' అని ఓ సినిమా మళ్ళీ తెలుగు తెరకెక్కింది. మల్లీశ్వరి పేరు వినగానే ఎన్టీయార్ భానుమతి కన్న ముందు నువ్వు గుర్తొచ్చావు మాకందరికీ..

ఎలా మరచిపోగలం చెప్పు నీ పాటల్ని.. 'ఎగసిన హృదయము పగలనీకుమా' అని జాగ్రత్త చెబుతూనే నీ పాటల్లో మా హృదయాల్ని ఎగరవేసి చటుక్కున నువ్వు జారుకొని, మా హృదయాల్ని జారవిడిచావు.. అవి పగిలి కుమిలిపోతున్నాయి.. ఆ హృదయ శకలాలన్నీ "కృ.శా. కృ.శా." అంటూ కృశించిపోతున్నాయి.

జ్ఞాపకాలు సైకతాల మీద పద చిహ్నాల వలె చెరిగిపోతాయంటారు. కానీ నీ జ్ఞాపకలు మాత్రం ఊర్వశి ఉన్నంత కాలం ఉంటాయి... తెలుగు భాష మీద ఒట్టు...

నువ్వు మళ్ళీ వస్తావు కదూ... ఏ కవి కలం నుంచి పాటగా వస్తావో మరి.. నా కలం నుంచే రావాలన్న స్వార్థం నాకు లేదు.. నువ్వెలాగైనా సరే మళ్ళీ రావాలి.. నీ కోసం నిరీక్షిస్తూ....

- కులశేఖర్

# దేవులపల్లి కృష్ణశాస్త్రి హిట్స్

## చిత్రం : మల్లీశ్వరి

సంగీతం: ఎస్.రాజేశ్వరరావు  గానం: భానుమతి, ఘంటసాల

మల్లి: ఆకాశ వీథిలో హాయిగా ఎగిరేవు!
దేశ దేశాలన్ని తిరిగి చూసేవు!
ఏడ తానున్నాడో బావ, జాడ తెలిసిన పోయిరావా!
అందాల ఓ మేఘమాల ! చందాల ఓ మేఘమాల!
రాజు: గగన సీమల తేలు  ఓ మేఘమాల!
మా ఊరు గుడిపైని మసలి వస్తున్నావా!
మల్లి మాటేదైన నాతో మనసు చల్లగ చెప్పిపోవా!
నీలాల ఓ మేఘమాలా! రాగాల ఓ మేఘమాల!
మల్లి: మమత తెలిసిన మేఘమాల !
నా, మనసు బావకు చెప్పిరావా!
ఎన్నాళ్ళు నా కళ్ళు దిగులుతో రేపగలు
ఎదురు తెన్నులు చూచెనే - బావకై,
చెదరి కాయలు కాచెనే
అందాల ఓ మేఘమాల ! చందాల ఓ మేఘమాల!
రాజా: మనసు తెలిసిన మేఘమాల ! మరువలేనని చెప్పలేవా!
మల్లితో - మరువలేనని  చెప్పలేవా!
కళ్లు తెరచిన గాని, కళ్లు మూసిన గాని
మల్లి  రూపే నిలిచెనే - నా చెంత, మల్లి మాటే పిలిచెనే!
మల్లి: జాలి గుండెల మేఘమాల ! నా, బావలేనిది బ్రతుకజాల!
కురియు నా కన్నీరు గుండెలో దాచుకొని
వాన జల్లుగ కురిసిపోవా! కన్నీరు,
ఆనవాలుగ బావమ్రోల!

## చిత్రం : సుఖదుఃఖాలు

సంగీతం:  యస్.పి.కోదండపాణి  గానం:యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

మేడంటే మేడా కాదు!
గూడంటే గూడూ కాదు!
పదిలంగా అల్లుకున్న పొదరిల్లు
మాదీ, పొదరిల్లు మాదీ-  ॥మేడ॥
నేనైతే ఆకూ కొమ్మా !
తానైతే వెన్నెల వెల్లా !  ॥నేనైతే ॥
పదిలంగా నేసిన, పూసిన,
పొదరిల్లు మాదీ -పొదరిల్లు మాదీ -  ॥మేడ॥
కోవెల్లో వెలిగే దీపం దేవి నా తల్లి !
కోవెల్లో తిరిగే పాటల గువ్వ నా చెల్లి !
గువ్వంటే గువ్వాగాదు
గోరవంక గానీ,
వంకంటే వంకగాదు
నెలవంకగానీ  ॥మేడ॥
గోరింక పెళ్లైపోతే
ఏ వంకో వెళ్ళిపోతే  ॥గోరింక॥
గూడంతా గుబులై పోదా
గుండెల్లో దిగులై పోదా  ॥మేడ॥

## చిత్రం : ఉండమ్మా బొట్టు పెడతా

సంగీతం:కె.వి.మహదేవన్  గానం:యస్.పి.బాలసుబ్రహ్మణ్యం,సుశీల

రావమ్మా  మహాలక్ష్మి రావమ్మా !
రావమ్మా  మహాలక్ష్మి రావమ్మా !
నీ కోవెల ఈ యిల్లు కొలువై ఉందువుగాని !  ॥నీ కోవెల॥
కొలువై ఉందువుగాని - కలుములరాణి  ॥రావమ్మా॥
గురివిందా పొదకిందా - గొరవంకా పలికే !
గోరింటా కొమ్మల్లో కోయిల్లు పలికే!
తెల్లారి పోయింది - పల్లె లేచింది
పల్లియలో ప్రతి యిల్లూ కళ్లూ తెరిచింది  ॥రావమ్మా॥
కడివెడు నీళ్ళు కలాపిచల్లి  గొబ్బిళ్ళో  గొబ్బిళ్ళో !
కావెడు పసుపూ గడపకు పూసి గొబ్బిళ్ళో గొబ్బిళ్ళో !
ముత్యాల ముగ్గుల్లో ! ముగ్గుల్లో గొబ్బిళ్ళో !
రతనాల ముగ్గుల్లో ! ముగ్గుల్లో  గొబ్బిళ్ళో !  ॥రావమ్మా॥
కృష్ణార్పణం
పాడిచ్చే గోవులకు పసుపూ కుంకం!
పనిచేసే బసవనికి పత్రీపుష్పం !
గాదుల్లో ధాన్యం ! కావిళ్ళా భాగ్యం
కష్టించే కాపులకూ - కలకాలం సౌఖ్యం
కలకాలం సౌఖ్యం  ॥రావమ్మా॥  కృష్ణార్పణం

## చిత్రం : ఏకవీర

సంగీతం: కె.వి.మహదేవన్  గానం: ఘంటసాల, బాలసుబ్రహ్మణ్యం

ప్రతీరాత్రి వసంత రాతి ప్రతిగాలి పైరగాలి
బ్రతుకంతా ప్రతి నిమిషం పాటలాగ సాగాలి  ॥ప్రతీ॥
ప్రతి నిమిషం ప్రియా ప్రియా పాటలాగా సాగాలి  ॥ప్రతీ॥
నీలో నా పాట కదలి నాలో నీ అందె మెదలీ
లోలోన మల్లెపొదల పూలెన్నో విరిసీ విరిసీ
లోలోన మల్లెపొదల పూలెన్నో విరిసీ విరిసీ
మనకోసం ప్రతి నిమిషం మధుమాసం కావాలి
మనకోసం ప్రియా ప్రియా మధుమాసం కావాలి  ॥ప్రతీ॥
ఒరిగింది చంద్రవంక వయ్యారి తారవంకా
ఒరిగింది చంద్రవంక వయ్యారి తారవంకా
విరజాజి తీగ సుంత జరిగింది మావిచెంత
విరజాజి తీగ సుంత జరిగింది మావిచెంత
నినుజూచీ ననుజూచీ వనమంతా వలచిందీ
నినుజూచీ ప్రియా ప్రియా వనమంతా వలచిందీ  ॥ప్రతీ॥

## చిత్రం : భక్తశబరి

సంగీతం: పెండ్యాల  గానం:పి.బి.శ్రీనివాస్

ఏమి రామకథ శబరి ! శబరి! ఏది మరియొక సారి!
ఏమి రామకథ -రామకథా సుధ ఎంత తీయనిది ! శబరి !శబరి!  ॥ఏమి రామ॥
రవికుల శశియై, రాఘవుడై, రాముడయి, గుణధాముడయి,
అవతరించునట హరి మనకై దాశరథీ దయాశరధి ॥ఏమి॥
వాలుకనుల ఆ జానకిని, ఓరకనుల ఒకసారి గని,
కేల శివుని విల్లందుకొని, లీల విరిచెనుట
నీలనీరదశ్యాముడట! కళ్యాణరాముడట  ॥ఏమి॥
మౌని భార్య మర్యాద చెడి ధూళిపడి, శిలయైన జాలిపడి
దీనురాలి తన పదముల తాకి ప్రాణమొసగు కారుణ్యధాముడట  ॥ఏమి॥

ఫిబ్రవరి 18 మహాశివరాత్రిని పురస్కరించుకుని.....




కొన్ని చిత్రాలు - వాటిని నిర్మించిన సంస్థలకు ప్రతిష్ఠాత్మకంగా నిలిచిపోతే, మరికొన్ని చిత్రాలు సినీ రంగానికే గర్వకారణంగా మిగిలిపోతాయి. ఎన్.ఎ.టి. సంస్థ నిర్మించిన




చిత్రాన్ని ద్వితీయ శ్రేణికి చెందిన చిత్రాలలో ఓ అద్వితీయ చిత్రంగా ఉదహరించవచ్చు. నెగిటివ్ ఇమేజ్ కలిగిన రావణుని పాత్రను తొలిసారి కథానాయకుని స్థాయిలో ఎన్.టి.ఆర్. తీర్చిదిద్ది తానే ధరించడం, ఒక్క ఫ్రేమ్‌లో కూడా రాజీపడకుండా మొత్తం చిత్రాన్ని కళాత్మకంగా ఆయన మలచిన తీరు, ఉత్కృష్ట ప్రమాణాలతో కూడిన సంగీత సాహిత్య గానాలు నటన - ఇవన్నీ ఆ చిత్రానికి చిరకీర్తిని, స్థిరకీర్తిని కట్టబెట్టాయి. ఈ చిత్రానికి ఎన్.టి.ఆర్. దర్శకత్వం వహించినా దర్శకుడుగా తన పేరును వేసుకోలేదు. 'యూనిట్' అంటూ ఆ క్రెడిట్‌ని తన బృందానికి పంచారు. ఈ చిత్రానికి గాలి పెంచలనరసింహారావు సంగీత దర్శకుడు, మాటలు-పాటలు సీనియర్ సముద్రాల రచించారు. ఈ చిత్రంలోని ప్రతీ స్వరరచనకు ఓ ప్రత్యేకత ఉంది. నేటికి ప్రాచుర్యాన్ని కలిగిన కొన్ని స్వరరచనలు ఈ సంచికలో....

దేవ దేవ పరంధామ నీల మేఘ శ్యామా
దేవ దేవ పరంధామ నీల మేఘ శ్యామా
నిన్ను విడచి తనను మరిచి
హుంకరించు అహంకారి
నిన్ను విడచి తనను మరిచి
హుంకరించు అహంకారి
కానలేడు నీ మహిమ
కానలేడు నీ మహిమ
నటన సూత్రధారి
దేవ దేవ పరంధామ నీల మేఘ శ్యామా
దేవ దేవ పరంధామ నీల మేఘ శ్యామా





రకరకాల చరణాల చొప్పున విభజించబడినా 'దేవ దేవ పరంధామ నీలమేఘశ్యామ' అనే ఒకే మకుటం పల్లవిగా కలిగిన ఈ పాట చిత్రంలో రక రకాల సందర్భాలలో వస్తుంది. కుంభకర్ణ విభీషణులతో ఆకాశంలో పయనిస్తున్న రావణుడు తన పుష్పకవిమానం మార్గమధ్యంలో ఆగిపోవడానికి కారణం సతీసమేతుడై శివుడు తాండవ కేళి జరిపే సమయమని నారదుని ద్వారా తెలుసుకొని, శివుని ప్రసన్నం చేసుకోవడానికి వెళుతుండగా నారదుడు నర్మగర్భంగా పాడిన చరణమది. దీనిని పి.బి. శ్రీనివాస్ ఆలపించగా కాంతారావు (నారదుడు), ఎన్.టి.ఆర్ (రావణుడు), కన్నడ నటుడు ఉదయ్‌కుమార్ (కుంభకర్ణుడు ), జూనియర్ ఏవీ సుబ్బారావు (విభీషణుడు) పై చిత్రీకరించారు. హిందోళరాగాన్ని పల్లవికి, ఆరభి రాగాన్ని చరణానికి ఉపయోగించారు. చరణం తర్వాత వచ్చే పల్లవిని తిరిగి ఇదే ఆరభి రాగంలో స్వరపరచడం సంగీతపరంగా చెప్పుకోదగ్గ విశేషం.

కానరార కైలాస నివాస
బాలేందుధరా జటాధరా హరా
కానరార కైలాస నివాస
బాలేందుధరా జటాధరా..... ॥కానరార॥
భక్తజాల పరిపాల దయాళ ॥భక్త॥
హిమశైలసుత ప్రేమ లోల ॥కానరార॥
నిన్ను చూడమది కోరితిరా...
నిన్ను చూడమది కోరితిరా...
నీ సన్నిధానమున చేరితిరా
నిన్ను చూడమది కోరితిరా...
నీ సన్నిధానమున చేరితిరా
కన్నడసేయక కన్నులు చల్లగ
మన్నన సేయరా గిరిజా రమణా ॥కానరార॥
సర్వభూషితాంగ కందర్పదర్పభంగ
సర్వభూషితాంగ కందర్పదర్పభంగ
భవపాశనాశ పార్వతీ మనోహర
హే మహేశ వ్యోమకేశ త్రిపుర హర
కానరార కైలాస నివాస
బాలేందుధరా జటాధరా హరా కానరార






ఈ పాటను ఘంటసాల గానం చేయగా ఎన్.టి.ఆర్, ప్రధాన పాత్రధారిగా అభినయించారు. ఈ పాటలో సముద్రాల ఉపయోగించిన ఎన్నో పదాలు, ఉపమానాలలో-కన్నడ సేయక (ఉపేక్షించక), కందర్ప దర్ప భంగ (మన్మథునికి గర్వభంగము చేసిన వాడు),వ్యోమకేశ (అకాశమే కేశములుగా కలవాడు) వంటి ప్రయోగాలు భక్తిగీతాలలో అతి అరుదుగా కనిపిస్తాయి. శంకరాభరణ రాగానికి సదుపమానంగా నిలిచిపోయే ఈ గీతానికి జవం, జీవం అన్నీఘంటసాలే...! ప్రతీ పదం యొక్క అర్థాన్ని సమర్థంగా తెరపై అవిష్కరించగలిగే నటుడు ఉంటే వాటిపరమార్థం సంపూర్ణంగా తెలిసిన గాయకుడు ఎంతగా ప్రాణ ప్రతిష్ట చేసి పాడగలడో నిరూపించే పాట ఇది. ఈ పాటను సాకల్యంగా సాధన చేసి ఇంటర్ లూడ్స్‌తో సహా మనసులో శ్వాశతంగా నిలుపుకోగలిగిన వారెవరైనా శంకరాభరణ రాగంపై కొంత పట్టుని సాధించగలిగానని చెప్పుకోవచ్చు - ఎందుకంటే ఈ పాటలో శంకరాభరణ రాగంతో పాటు ఆ రాగంలోని జన్యరాగాల నడకకు సంబంధించిన ప్రయోగాలన్నీ జరిగాయి కాబట్టి!

జయత్వదభ్ర విభ్రమద్భ్రమ ద్భుజంగ మస్ఫురత్
ధగధగ్గద్వినిర్గ మత్కరాళ ఫాలహవ్యవాట్
ధిమిద్ధిమిద్ధిమి ధ్వనన్మృదంగ తుంగ మంగళా
ధ్వనిక్రమ ప్రవర్తిత ప్రచండతాండవశ్శివాః
ఓం నమఃశివాయ
అగర్వ సర్వమంగళా కళాకదంబ మంజరీమ్
రసప్రవాహ మాధురీ విజృంభణా మధూవ్రతమ్
స్మరాంతకమ్ పురాంతకమ్
భవాంతకమ్ మఖాంతకమ్
గజాంతకాంధకాంతకమ్
తమంతకాంధకమ్ భజే
ఓం నమఃహరాయ
ప్రఫుల్లనీల పంకజ ప్రపంచ కాలిమచ్చటా
విడంబి కంఠ కంధరా రుచిప్రబంధ కంధరమ్
స్మరచ్ఛితమ్ పురచ్ఛితమ్
భవచ్ఛితమ్ మఖచ్ఛితమ్
గజచ్ఛికాంధ ఖచ్ఛితమ్
తమంత ఖచ్ఛితమ్ భజే





ఈ శివతాండవ స్తోత్రాన్ని ఘంటసాల గానం చేయగా ఎన్.టి.ఆర్. ప్రధాన పాత్ర ధారిగా అభినయించారు. ప్రామాణిక వృత్తంతో సాగిన ఈ స్తోత్రం రావణకృతమని, కానీ తగిన ఆధారాలు లేవని, అనూచానంగా వస్తున్నదని చెప్పుకుంటారు. హంసధ్వని రాగంతో మొదలైన ఈ స్తోత్రంలో 'అగర్వ

సర్వమంగళా కళాకదంబ మంజరీమ్' నుంచి 'ఓం నమః హరాయ' వరకూ వలజి రాగంలోనూ 'ప్రఫుల్ల నీల పంకజా' దగ్గర నుంచి 'తమంత ఖచ్చితమ్ భజే' వరకూ మోహనరాగంలోనూ స్వరపరిచారు. సినీగాయకులలో ఘంటసాల వంటి అదృష్టవంతుడు వేరొకరు లేరని చెప్పాలి. జన్మచరితార్థమయ్యే స్వరరచనలెన్నో ఆయనకు తన సంగీత జీవన యానంలో లభించాయి. ఆ అవకాశాలన్నిటినీ సద్వినియోగం చేసుకోవడమే కాక అవి వింటే తాను గాని, నటించిన నటుడుగాని శ్రోతల మదిలో మెదిలేటంత పటిష్టమైన ముద్రను ఏర్పరచుకోగలిగారాయన.

తన ప్రతిభావ్యుత్పత్తులతో, స్వరరచనను సంపూర్ణ అవగాహనతో ఆకళింపు చేసుకుని, పాత్ర స్వభావాన్ని తనలోకి అవహింప చేసుకుని, స్పష్టమైన ఉచ్చారణతో పాటు ప్రాణ ప్రతిష్ట చేసే విధంగా పాడాలంటే గాయకుడన్నవాడు ఎటువంటి వాటిని అభ్యసించాలి, సాధన చేయాలి అనే ప్రశ్నలకు సమాధానంలా, సజీవ ఉదాహరణగా ఈ స్తోత్రాన్ని ఘంటసాల ఆవిష్కరించిన పద్ధతి నిలుస్తుంది. గాయకుడి స్వరార్చన మన చెవికి సోకగానే మనసు పులకరించిపోవాలి. ఒళ్ళు జలదరించి పోవాలి. అప్రయత్నంగానే హస్తాలు ముకుళితమైపోవాలి. కళ్ళలో తన్మయుత్వంతో కూడిన తడి పరుచుకుపోవాలి. ఈ రకమైన అనుభూతులన్నింటినీ ఏకకాలంలో అందించారు ఘంటసాల ఈ స్తోత్రం ద్వారా. ఇక నటుడిగా ఎన్.టి.ఆర్. ఈ స్తోత్రానికి అభినయించిన తీరు-న భూతో న భవిష్యతి.

**పరమ శైవాచార పరులలో నత్యంత**
**ప్రియుడన్న యశము కల్పించినావు**
**తల్లి కోరిక దీర్ప దలచి వేడగ ఆత్మ**
**లింగమ్ము ప్రేమ నొసంగినావు**
**మును కుబేరుడు దోచుకొనిన లంకాపురీ**
**విభవమ్ము మరల ఇప్పించినావు**
**తలచుటే తడవుగా దర్శన భాగ్యమ్ము**
**కరుణించి నీడవై కాచినావు**
**స్వామీ భవదీయ దర్శనోత్సాహి నగుచు దరియ**
**యీ వేళ యీ నిషేధమ్ము లేల**
**వైరమేలయ్య మరచి నా నేరములను**
**కరుణ గనవయ్య కైలాస గిరినివాస**
**కరుణ గనవయ్య కైలాస గిరినివాస**



ఈ పద్యాన్ని ఘంటసాల ఆలపించగా రావణపాత్రధారియైన ఎన్.టి.ఆర్.పై చిత్రీకరించారు. కైలాసగిరిని రావణుడు పెకలించగా తాండవ చేస్తున్న శివునికి లయ తప్పుతుంది. పార్వతీదేవి పరిహాసదృక్కులకు కుపితుడైన పరమశివుడు తన పాదఘట్టనతో రావణుని బలగర్వాన్ని అణుస్తాడు. భంగపడిన రావణుడు ఖిన్నుడై శివుని కరుణ కోసం వేడుకుంటూ ఆలపించే పద్యమిది. ఈ పద్యాన్ని సింధుభైరవరాగంలో స్వరపరిచారు.



పుష్పక విమానంపై వెళ్ళే రావణుడు నారదుని సూచనపై కైలాస పర్వతానికి వచ్చి శివుని చూడగోరి గానంతో ప్రార్థించి, విఫలుడై బలిమితో కైలాస పర్వతాన్ని పెకలించబూని, భంగపడి తిరిగి ఆత్మార్పణ మార్గంలో తన ప్రేవులనే తంత్రులుగా చేసి రుద్రవీణను పలికించి శివుని మెప్పించే వరకూ గల ఈ సన్నివేశం నిడివి పరంగా చూసుకుంటే ఎంతో పొడవైనది. సుమారు 15 నిమిషాల పాటుగా ఏక బిగిన సాగే ఈ సన్నివేశం ఎక్కడా విసుగు చెందనీయకుండా ఈ నాటికీ ఆ చిత్రానికి ఓ ప్రత్యేక ఆకర్షణలా ఉందంటే అందుకు కారణం సంగీత సాహిత్య గాన నటనా కౌశలాలే. రుద్రవీణ పలికించే సన్నివేశంలోని నేపథ్యానికి వీణను వాయించింది కీ॥శే॥ ఈమని శంకర శాస్త్రి.

హే పార్వతీ నాథ కైలాస శైలాగ్రవాసా
శశాంకార్ధ మౌళి ఉమాదేవతోల్లాసీ సవ్యాంగ భాగా
శ్రితానందదాయిస్మితాపాంగా
భస్మీకృతానంగ గంగాధరా
సర్వసంతాప హరా, హరా
శివా సదాశివా
నీయున్న చందంబు నేనంత
యూహింపగా వచ్చు
నేదములున్నీవ వాదమ్ములున్నీవ
ధైర్యంబులున్నీవ మర్మంబులున్నీవ
సర్వంబులున్నీవ
నీ లెంక లైనట్టి దాసుండ నైనట్టి
నన్నున్ దయాకుండవై ప్రీతి రక్షింపవే
తప్పు సైరింపవే దేవ మన్నింపవే
దేవదేవా మహాదేవదేవా నమస్తే నమస్తే నమః



శివుని ప్రసన్నం చేసుకున్న రావణుడు స్తుతించిన స్తోత్రమిది. ఘంటసాల ఆలపించగా ఎన్.టి.ఆర్. ప్రధానపాత్రధారిగా అభినయించారు. ఈ స్తోత్రం తొలిభాగం ఆరభి రాగంలో మొదలయి 'నీయున్న చందంబు' దగ్గర్నుంచి మాయమాళవ గౌళ రాగంలోకి మారిపోతుంది.

దానకుల వైరి దర్పంబు వర్ణించు
చదువు లెవ్వరుగాని చదువరాదు
సురపక్షపాతి విస్ఫురణకై గావించు
యాగంబు లేవియు సాగరాదు
అమరుల మేలుకై ఆచరించెడి యజ్ఞ
గుడంబులందగ్ని మండరాదు
హర నామమేగాని హరి నామధేయంబు
త్రిజగాల నెవ్వరు స్మరించరాదు
అమరలోక విజేత లంకాధినేత
అమరలోక విజేత లంకాధినేత
రావణుని శాసనంబు నిరాకరించు
విష్ణుదాసుల బట్టి కేల్ విరచిగట్టి
చెఱను నెట్టుడు దానవ శ్రేష్ఠులారా!





శివుడొసగిన వరగర్వంతో దిక్పాలులందర్ని తన బానిసలుగా చేసుకుని - విష్ణుభక్తిని బోధించే చదువులు ఎవ్వరూ చదువరాదని, అమరులైన దేవతల మేలు కోసం చేసే యజ్ఞాలు ఇక సాగరాదని, శివుని పేరు తప్ప విష్ణువు పేరును ముల్లోకాలలో ఎవ్వరూ స్మరించరాదని, అలా కాదని జపించే విష్ణుభక్తులకు పెడరెక్కలు విరిచి చెరలో వేయమని రావణుడు తన అనుచర అసుర గణాలకు తెలిపే పద్యమిది. ఈ పద్యంలో 'అమరలోక విజేత -లంకాధినేత' అనే పదాలను తొలుత యన్.టి.ఆర్ పలుకుతారు. తిరిగి ఘంటసాల కంఠంతో అవే పదాలు పునరుక్తి అవుతూ పద్యం కొనసాగుతుంది. ఎన్.టి.ఆర్. గాత్రం, నవ్వు, ఆ తర్వాత ఘంటసాల ఒక ఊపుతో అందుకొని పాడినతీరు - ఈ పద్యానికి అమరిన ప్రత్యేక ఆకర్షణ. ఇదికాక - గమనిస్తే స్వరపరంగా ప్రత్యేకత కలిగిన మరొక ఆక్షరణ వుంది. అది- అయిదు రాగాలలో ఈ పద్యాన్ని స్వరపరిచడం. 'దానవకులవైరి' దగ్గర్నుంచి 'చదువరాదు వరకు మెహన రాగాన్ని, 'సురపక్షపాతి' దగ్గర్నుంచి యాగంబు లేవియు సాగరాదు' వరకు ఖరహరప్రియ రాగాన్ని, 'అమరుల మేలుకై ఆచరించెడి' దగ్గర్నుండి 'అగ్ని మండరాదు' వరకు కేదారగౌళ రాగాన్ని 'హరనామమే గాని' దగ్గర్నుంచి 'స్మరించరాదు' వరకు సింహేంద్ర మధ్యమం రాగాన్ని, 'అమరలోక విజేత లంకాధినేత' దగ్గర్నుంచి పద్యం చివరి వరకు శ్రీరాగాన్ని ఉపయోగించారు.

పైన ఉదహరించిన పద్యాల్లో రాగాలను ఉపయోగిస్తున్నప్పుడు ఒకరాగంలో ఇంకొక రాగాన్ని మిశ్రమం చేయకపోవటం, ఒక రాగంలోంచి ఇంకొక రాగంలోకి వెళుతున్నప్పుడు 'జంప్' అనిపించేలా కాకుండా ఎంతో హాయిగా సంచారం చేయడం - విశేషంగా పేర్కొనక తప్పదు. ఆ ఘనత సంగీత దర్శకుడు గాలి పెంచలనరసింహారావుదే. ఆ కీర్తి కట్టబెట్టవలసింది కూడా ఆయనకే. (చాలామంది ఆయన పేరుని గాలిపెంచల నరసింహారావు అని పలుకుతారు. నిజానికి గాలి ఆయన ఇంటిపేరు. ఆయన పేరు పెంచల నరసింహారావు. అందుచేత గాలి (గ్యాప్ఇచ్చి) పెంచలనరసింహారావు అని వ్యవహరించటం సబబని కొందరి అభిప్రాయం) సంగీత దర్శకుడు ఎంత ప్రతిభావంతుడైనా, సమర్థుడైన గాయకుడు లేకపోతే కళావిష్కరణలో స్పందన, శాశ్వతత్వం కొరవడుతుంది. ఈ కోణంలోంచి చూస్తే పైన ఉదహరించిన పాటలు, పద్యాలు ఇప్పటికీ మనగుండెల్లో మార్మోగుతూ ఉండడానికి కారణం అర్థమయిపోతుంది.

ఈ చిత్రంలోని మరికొన్ని పాటలు, పద్యాల గురించి వచ్చే సంచికలో....

రచన : దాశరథి గానం : ఘంటసాల

గోరొంక గూటికే చేరావు చిలకా
భయ మెందుకే నీకు బంగారు మొలకా
ఏ సీమదానవో - ఎగిరెగిరి వచ్చావు
అలసి వుంటావు - మనసు చెదిరివుంటావు
మా మల్లెపూలు నీకు - మంచి కథలు చెప్పునే
ఆద మరచి ఈ రేయి - హాయిగా నిదురబో - ॥గోరొంక॥
నిలువలేని కళ్ళు - నిదరపొమ్మన్నాయి
దాగని చిరునవ్వులు వద్దన్నాయి - అబ్బా వుండన్నాయి
పైట చెంగు రెపరెపలు - పదపదలెమ్మన్నాయి
పలుకైనా పలుకవా - బంగారు చిలకా! ॥గోరొంక॥

రచన : దాశరథి గానం : సుశీల

గోరొంక కెందుకో - కొండంత అలక
అలకలో యేముందో - తెలుసుకో చిలకా!
కోపాలలో యేదో కొత్తర్థముంది
గల్లంతులో యేదో గమ్మత్తువుంది
ఉఉములు, మెఉపులూ ఊరికే రావులే
వానజల్లు పడునులే - మనసు చల్లపడునులే! ॥గోరొంక॥
మాటేమొ పొమ్మంది - మనసేమొ రమ్మంది
మాటకు మనసుకు మధ్యన తగువుందీ
తగువు తీరేదాక తలుపు తీయొద్దులే
ఆదమరచి అక్కడే - హాయిగా నిదురబో ॥గోరొంక॥

రచన : ఆరుద్ర గానం : పి.సుశీల

ఎంకొచ్చిందోయ్ మావ ఎదురొచ్చిందోయ్
ఎదురొచ్చి నీకోసం ఏదో తెచ్చిందోయ్ ॥ఎంకొ॥
గళ్ళకోక నువ్విస్తే కట్టుకొన్నదోయ్
కళ్లతోను కవ్విస్తే నవ్వుకున్నదోయ్
నవ్వులన్ని నాగమల్లి పువ్వులన్నదోయ్
నచ్చినోడికే మనసు ఇచ్చుకున్నదోయ్ ॥ఎంకొ॥
మావ కూతురనుకుంటూ మనసు పడితివోయ్ నువ్వు
మనసుపడ్డ ఏసమే తాను కట్టెనోయ్
దోసిలితో వలపు నువ్వు దోచుకుంటివోయ్ - నీ
ఆసికాలు నమ్ముకుని ఆసపడ్డదోయ్ మావ ॥ఎంకొ॥
తగవులాడినా సాలు తనివితీరునోయ్ - నీ
వగలమారి మాటలన్నీ నగలవంటివోయ్
తాళిబొట్టు మాత్రమే తక్కువన్నదోయ్ - నీ
తల్లో నాలుకమల్లె తాను మెలుగునోయ్! మావ ॥ఎంకొ॥

రచన : ఆరుద్ర గానం : పిఠాపురం నాగేశ్వరరావు, స్వర్ణలత

అ: డివ్విడివ్విడివ్విట్టం నువ్వంటేనే నా కిష్టం
ఆ :డీడిక్కంది అదృష్టం గట్టెక్కింది మనకష్టం
అ: బాజాలతో బాకాలతో పందిట్లో ఇద్దరం ఒకటౌదాం ॥డివ్వి॥
అ: అందరు చుట్టాలు వస్తారు - ఆనందమానందమంటారు
ఆ: అబ్బాయి తొందర చూస్తారు - తాము అటుతిరిగి పక పక నవ్వేరు॥డివ్వి॥
ఆ: కవ్వించి సిరులెన్ని కలిసొచ్చినా కాబోవు పెళ్లామె కడు పచ్చనా
అ: కొండను వేశాను ఒక నిచ్చెన - నీ కొంగు తగిలితే ఒళ్లు మనువెచ్చనా॥డివ్వి॥
అ: బుజ్జో వసంతాలు చల్లుకుంటాం - ఎంచక్కా తలంబ్రాలు పోసుకుంటాం
ఆ: దీవించి వేస్తారు అక్షింతలు -
ఇక అవుతాయి సౌఖ్యాలు లక్షింతలు ॥డివ్వి॥

రచన : ఆత్రేయ గానం :ఘంటసాల, సుశీల

అతడు : అడగక ఇచ్చిన మనసే ముద్దు
ఆమె : అందీ అందని అందమె ముద్దు
అతడు : విరిసీ విరియని పువ్వే ముద్దు
ఆమె : తెలిసీ తెలియని మమతే ముద్దు ॥అడగక॥
అతడు : నడకలలో నాట్యం చేసే
నడుము చూస్తే పిడికెడు ముద్దు
ఆమె : పొగిడి పొగిడి బులిపించే నీ
చిలిపి పలుకులు చిటికెడు ముద్దు ॥అడగక॥
అతడు : చక చకలాడే పిఉదులు దాటే
జడను చూస్తే చలాకి ముద్దు
ఆమె : కలకాలం తల దాచుకొమ్మనే
ఎడదను చూస్తే ఏదో ముద్దు ॥అడగక॥
అతడు : పచ్చని చేలే కంటికి ముద్దు
వెచ్చెలి నవ్వు జంటకు ముద్దు
ఆమె : చెట్టూ చేమా జగతికి ముద్దు
నువ్వూ నేనూ ముద్దుకు ముద్దు ॥అడగక॥

రచన : ఆత్రేయ గానం : ఘంటసాల, సుశీల

ఆమె : అందలం ఎక్కాడమ్మా - అందకుండ పోయాడమ్మా
ఇంతవాడు ఇంతకు ఇంతై - ఎంతో ఎదిగి పోయాడమ్మా ॥అం॥
నిన్న రేతిరి తానూ, పొన్న చెట్టునీడ
ఎన్ని వూసులో చెప్పీ ఎన్ని బాసలో చేసి
ఒడిలోన ఒదిగినాడమ్మా - నా
ఎద నిండ నిండినాడమ్మా - ॥అం॥
ఆ మాటలకు నేను మైమరచి పోయాను
ఆ మత్తులో కాస్త కనుమూసి ఒరిగాను
భళ్ళున తెల్లారి పోయెనమ్మా - ఒళ్ళు
ఝల్లునా చల్లారి పోయెనమ్మా -
అతడు: అందాన్ని చూచానమ్మా - అందలం ఎక్కానమ్మా
ఎంతవాణ్ణి ఎంతైనా నే నీలో ఇమిడిపోతానమ్మా ॥అం॥
వెన్నపూసవంటీ - కన్నెపిల్ల వుంటె
సన్నజాజులె సిరులూ - మల్లె పూవులె మణులు
నువు లేక కలిమిలేదమ్మా - నీకన్న కలిమి ఏదమ్మా ॥అం॥

రచన : ఆత్రేయ గానం : ఘంటసాల,సుశీల

ఆమె : మెల్ల మెల్ల మెల్లగా అణు వణువూ నీదెగా
మెత్తగ అడిగితే లేదనేది లేదుగా - ॥మెల్ల॥
ఆమె : నీది కానిదేదిలేదు నాలో
నిజానికి నే నున్నది నీలో
అతడు : ఒక్కటే మనసున్నది ఇద్దరిలో
ఆ ఒక్కటీ చిక్కె నీ గుప్పిటిలో... ॥మెల్ల॥
అతను : నిన్ను చూచి నన్ను నేను మరచినాను
నన్ను దోచుకొమ్మనీ నిలచినాను
ఆమె : దోచుకుందమనే నేను చూచినాను
చూచి చూచి నువ్వె నన్ను దోచినావు ॥మెల్ల॥
ఆమె : కన్నులకు కట్టినావు, ప్రేమగంతలు
కన్నెమనసు ఆడినాది దాగుడుమూతలు
అతను : దొరికినాము చివరకు తోడుదొంగలం
దొరలమై ఏలుదాము వలపు సీమలు ॥మెల్ల॥

రచన : ఆత్రేయ                                గానం : ఘంటసాల,సుశీల

అ : దేవుడనేవాడున్నాడా అని మనిషికి కలిగెను సందేహం
ఆ : మనుషులనే వారున్నారా అని దేవుని కొచ్చెను అనుమానం
అ : మనసు లేని ఈ మనిషిని చూచి దేవుడు రాయై పోయాడు
ఆ : ఆ దేవుడు కనబడలేదని మనిషి నాస్తికుడైనాడు ॥దేవుడనే॥
ఆ : పశువులకన్న పక్షులకన్న, మనిషిని మిన్నగ చేశాడు
బుద్ధిని ఇచ్చి హృదయాన్నిచ్చి, భూమే నీదని పంపాడు
అ : బుద్ధికి హృదయంలేక - హృదయానికి బుద్ధే రాక
నరుడే యీ నరలోకం - నరకం చేశాడూ ॥దేవుడనే॥
అ : తాము నవ్వుతూ నవ్విస్తారు కొందరు అందరినీ
ఆ : తామేడుస్తూ ఏడ్పించుతా రెందరో కొందరినీ
అ : నేను నవ్వితే ఈ లోకం చూడలేక ఏడ్చింది
ఆ : నే నేడిస్తే ఈ లోకం చూసి చూసి నవ్వింది ॥దేవుడనే॥

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| కెమెరా | : | పి.యల్.రాయ్ |
| పాటల రికార్డింగ్ | : | శివరాం (వాహిని) |
| సౌండ్ | : | కె.హరనాథ్ (వాహిని) |
| ఆర్టు | : | యస్.కృష్ణారావు |
| ఎడిటింగ్ | : | టి.కృష్ణ |
| డాన్సులు | : | హీరాలాల్, గోపాలకృష్ణ |
| స్టిల్స్ | : | సత్యం (జైహింద్ స్టూడియో) |
| దుస్తులు | : | కె.సూర్యారావు |
| మేకప్ | : | పీతాంబరం, మల్లికార్జునరావు, రామదాసు |
| కథ, మాటలు | : | ముళ్ళపూడి వెంకటరమణ |
| పాటలు | : | ఆత్రేయ, ఆరుద్ర, దాశరథి |
| సంగీతం | : | కె.వి.మహదేవన్ |
| నిర్మాత | : | డి.బి.నారాయణ |
| స్క్రీన్ ప్లే, దర్శకత్వం | : | ఆదుర్తి సుబ్బారావు |


డి.బి.నారాయణ


ఆదుర్తి సుబ్బారావు


ముళ్ళపూడి వెంకటరమణ


కె.వి.మహదేవన్


ఆత్రేయ


ఆరుద్ర


దాశరథి


ఘంటసాల


పిఠాపురం నాగేశ్వరరావు


పి.సుశీల


స్వర్ణలత

## నటీనటులు

ఎన్.టి.రామారావు, బి.సరోజాదేవి, గుమ్మడి, సూర్యకాంతం, రమణారెడ్డి, పద్మనాభం, శారద, అల్లురామలింగయ్య, రావి కొండలరావు, రాధాకుమారి, నాగయ్య, బాలతారలు సుమ, లత, తార, అముద, అవంతి

## కథా సంగ్రహం

మనిషికి మనసు కావాలి. మనసుకి శాంతి కావాలి. మనశ్శాంతి లేని మనిషికి ఎంత డబ్బున్నా ఒకటే. విశ్వసుందరరావు గారు కోటీశ్వరుడు. తను కూడదన్న పిల్లను పెళ్ళాడాడన్న కారణంతో ఒక్కగానొక్క కొడుకునీ ఇల్లు వెళ్లగొట్టాడు. కోటీశ్వరుడైనా మనిషి విలువ తెలిసే సరికి కొడుకూ, కోడలూ చనిపోయారు. అనాథుడైన మనవడిని ఓ దారిన పోయే దానయ్య చేరదీసి పెంచాడు. విశ్వసుంద(ర)రావుగారు మనవడి కోసం దేశమంతా గాలించినా ఆచూకి దొకరలేదు. తనవూళ్లో, తన మిల్లు గేటులోనే చిన్న హోటలు నడుపుతున్న సుందరయ్య తన మనవుడేనని తెలుసు కోలేకపోయాడు. జీవితం దాగుడుమూతలాడుతూనే వుంది.

విశ్వసుంద(ర)రావు మంచం పట్టగానే వారసులమంటూ బేవారుసు గాళ్లందరూ బంగళాలో మకాం వేశారు. ఆయన అన్నగారి అల్లుడు భూషణం, తమ్ముడి కోడలు సూరమ్మ పోటీలు పడి సేవలు పేరిట ఆయన్ని హింసించారు.

హోటలు సుందరయ్య; తననుపెంచిన దానయ్య బిడ్డలు ఐదుగురినీ సాకుతూ, పదిమందికీ పెడుతూ సుఖంగా వున్నాడు.

ఒకనాడు సుబ్బులు అనే చక్కని చిన్నది, సుందరయ్య జీవితంలో ప్రవేశించింది. ఇష్టంలేని పెళ్ళి తప్పించుకుని పారిపోయి వచ్చిన ఆ చిన్నదానికి ఆశ్రయమిచ్చాడు సుందరయ్య. మనసిచ్చి పుచ్చుకున్నాడు.

సుబ్బులు బంగళాలో నర్సు కమ్ సెక్రటరీ పనిని సంపాదించింది. కొద్ది రోజుల్లోనే సుంద(ర)రావుగారి అభిమానం, నమ్మకం, ఆ యింట్లో అధికారం సంపాదించుకుంది.

బే వారసులు ఇది చూసి బెదిరిపోయారు. 'నా కూతుర్ని నీ కోడలు చేసుకో; నీ కొడుకుని నేను దత్తు చేయిస్తాను' అంటూ భూషణం సూరమ్మతో చెప్పి, ముసలాయినతో బలవంతంగా దత్తతకి ఒప్పించాడు.

సుంద(ర)రావుగారి వద్దనున్న ఫోటో, సుందరయ్య తల్లిదండ్రుల ఫోటో ఒక్కలాగే వుండటం చూసింది సుబ్బులు. సుందరయ్యని తీసుకుని 'తాత గారూ మనవడిగో'' అంటూ బంగళాకు పరిగెత్తింది.

-----

మనవుడు దొరికిన మహోత్సాహంతో ఉత్సవాలు జరిపి, మూడో నాటికల్లా హాయిగా, ఆనందంగా కన్నుమూశాడు తాతగారు.

తమను కాదని, సుందరయ్య ఎడాపెడా దానధర్మాలు చేసేస్తుంటే భూషణానికీ, సురమ్మకూ కోపం వచ్చింది. తన కూతురు అమ్మడిని చేసుకుంటేనే ఆస్తి దక్కుతుందని, భూషణం ఓ దొంగవిల్లు సృష్టించాడు.

ఇది గ్రహించిన సుందరం, పై ఎత్తు వేయదలచి, అమ్మడితో కూడబలుక్కుని ఆ పెళ్ళికి సరేనన్నాడు. సుబ్బులు ఇదంతా నిజమే ననుకుంది. నొచ్చుకుంది. తన వూరెళ్ళిపోయింది. సుందరయ్య ఎంత నచ్చచెప్పినా వినలేదు.

సుందరయ్య నిస్పృహతో కోపంతో బంగళాకు తిరిగివచ్చాడు. అక్కడ పెళ్ళి ఏర్పాట్లు చూసి రెచ్చిపోయాడు. అక్కడి సంబరాలన్నీ తన్నివేసి, అడ్డొచ్చిన వాళ్ళని తోసివేశాడు.

వెంటనే భూషణం, సుందరానికి పిచ్చెక్కిందని ప్రకటించి, పిచ్చాసుపత్రిలో వేయించాడు.

తప్పించుకు పారిపోయాడు సుందరం. వూరంతా పిచ్చాడని రాళ్ళు రువ్వారు. సుబ్బులే అతని బెదురు తీర్చి వూళ్ళోకి తీసుకొచ్చింది. పోలీసులందరి ముందు సుందరయ్య జాలి గుండెను రుజువు చేసింది. భూషణం, సూరమ్మ వేసిన ఎత్తులన్నిటినీ అమ్మడు, పాపాయి బట్టబయలు చేశారు.

సుందరయ్య మంచితనాన్ని అందరూ గ్రహించారు.

సుందరయ్యకి, సుబ్బులుకి; అమ్మడుకి పాపాయికి వివాహం జరిగింది.

శుభం

# సరిగపదమని-11

**జవాబులు:-**

అడ్డం: 1.శుభమస్తు 3.జాబిలమ్మ 5.వాన 6.వేయి 8.కిట 10.రాజేష్ 11. పద 12.మావే 14.మాయ 16.మనసున 18.మనది 20.కోలకా 24. జాణవులే

నిలువు: 1.శుభవేళ 2.మల్లి, 3.జానకి 4.లచ్చి 7.రోజే 9.అందమైన 10.రావే **13.నాయుడి 15.ప్రేమ 17.[illegible] 19.[illegible] 20.కోడి 21.కల 22.వీణ 23 ఏలే**

## కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

ఎస్.పద్మావతి- ఒంగోలు, జి.మల్లికార్జున- కర్నూలు, సి.నళిని కుమారి- సికింద్రాబాద్, కావ్యప్రియ- అనంతపురం, ఆదిత్య- విశాఖపట్నం, కె.వి.సరస్వతి- హైదరాబాద్, మోచెర్ల సురేష్- రాజమండ్రి, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, పి.సురేష్‌బాబు- గూడూరు, వన్యం జానకీదేవి- పాత పాల్వంచ, ఎన్.ఫణి- హైదరాబాద్, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- అన్నవరప్పాడు (ప్రకాశం), నండూరి రామానుజాచార్యులు- విజయవాడ, వై.చందు- శ్రీకాకుళం, దేవరం సతీష్‌కుమార్- జగిత్యాల (కరీంనగర్), డి.శాంత లక్ష్మి - జగిత్యాల (కరింనగర్), డి.హారిత గాయత్రి- విశాఖపట్నం, కె.వి.దుర్గా మోహన రావు- నల్గొండ, కె.శిరీష- విసన్నపేట (కృష్ణా), అవధానం లక్ష్మీమోహన్- తిరుపతి, వై.రాజానాయుడు- మదనపల్లె (చిత్తూరు), వి.సింధుమోహన- చీపురుపల్లి (విజయనగరం), ఎన్.వాగ్దేవి- హైదరాబాద్, వి.సంధ్య- పటాన్‌చెరు (మెదక్), టి.జయశీల- హైదరాబాద్, సి.సంతోషిప్రవీణ- తరిగొండ, యర్రా వాణి- కాకినాడ, ఎమ్.వాణి- కాకినాడ, మద్దాలి సువర్చాలా శ్రీనివాస్- హైదరాబాద్, ఎమ్.జ్యోతి- కొడుమూరు (కర్నూలు), రమేష్ సొంసాళె- ఎమ్మిగనూరు, తాడి రంగారావు- రాజమండ్రి, బి.విజయలక్ష్మి- గూడూరు, మహమ్మద్ లతీఫ్- నాచారం (రంగారెడ్డి), ఎమ్.సుప్రీమ్- కోదాడ (నల్గొండ), అల్లూరి రామరాజు- విజయవాడ, డా॥ ఉప్పల వెంకట రమణయ్య- కడప, పి.సౌజన్య- సికింద్రాబాద్, ఉప్పులూరి సుబ్బారావు- మొగలికుదురు (తూ॥గో॥ జిల్లా), నహారె ఈరణ్ణ- ఆదోని, జి.శ్రీనివాసులు- ముక్తినూతలపాడు (ప్రకాశం), కె.సౌందర్యవల్లి- విజయవాడ, సి.హెచ్.దీపిక- విశాఖపట్నం, ఎ.ఆదినారాయణ- పోతవరం (గుంటూరు), ఆమంచి వెంకట లక్ష్మి కామేశ్వరి- రాజోలు (తూ॥గో॥జిల్లా), జి.నోబుల్ వాణి- గణపవరం (ప॥గో॥జిల్లా), పి.నరేష్- కడప, కె.మురళీకృష్ణ- సత్తెనపల్లి (గుంటూరు), పడాల రాము- పాతపట్నం (శ్రీకాకుళం), పులి శిరీష కుమారి- ప్రొద్దుటూరు, కుడుముల మృత్యుంజయుడు- అర్ధవీడు (ప్రకాశం), ఎస్.వి.హెచ్.ఎన్.శర్మ- హైదరాబాద్, సోమయాజుల రాహుల్- కొరాపూట్ (ఒరిస్సా), కె.వసుంధర- నల్గొండ, భానుప్రసాద్- కాకినాడ, ఎలమర్తి దేవేంద్ర- కర్నూలు, శిష్టా సీతామహాలక్ష్మి- హైదరాబాద్, ఎన్.వి.ఎస్.ఆర్.లక్ష్మి- సికింద్రాబాద్, జెంట్ల సంధ్య- జగ్గయ్యపేట (కృష్ణా), ఒ.ఎన్. విజయలక్ష్మి- హైదరాబాద్, పి.స్వాతిలక్ష్మి- చీపురుపల్లి (విజయనగరం), బి.జాకిర్‌హుస్సేన్- ఎమ్మిగనూర్, టి.కె.సాగర్‌కుమార్- ఎమ్మిగనూర్, రవికుమార్- హైదరాబాద్, ఇ.రాధిక- హైదరాబాద్, పింగళి శ్యామసుందర్- బెంగుళూరు, బి.జాన్సన్- అత్తిలి (ప॥గో॥ జిల్లా), మాడుగుల గురునాధశర్మ- అమ్మళ్ళదిన్నె (అనంతపురం), విరివింటి జయప్రకాష్ శాస్త్రి- వనపర్తి (మహబూబ్‌నగర్), వి.నాగస్వర్ణ అనసూయ- తెనాలి (గుంటూరు), ఎ.టి.శ్రీనివాసన్- అనంతపురం, సాలా రవికుమార్- విశాఖపట్నం, పి.షకీలాబాను- పాత గుంతకల్లు (అనంతపురం), డి.వెంకటేశ్వరరావు- గుంతకల్లు, ముంజులూరి శైలజ- సిర్పుర్ కాగజ్‌నగర్, బి.సోమరాజు- వీరనారాయణం (విజయనగరం), టి.బ్రహ్మయ్య- కుప్పాలపల్లి (కడప), ఎస్.విష్ణు ప్రియ- చిలకలూరిపేట, పి.వసంత- ఇబ్రహీం పట్నం (కృష్ణా), బి.సంతోష్‌నాయక్- కోహెడ (కరీంనగర్), జె.శ్రీదేవి- వనపర్తి (మహబూబ్‌నగర్), జె.సారాశ్రీ- వనపర్తి (మహబూబ్‌నగర్), పి.ఎస్.ఆర్. ప్రసాద్- నెల్లూరు, వై.ఇ.వి.నారాయణరావు- శ్రీకాకుళం, తాతా పద్మావతి- విశాఖపట్నం, పలక సుదర్శన్- విజయనగరం, ఎ.లక్ష్మి పద్మావతి- మేడ్చల్, ఇప్పగుంట వెంకట శ్రీనివాసన్- మౌలాలీ, యు.పి.ఎన్. ఆదిత్య- హైదరాబాద్, డా॥ ఎ.రాధిక- అమలాపురం, గోటేటి శేషగిరిజ- సికింద్రాబాద్, ఎమ్.బాల సుబ్రమణ్యం- తిరుపతి, పి.తిరుమలప్రసాద్- హైదరాబాద్, బిల్లంకొండ రాంబాబు- పమిడిపాడు (గుంటూరు), ఎమ్.రామలక్ష్మి- విజయవాడ, పి.వి.వి.అప్పారావు- రావులపాలెం (తూ॥గో॥జిల్లా), ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ, పి.శిరీష్‌కుమార్- రాజమండ్రి, పసుపులేటి సునీల్‌కుమార్- కొత్తూరు (ప॥గో॥జిల్లా), జి.దేవేంద్ర నాధరెడ్డి- పత్తికొండ (కర్నూలు), ఎ.పద్మిని- విశాఖపట్నం, తలికిచెర్ల రామకృష్ణ- విజయనగరం, యార్లగడ్డ మేరిగ్రేస్- ద్వారపూడి (తూ॥గో॥జిల్లా), బుగ్గారపు సునీల్‌కుమార్- ధర్మపురి (కరీంనగర్), వి.శ్రావణి- విశాఖపట్నం, వడ్లమన్నాటి నాగసాయి భరద్వాజ్- విజయవాడ, అపుర్వ భావన- పాలకొల్లు, పి.కృష్ణారావు- అమలాపురం (తూ॥గో॥జిల్లా), తులసిగోవింద ప్రసాద్- కాకినాడ, పల్లవి చెన్నమరాజు- కర్నూలు, సి.విజయసారథి- కర్నూలు, కె.మురళీమోహన్- మార్కాపూర్ (ప్రకాశం), పి.డేవిడ్‌రాజ్- ప్రొద్దుటూరు (కడప), అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), చిట్టా విశ్వేశ్వరశాస్త్రి- హైదరాబాద్, ఇ.తేజస్విని- చిత్తూరు, ఎమ్.వి.రాజశేఖరరెడ్డి- మార్కాపూర్ (ప్రకాశం), యు.విజయశేఖరరెడ్డి- హైదరాబాద్, టి.వి.ఎన్.శ్రీకాంత్- సికింద్రాబాద్, దూసి జయశ్రీ- హైదరాబాద్, పక్కి సుందరీకృష్ణ- గరివిడి (విజయనగరం), పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), కె.శ్రీవైష్ణవి- కడప, పి.వి. రామశర్మ- విశాఖపట్నం, ఫణికిరణ్- కొడాలి (కృష్ణా), యస్వి వరప్రసాద్- హైదరాబాద్, యం.లక్ష్మి శ్రావణి శ్వేత- గాజువాక, రాజర్ల పద్మజ- హైదరాబాద్, పెరవల్లి స్వరాజ్యలక్ష్మి- తిరుపతి, సామంచి కృష్ణ భువనచంద్ర- విజయవాడ, ఎన్.గాయత్రి- హైదరాబాద్, డి.ఎన్.కేదార్ చరణ్- తాడేపల్లిగూడెం, బొమ్మకంటి రవికిషోర్- హైదరాబాద్,

## ఒక తప్పుతో వ్రాసిన వారు:

ఎ.రాజశేఖర్‌రెడ్డి- మంగళగిరి (గుంటూరు), కేమా చంద్రయ్య- పమిడుపాడు (ప్రకాశం), పి.శేఖర్‌బాబు- ధర్మసాగర్ (వరంగల్), సురభి విజయలక్ష్మి- కాకినాడ, ఎ.శైలజ కిషోర్- జనగామ (వరంగల్), ఎమ్.సునంద లక్ష్మి- ఇబ్రహింపట్నం, ఎమ్.మాధురి రంగారావు- నల్గొండ, అమరా వెంకటేశ్వరరావు- నెల్లూరు, సామంచి శ్రీరాధ- విశాఖపట్నం, ఎమ్.రాధ కుమారి- ఉక్కునగరం, తనికెళ్ళ రామకృష్ణ- విజయవాడ, జవంగుల శ్రీనివాసరావు- సత్తెనపల్లి (గుంటూరు), మెతుకు మస్తానయ్య- ఒంగోలు, ఎస్.శేషకుమారి- దేవాపూర్ (ఆదిలాబాద్), నేతికార్ హనుమంతరావు- చండూరు (నల్గొండ), ముసలే అంబాజి రావు- వడ్డగేరి (కర్నూలు), ఈ.ప్రమీలారాణి- ఘట్‌కేసర్ (రంగారెడ్డి), వి.శేఖర్- నిజామాబాద్, జి.పాండురంగశర్మ- హైదరాబాద్, సి.వసంత నాగేశ్వరరావు- సికింద్రాబాద్, ఎమ్.వి. తేజస్విని- కర్నూలు, డా॥ సి.భువనేశ్వరి- శ్రీకాళహస్తి యల్లాప్రగడ ఇందిరాజ్యోతి- హైదరాబాద్, బి.వి.సూర్య నారాయణ- కళింగపట్నం (శ్రీకాకుళం), ఎ.మాధవీనాయుడు- హైదరాబాద్, గండూరి రామరాజు- హైదరాబాద్, జి.పూర్ణ చంద్ర శేఖర్‌రావు- ఖమ్మం, వెత్సా రామకృష్ణ- విజయనగరం, ఎ.టి.కాశీనాథ్- హైదరాబాద్, సి.భార్గవి- తరిగొండ, పి.ఎన్.కె.విశ్వనాథన్- విజయవాడ, వేరిలక్ష్మి- ఉప్పలూరు (కృష్ణా), డి.అమరేశ్వరరాయశర్మ- నిడుబ్రోలు (గుంటూరు), జ్యోతి.జి- వినుకొండ (గుంటూరు), కనపర్తి జగదీశ్- విజయవాడ, పి.ఎన్.కె.అలేఖ్య- కాకినాడ, తమిరశ జానకి- హైదరాబాద్, ఎమ్.దుర్గప్రసాద్- వరంగల్, డి.మెహెర్ గౌతం- పార్వతీపురం (విజయనగరం), కె.మహేశ్వరి- వైజాగ్, నరేన్ చక్రవర్తి- అనంతపురం, రావుల వేణుగోపాల్- కాజీపేట (వరంగల్), ఎన్.లీలా ప్రసూనదేవి- హైదరాబాద్, జి.జి.ప్రసాద రావు- కొత్తగూడెం (ఖమ్మం), డి.వేణుగోపాల్- అనంతపూర్, జయంతి మాధవకార్తిక్- విశాఖపట్నం, చక్రావధానుల సుభద్ర- నర్సాపురం, భారతి- అనంతపురం, బిహారా శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), యం.మానస- సికింద్రాబాద్, సి.హెచ్. పరాత్పర రావు- ఏలూరు (ప॥గో॥జిల్లా), మద్దుల అప్పారావు- అనకాపల్లి, లండ కపిల్ దేవ్- కొరసంజ (ఒరిస్సా), ఏలేశ్వరపు హారిత- మంగళగిరి, చల్లా రమణయ్య- కాజీపేట (వరంగల్), ఎల్.గాయత్రిదేవి- కడప, ఎన్.సుధీర్- హైదరాబాద్, కె.బి.మాణిక్యాంబ- కంకిపాడు, కడగాన రాము జానకి- జోగన్నపేట (శ్రీకాకుళం), ఎస్.సమీర- హైదరాబాద్, ఎమ్.డి. మొహిద్దీన్- మానేపల్లి (తూ॥గో॥జిల్లా), ఎన్.సి.సీతాదేవి- ఆత్రేయపురం (తూ॥గో॥జిల్లా), జి.పద్మజా- హైదరాబాద్, విజయ & ఉదయభాస్కర్- రాజమండ్రి (తూ॥గో॥జిల్లా), ఎస్.భక్తవత్సలరెడ్డి- హైదరాబాద్, పి.చంద్రశేఖరశాస్త్రి- అనంతపురం, ఎన్.వి.రామకాంత్- భువనేశ్వర్, ఎమ్.వి.ఎస్.ఎస్.ప్రసాద్- హైదరాబాద్, రాగం కనక ఉదయ భాస్కరరావు- ములగపూడి (తూ॥గో॥జిల్లా), జె.ఎస్.ఆర్.కె. ప్రసాద్- హైదరాబాద్, కె.లావణ్య- సంద్యాల, ఒ.రోహిత్- నిడుబ్రోలు (గుంటూరు), పి.వి.కె.రవితేజ- హైదరాబాద్, పి.అశ్విని- సికింద్రబాద్, రాయప్రోలు లక్ష్మీదేవి- హైదరాబాద్, వై.దుర్గారెడ్డి- వనపర్తి (మహబూబ్‌నగర్), గండూరి వెంకటశివ నాగస్వప్న- హైదరాబాద్, సి.రామకృష్ణా- అదిలాబాద్, జి.దుర్గా కుమారి- హైదరాబాద్,ఆత్మూరి వెంకట శరత్‌కృష్ణ- హైదరాబాద్, వి.రమణ- దేవరకొండ (నల్గొండ), బల్లూరు ఉమాదేవి- ఆదోని ఆర్.నాగమణి- హైదరాబాద్, సుదర్శనం రమాదేవి- పటన్‌చెరు (మెదక్), ఎ.పురుషోత్తంరావు- గజ్వేల్ (మెదక్), ఐ.ఎస్.కుమార్- గుమ్మలక్ష్మీపురం (విజయనగరం), ఐ.ఆర్.మణి- గుమ్మలక్ష్మీపురం (విజయనగరం), ఎ.సీతాదేవి- విజయవాడ, టి.సూర్యశ్రీ- హైదరాబాద్, కర్రి ఝాన్సీ- హైదరాబాద్, మల్లాది మైథిలిసౌజన్య- విశాఖపట్నం, యజ్ఞల జగన్నాథం- పాతపట్నం (శ్రీకాకుళం), రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- మల్కాజ్‌గిరి, ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, వాడ్రేవు సోమరాజు- కాకినాడ (తూ॥గో॥జిల్లా), ఒ.సాహితి- నిడుబ్రోలు (గుంటూరు), పి.వి.రామశాస్త్రి- సామర్లకోట, పి.వేణుగోపాల్ రావు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), డా॥ బి.ఎస్.ప్రసాద- భీమడోలు (ప॥గో॥జిల్లా), తాతిరాజు మోహన్‌రావు- విశాఖపట్నం, బి.కవిత- ప్రొద్దుటూరు (కడప), పి.త్రివిక్రమ్‌సాగర్- వనపర్తి (మహబూబ్‌నగర్), పాణ్యం రుక్మిణీదేవి- కర్నూలు, మన్నం మాధవి- సత్తెనపల్లి, మచ్చ లక్ష్మీనర్సయ్య- జగాత్యల, బి.ప్రశాంతి- పర్లాకిమిడి (ఒరిస్సా), పమిడి ముక్కల వరలక్ష్మి- చొడవాడ (విశాఖపట్నం), ఎమ్.నీలిమ- పాల్వంచ (ఖమ్మం), టి.సత్యనారాయణ- గూడూరు, ఎమ్.శ్రీరామ చంద్రమూర్తి- కర్నూలు, రాపాక శరణ్‌దేవి- హైదరాబాద్, వి.మురళి కృష్ణా- న్యూఢిల్లీ, కె.వి.రమణారెడ్డి- హైదరాబాద్, మామిడి మహేంద్ర- పూణే, కె.సత్యసాయికుమారి- హైదరాబాద్, జి.జయ చంద్రగుప్త- కర్నూలు, జి.జయలక్ష్మి- కర్నూలు, జి.కళ్యాణి- కర్నూలు, ఎమ్.కృష్ణారావు-తణుకు (ప॥గో॥జిల్లా), పి.రమణ- హైదరాబాద్, కిషోర్‌కుమార్- గోదావరి 8 ఇంక్లైన్ (కరీంనగర్), ఎమ్.రామరావు- ముంబాయి, పి.రంగమణి- కుర్గారోడ్ (ఒరిస్సా), కె.సృజన- రాజమండ్రి, కూడూరు సత్యనారాయణ- కడప, ఎస్.కె.నాగేశ్వరరావు- పెనుగొండ (ప॥గో॥జిల్లా), పి.సమన్వయ్‌రెడ్డి-చిత్తూరు, చివుకుల చిరంజీవి- ఒంగోలు, భువనగిరి ప్రభాకర్- హైదరాబాద్,

## రెండు తప్పులతో వ్రాసిన వారు:

బి.సత్యసాయి శ్రీనివాస్- సిల్‌క్యాంవన్ (ఖమ్మం), ఈ.ఝాన్సీలక్ష్మి- సికింద్రాబాద్, కె.కనకాచారి- నల్గొండ, జ్యోతి పట్నాయక్- కొరాపుట్ (ఒరిస్సా), నీలం రామమూర్తి- కొరాపూట్ (ఒరిస్సా), మండపాక నాగేశ్వర రావు- విశాఖపట్నం, యు.యు.యు- ఎమ్మిగనూరు, బాలస్వామిగౌడ్- వనపర్తి, కోదాటి విజయలక్ష్మి- వరంగల్, కె.వి.ఎస్.ఎన్.ఎస్.శర్మ- రాజమండ్రి, ఉదాలి భాస్కరయ్య- చెన్నై, పాలెపు శ్రీనివాస్- కొంతమూరు (రాజమండ్రి), సి.యామిని- హైదరాబాద్, ఎం.సోమశేఖర్- బెంగుళూరు, కె.అనుపమ- కంచిపురం, పి.మీనాకుమారి- పాలెం, సి.శారదాదేవి- హైదరాబాద్, నిర్మల క్రిష్ణ- తిరుపతి, కె.వి.సత్యవతి- హైదరాబాద్, చుక్క వేంకట నారాయణరెడ్డి- దువ్వపేట (శ్రీకాకుళం), జి.బాలత్రిపుర సుందరి- శ్రీకాకుళం, ఆర్.పుల్లోయమ్మ- తెనాలి, జి.కళ్యాణి శర్మ- కర్నూలు, షేక్.ఇషాన్- విజయనగరం, కొమ్మి వెంకట సుబ్బయ్య- గుంటూరు, ఏ.బి.వి.ఎన్. రమేష్- వేలూరు (తమిళనాడు), ఎస్.శివశ్వేత- దేశ పాత్రుని పాలేం (విశాఖజిల్లా), ఆర్.శ్రీనివాస్ - హైదరాబాద్, ఐ.ఇమంది రాజేశ్వరి- విశాఖపట్నం, ఎమ్. వెంకట దుర్గ- సామర్లకొట (తూ॥గో॥జిల్లా), ఎస్.పి. మధుసూధన్- తిరుపతి, సి.హెచ్. గణేష్- ఉప్పునుంతల (మహబూబ్‌నగర్), ఎన్.జగన్మోహన రావు- కరీంనగర్, పి.పాపారావు- విశాఖపట్నం, డాంకె.సంజీవ్‌కుమార్- నవీపేట్ (నిజామాబాద్), బి.శ్రీనివాస్- సికింద్రాబాద్, జి.సురేష్ చౌదరి- తాడేపలిగూడేం, ఎమ్.శ్రీ అనుదీప్- కాకినాడ, జి.బి.లక్ష్మి- హైదరాబాద్, జి.రాఘవేంద్ర రావు- హైదరాబాద్, వి.వి.సూర్య నారాయణ- కాకినాడ, ఆర్.సంపూర్ణ- హైదరాబాద్, టి.రేణుకా దేవి- హైదరాబాద్, మునిశెట్టి శ్రీనివాసమూర్తి- మదనపల్లె, సి.హెచ్.కళ్యాణ్ చక్రవర్తి- బెర్హంపూర్ (ఒరిస్సా), వరదా సాయికుమార్- పర్లాకిమిడి (ఒరిస్సా), వై.రోశిరెడ్డి- సత్తెనపల్లి (గుంటూరు), భాస్కర భాగ్యలక్ష్మమ్మ-అనంతపురం, పి.మణి భూషణాచారి- హైదరాబాద్, డి.వై.ప్రమీల- విశాఖపట్నం, సి.హెచ్.సూర్యా బాల- చీపురుపల్లి (విజయనగరం), టి.వి.ఎస్. శాస్త్రి- గుంటూరు, కె.జ్యోతిమహేష్- ఖమ్మం, జి.రాధిక హరినాథ్- ముంబాయి, ఎస్.ఎస్.ఎస్.ఎస్.మూర్తిబాబు- ఆకివీడు.

## మూడు తప్పులతో వ్రాసిన వారు:

సగిలి రవికుమార్- బద్వేల్ (కడప), కె.ప్రజ్వాల్ బాబు- కర్నూలు, సి.హెచ్.మహేష్- కాకినాడ, తిరుమళ్ళ శ్రీనివాస్- చీరాల (ప్రకాశం), తొడేటి సుదర్శనం- హన్మకొండ, కొత్తూరి తిరుపతి- సుల్తానాబాద్ (కరీంనగర్), యం.వేణుగోపాల్- ఆదిలాబాద్, మూటి రఘువీర్- సికింద్రాబాద్, పి.స్వప్న- తెనాలి (గుంటూరు), ఎస్.ఇ.రావు- హైదరాబాద్, అవసరాల ప్రసన్నకుమార్- విశాఖపట్నం, లుంచూరు లక్ష్మీప్రసాద్- హైదరాబాద్, పి.లక్ష్మీదేవి- కర్నూలు, వి.ఎస్.ఆర్.శాస్త్ర- దామరచెర్ల (నల్గొండ), కె.ఎస్.ప్రసాద్- హైదరాబాద్, ఎమ్.వి.ఎస్.ఎన్.శాస్త్రి- విజయవాడ, సౌమిత్రి రమణాచార్య- హైదరాబాద్.


ప్రేక్షకుల హర్షంతో, కలక్షన్ల వర్షంతో
తడిసి 'ముద్దవుతున్న'
సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్
వర్షం
dts ES
యం.యస్.రాజు
శోభన్
పరుచూరి బ్రదర్స్ ✦ ఎస్. గోపాల్ రెడ్డి ✦ దేవిశ్రీప్రసాద్ ✦ సిరివెన్నెల ✦ బి.భాస్కర్ రాజు ✦ కె.వి.కృష్ణారెడ్డి ✦ వీరు పోట్ల ✦ అశోక్ కుమార్

